# తెలుగు పత్రికల సాహిత్య సేవ

★

డా. తిరుమల రామచంద్ర

# తెలుగు పత్రికల సాహిత్య సేవ

పత్రకార శిరోమణి

డాక్టర్ తిరుమల రామచంద్ర

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1645 ప్రథమ ముద్రణ : జనవరి, 1989

ప్రతులు : 1000

విపులీకృత ముద్రణ : మే, 1992



టైటిల్ డిజైను : రమ

గ్రంథాలయ ప్రతివెల : 50-00

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞానభవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్

హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం,
గుంటూరు, తిరుపతి, హనుమకొండ,
అనంతపురం, కాకినాడ.

ISBN : 81-7098-115-8

---

ముద్రణ : లక్ష్మి గణపతి ప్రింటింగ్ ప్రెస్,
SRT 199, 1-1-379-50/1, జవహర్‌నగర్,
హైదరాబాద్ - 500 020.

# అంకితం



ఈశ్వరరావు గారూ!

మీ మానసం మానస సరోవరం. కనుకనే మీ ఆలోచనలు, భావాలు, వాటికి శ్రవ్యరూపాలయిన మాటలు, వాటికి దృశ్యరూపాలయిన వ్రాతలు రాజ హంసలు. అవి ఎవ్వరినైనా సవ్యంగా స్పందింపజేస్తాయి.

మీరు మహాముని సదృశులు. పెదవి దాటితే పృథివి దాటుతుందన్నది మీ మనస్తత్వం. మీరు ఇతరులను పల్లెత్తుమాట అనడం నాకు తెలియదు. అందుకే మీ వాక్కుకు అంతటి శక్తి.

మీరు అజాత శత్రువులు. అందువలననే మీ రచనలు మీతో ఏకీభవించని వారిని కూడ మురిపిస్తాయి.

మీరు ఉత్తమ పండితవంశ సంజాతులు. ఆకారణంగానే మీ ప్రతికదలిక లోను ఉత్తమ సంస్కారం తొణికిసలాడుతూ ఉంటుంది.

సజ్జనులలో సజ్జనులైన మీకు నా ఈ చిన్న చెలిమికానుక; స్వీకరించండి.

హైదరాబాద్
విభవ సంక్రాంతి

తిరుమల రామచంద్ర

# మనవి మాటలు

చంద్రదంగారు (శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు గారు) నమ్మిన సిద్ధాంతాన్ని ఆసిధారా వ్రతంగా ఆచరించిన కర్తవ్య పరాయణులు. ఆ సజ్జనుల స్మారక సభలో - 1985 లో చదివిన వ్యాస మిది.

అద్దంలో కొండగా తెలుగు పత్రికల సాహిత్య సేవను దీనిలో తెలిపాను నాకున్న శక్తి జిజ్ఞాసల కొద్దీ విషయాలు సేకరించాను. మానవుడు సర్వజ్ఞుడు కాడు. కనుక దీనిలో లోపాలు ఉంటాయి. వాటిని పాఠకులు తెలిపితే సవరించు కొంటాను.

ఈ వ్యాసానికి ఎన్నో పుస్తకాల సాహాయ్యం తీసుకొన్నాను. మిత్రులు, సహృదయులు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు నోట్సుకూడ ఉపయోగించు కున్నాను.

ఇది 1986 లో విశాలాంధ్రలో ధారావాహికంగా ప్రచురితమైంది. ఇప్పుడు విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్వాహకులు దీనిని పుస్తకరూపంగా వెలువరించారు. దీనికి డాక్టర్ రమాపతిరావు గారు 'వినయపత్రిక' అనే పేర పీఠిక వ్రాశారు.

వారికి, విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి కృతజ్ఞుణ్ని. దీనిని మిత్రులు శ్రీ సెట్టి ఈశ్వరరావుగారికి స్నేహ కుసుమంగా అందజేస్తున్నందుకు ఆనందిస్తున్నాను.

హైదరాబాద్
విభవ సంక్రాంతి

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# ద్వితీయ ముద్రణ విజ్ఞప్తి

ఈ పుస్తకం ఇంత త్వరలో ద్వితీయముద్రణ పొందినందుకు చాల సంతోషిస్తున్నాను. ఈ ముద్రణలో మరికొన్ని పత్రికల వివరాలు చేర్చాను; కనుక రెండింతలకు మించింది.

ఈ పుస్తకం ఇంత జనాదరం పొందడానికి కారణం విశాలాంధ్ర ప్రచురణాలయం కృషే. ఈ సంస్థకు మరొకమారు కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

నా చిరకాల మిత్రులు డాక్టర్ పి. టి. రెడ్డిగారి సతీమణి, వక్త్రి, విదుషీమణి, అధికార భాషా కమిషన్ అధ్యక్షులు డాక్టర్ పి. యశోదారెడ్డిగారు ఈ ద్వితీయ ముద్రణకు 'వాస్తవపు మాట' వ్రాశారు. వారికి కృతజ్ఞతలు. వాగ్వల్లిని 38వ పుటలో పేర్కొన్నాను. అది నాకు లభించనందున దాని వివరాలు ఇవ్వలేకపోయాను.

హైదరాబాద్-380 — భాషా సేవకుడు

ప్రజోత్పత్తి ఫాల్గుణ పూర్ణిమ — తిరుమల రామచంద్ర

18-3-1992

# వినయ పత్రిక

శ్రీ తిరుమల రామచంద్రగారు 'తెలుగు పత్రికల సాహిత్య సేవ' అనే ఈ చిన్న పుస్తకంలో అపురూపమైన, అమూల్యమైన విశేషాలు ఎన్నో సేకరించి ఇచ్చారు. వారు ఏ విషయాన్నయినా సూటిగా స్పష్టంగా వస్తునిష్ఠంగా నిర్మలంగా ప్రతిపాదిస్తారు. పాండిత్యమూ, లోకానుభవమూ, జిజ్ఞాస పరిశోధన తత్పరత, సత్యగవేషణ వారి రచనలలో పూరాగా కనబడుతాయి. ప్రాకృత సంస్కృతాంధ్ర సారస్వతాలలో గొప్ప పండితులు వారు; తక్కిన ద్రావిడ భాషలన్నీ చక్కగా తెలిసినవారు, మనస్వి, మాన్యులు.

అచ్చువచ్చి పత్రికలు బయలుదేరిన తర్వాత భాషా సాహిత్యాల వ్యాప్తీ వికాసమూ త్వరితగతి సంతరించుకున్నాయి. విద్యుత్తును కనుక్కొన్న తర్వాత పారిశ్రామిక వికాసానికి అది ఏ విధంగా తోడ్పడిందో అచ్చుయంత్రం చేయడం మొదలైన తర్వాత పుస్తక ప్రచురణమూ, వార్తాపత్రికా ప్రసారమూ సాహిత్య లౌకిక జీవితాన్ని అత్యంతం ప్రభావితం చేశాయి. లోకపు తీరే మారి పోయింది. పారలౌకికం కాదు, అపార లౌకికం విచారించడన్నాయి పత్రికలు.

పత్రిక అనే ఈ పేరు మొదట వ్యవహారకాండకే పరిమితం; వ్యక్తుల మధ్య క్రయ విక్రయాల ఒప్పందం మొదలైనవి వ్రాతపూర్వకంగా భద్రపరచు కోవటానికే వ్యవహృతం. ఆ తర్వాత వ్రాతపూర్వకంగా పరస్పరం తెలుసుకొనే వర్తమానానికి కూడ ఈ పారిభాషికపదం ఉపయోగంలోకి వచ్చింది. పెళ్ళి పత్రిక మొదలైన వ్యవహారంలో విస్తృతార్థసిద్ధిని పొందింది.

వ్రాత కోతలకు మొదట భూర్జపత్రాలు, తాటాకులు మాత్రమే ఉప యోగంలో ఉండేవి. అందుకనే దేనిమీద వ్రాస్తారో వాటిని పత్రికలుగానే భావించారు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా విశ్వ విఖ్యాత పరమాణు శాస్త్రవేత్త స్వామి జ్ఞానానంద హిమాలయపర్వత సానుసీమల్లో ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నులైన సందర్భంలో 'పూర్ణ సూత్రాలు' అనే యోగ దార్శనిక సూత్రాలను భూర్జ పత్రాలపైన వ్రాశారు. తర్వాత జర్మనీ వెళ్ళి వాటిని అచ్చు వేశారు. ఈ సూత్రాలాయన ఇంగ్లీషులో వ్రాయడం జరిగింది. భూర్జపత్రాల

మీద ఇంగ్లీషు వ్రాయడం వంటిదే సర్వసంగపరిత్యాగి అవధూతా అయిఉండి ఆయన అణుభౌతిక విజ్ఞానవేత్తగా 'న్యూట్రాన్'ను సర్ జేమ్స్ చాడ్విన్‌తో కలిసి ఆవిష్కరించడమనే అద్భుతోదంతం.

తాటి ఆకులమీదనే రాత మూలకంగా తెలుపుకొనే సంగతులు వ్యక్తుల మధ్య ప్రసారం కావడం మూలానే లేఖకు కమ్మ అని కూడ పేరు వచ్చింది. విడియాకులు విడాకులు మొదలైన పదబంధాలను బట్టి కూడా ఆకులపైననే మొదట్లో రాతకోతలు సాగేవని అర్థమవుతుంది. పత్రిక అనే పేరు వార్తా పత్రికకు పత్రం నుంచి ఈవిధంగా రూఢమై ఉంటుంది. శబ్దరత్నాకర నిఘంటువులో పత్రికకు అర్థం "వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడి పత్రము" అని మాత్రమే ఉంది. పత్రం అనే ఆరోపం దగ్గర "వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడి ఆకు" అని అర్థమిచ్చారు ఆచార్యులవారు. అదనంగా వార్తాపత్రిక అనే అర్థం కూడా కూర్చారు కారు. బహుజనపల్లి సీతారామాచార్యులవారు స్వయంగా సాహిత్య పత్రికా ప్రవర్తకులై ఉండి కూడా ఆధునిక వ్యవహారాన్ని సంగతం చేయలేక పోయాను. 25 సంవత్సరాలు శ్రమించి ఒంటి చేతి మీదుగా నిర్వహించిన నిఘంటువు కాబట్టి ఇటువంటి అనవధానతను పట్టించుకోనక్కరలేదు. తర్వాత 50 సంవత్సరాలకు వెలువడ్డ సూర్యారాయాంధ్ర నిఘంటువులో కూడా పత్రిక అంటే 'వ్రాతకాధారమగు తాటియాకు, వ్యవహారమున పరస్పరము వ్రాసికొనెడు పత్రము' అని మాత్రమే ఇవ్వడం చింత్యం. వార్తాపత్రిక అనే అర్థంలోగాని, పెళ్ళి పత్రిక అనే అర్థంలో కాని వివరణం ఇచ్చారు కారు సూర్యారాయంలో. ఈ నిఘంటువు వెలువడేనాటికి తెలుగులో పత్రికలకు శతాబ్ద చరిత్ర ఉంది కదా!

నాకు తెలిసినంతవరకు లేఖ అనే అర్థంలో 'పత్రిక' అనే పదం మొట్టమొదటిసారి ప్రభావతీ ప్రద్యుమ్నంలో కనపడింది. ప్రభావతి పంపిన పత్రిక తీసుకొని శుచిముఖి ప్రద్యుమ్నుడికి చేర్చే సందర్భం అది. అది ప్రణయ సందేశ పత్రిక. 'లవ్‌లెటర్' రాసుకోడం పింగళి సూరన గారికి కూడా తెలుసు నన్నమాట. భాగవతంలో రుక్మిణిదేవి సందేశహరుణ్ని పంపించిందికాని ప్రణయలేఖ పంపలేదు.

వ్యక్తుల మధ్యకానీ, ఔద్యోగిక సంబంధంగా కార్యాలయాలకూ వ్యక్తులకూ మధ్యకానీ, వ్యాపార సంస్థలకు వ్యక్తులకు కాని, సంస్థలకు కాని లేఖ మూలంగా జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలను, అంటే కాగితంమీద తెలియచేసుకొనే

వ్యవహారాన్ని పత్రవ్యవహారం అనే అన్నారు, మాడపాటి హనుమంతరావు పంతులుగారు; ఆంధ్రోద్యమ చరిత్రలో. ఔత్తరాహులు పత్రికా రచయితను 'పత్రకార్' అన్నారు. ఇంతకూ పత్రంనుంచి పత్రిక ఉద్భవించింది అని పిండితార్థం.

నూటయాభై సంవత్సరాల చరిత్రగల పత్రికా ప్రకటనాన్ని ఆసక్తికరంగా ఏకరువు పెట్టడం సులభమైన పనికాదు.

మద్రాసుకు అచ్చుయంత్రం 1806 ప్రాంతానికే వచ్చినా, తెలుగుదేశంలో అచ్చుపుస్తకాలకు ప్రాచుర్యం 1830ల దాకా లభించలేదని బ్రౌన్ దొర వ్రాశారు. అటు తర్వాత క్రమేణా తెలుగులో పత్రికలు కూడా బయలు దేరాయి.

విశేషం ఏమంటే, పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రతి గొప్ప పండితుడూ, కవీ కూడా ఏదో ఒక సాహిత్య పత్రికను నిర్వహించారు. ఆరోజుల్లో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకొన్న ప్రతి పండితుడు నాటకరచన చేసినట్లుగా పత్రికా నిర్వహణం చేశాడు. కొక్కొండ వేంకటరత్నం, కందుకూరి వీరేశలింగం పంతులుగార్ల వంటివారేకాక వేదం వేంకట్రాయశాస్త్రి. దాసు శ్రీరాములు, వాలిలాల వాసుదేవశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం, జనమంచి శేషాద్రిశర్మగారి వంటి వారు కూడా పత్రికా నిర్వహణకు పూనుకోటం గమనార్హం. పత్రికా ముఖంగా వాక్కలహాలుకూడా జరుపుకున్నారు. 'ప్రతి పూర్ణిమా సాయంతనమున వెలువడును' అనే కొక్కొండ వారి పత్రికా నియతకాలిక ప్రకటన వివరణను వేదం వేంకట్రాయశాస్త్రిగారు ఆముక్తమాల్యాదా సంజీవనీ వాఖ్యలో వెటకారం చేశారు కూడాను, సాయంతనం ప్రయోగం అపహాస్య భాజనంగా ఉందని.

కవి పండితులు పత్రికా ప్రకటనకు పూనుకొన్న తర్వాత ప్రాచీన కావ్యాలను పరిష్కరించి అందులో ప్రకటించారు. అయ్యలరాజు రామభద్రుడి రామాభ్యుదయాన్ని వీరేశలింగం పంతులుగారు ఈ విధంగా మొదట వివేకవర్ధనితో ప్రకటించారు. ఈ నూటయాభై సంవత్సరాలలో-అంటే షష్టిహాయన కాల పరిభ్రమణం తాలూకు రెండున్నరచుట్లలో - ఆరు విభాగాలుగా - అంటే 1835,60,85,1910, 1935, 1960 లు ప్రధానమైన మైలురాళ్ళుగా పత్రికల సాహిత్యసేవను అధ్యయనం చేస్తే, ఆసక్తికరమైన విషయాలెన్నో తెలుసుకోవచ్చు. ఫర్లాంగు రాళ్ళతో సహా వివరాలిచ్చారు శ్రీ రామచంద్రగారు.

శ్రీ తిరుమల రామచంద్రగారు వయసులో, ప్రాజ్ఞతలో, పాండిత్యంలో నాకన్న ఎంతో గరిష్ఠులు; సాహిత్య లోకంలో వరిష్ఠులు. ప్రాకృతాల కాలంలో అలనాటి ఆచార్య హేమచంద్రుల వంటివారు ఈనాటి రామచంద్రాచార్యులవారు. ఈ పరిచయ వాక్యాలు వ్రాయవలసిందిగా వారు నన్ను కోరడం వారికి నాపట్ల అభిమానం ఉండటమే ప్రోద్బలకం. ఈ పుస్తకం తెలుగునాట తెలుగులో వచ్చిన సాహిత్య పత్రికలను గురించి కాబట్టి ఈ వినయ పత్రికను వారిచేతుల్లో ఉంచుతున్నాను.

హైదరాబాద్
14-1-1989

**అక్కిరాజు రమాపతిరావు**

# వాస్తవపు మాట

సాధారణంగా కుమ్మరి పురుగునుగూర్చి చెప్పవలసివచ్చినప్పుడు 'అబ్బబ్బా! పొద్దస్తమానం ఏదో పోగొట్టుకున్నట్లు తండ్లాడుతూనే ఉంటుంది. ఏం సంపాదించుకుంటుందో?' అంటూ వ్యాజనిందగా విసుక్కోవడం కద్దు. ఆ విధంగానే కొందరు వ్యక్తులు నిత్యవ్యవసాయోపజీవులై పరిశోధనలో జీవిస్తూ ఉంటారు, ఈ విశిష్టమైన కోవలో చేరిన వ్యక్తి తిరుమల రామచంద్రగారు. ఏళ్ళు నిండినకొద్దీ రాటుదేలిన చురుకుదనంతో సంవత్సరానికో పుస్తకంగా వ్రాస్తున్నారు. వారు వ్రాస్తే వ్రాస్తారు బాగానే ఉంది కానీ 24 గంటల వ్యవధితో రెండు పేజీలు మాత్రమే పీఠిక వ్రాయుమంటూ నాముందుంచుతారు, నానానేక విషయ సర్వస్వమంతా నా అరచేతిలో బొంగరంలా ఉన్నట్లు. అందుకేనేమో హితోపదేశంలో వోచోట 'మాతృజంఘాహి స్తంభీభవతి వత్సస్య బంధనాత్' అంటూ ఇలాంటి ఆత్మీయులు తెచ్చిపెట్టే చిక్కులను పసికడ్తూ చెప్పినట్లుంది.

తిరుమల రామచంద్రగారికి రచనా వ్యాసంగం ఒక తపన; అందులో పత్రికా సంబంధిఐన ప్రక్రియ అంటే దానికి పుట్టుపూర్వోత్తరాలతో సహ భాష్యం చెప్పవలసిందే. అది వారి పట్టుదలకూ, పరిశ్రమకూ తార్కాణం. ఇప్పుడు వీరు అందించబోయే కొత్త పుస్తకం 'తెలుగు పత్రికల సాహిత్య సేవ'. దీనిపేరు చాలు పాఠకులతో చదివించేందుకు. పేజీలు తిప్పినకొద్దీ వేడి వేడిపకోడీల్లా నోరూరిస్తూ విషయమంతా ఆకర్షకమై పూర్తిగా చదివిస్తుంది. పుస్తకం సాంతం ముగిసిన తరువాతగాని, విత్తు కొంచెం చెట్టు ఘనం అనే సామెతను జ్ఞప్తికి చేసుకోక తప్పదు. రామచంద్రగారు ప్రారంభంలోనే వార్తా పత్రికా సంప్రదాయం 16 వ శతాబ్ది ఉత్తరార్ధం చివరనే రాయవాచకంతో ఉద్భవించిందనవచ్చు అంటూ చెప్పి మన వార్తా సంప్రదాయాన్ని కొన్నివేల సంవత్సరాలు ముందుకు తీసుకొని వెళ్ళే ఆలోచనలకు అంకురార్పణం చేసినారు.

మన భారతీయులు అఖ్యానప్రక్రియలో "వార్తా" విశేషాన్ని చేర్చి చెప్పడం మనం గమనించక తప్పదు. అట్లే నిదానంగా ఆలోచిస్తూపోతే 'నారదుడు' తొలి వార్తాహరుడుగా మనముందు నిలువక తప్పదు. నిజానికి నారద మహర్షిని మించిన, సజీవజంగమ వార్తాపత్రిక మరొకటి లేదంటే అతిశయోక్తి

లేదేమో. అట్లే తొలి పౌరాణికులైన శివ, స్కంద, మైత్రేయ, సూతాదులను గ్రహించవచ్చు. ఆ తరువాత ముంజేతి చిలుకలు, సాలభంజికలు, హంసలు, చారులు, భద్రులూ, మంత్రులూ. యాత్రికులు, దండనాథులంతా వార్త లందించినవారు కాగా, ధర్మసత్రాలు, ద్యూతశాలలు, వేశ్యాభవనాలు, పానగృహాలు, బౌద్ధసంఘారామాలు, జైనవసతులు, దేవీమందిరాలు వార్తా సేకరణ స్థలాలుగా ఉపకరించాయి. ఈ వార్తలను శాసనాలవల్ల, దండోరా, టముకు, మొదలైన ఇతర సాధనాలతో ప్రజానీకానికి అందించే వారంటూ గత వర్తమానాలకు ఒక లంకెను కల్పించడానికి ఆస్కారాన్ని కలిగిస్తున్నది ఆ ఒక్క వాక్యం.

మరొక విశేషం రామచంద్రగారు తొలినాళ్ళ పత్రికలనుగూర్చి వ్రాస్తూ 'సత్యదూత' అనే పత్రిక విషయం ముచ్చటించారు. ఇంతవరకు పరిశోధించిన పెద్దలందరూ సత్యదూత ప్రాముఖ్యాన్ని ప్రశంసిస్తూనే దాని ఉనికిని చూడలేదన్న విషయాన్ని చిత్తశుద్ధితో పేర్కొన్నారు, కానీ నా అదృష్టవశాత్తు నాతో పిహెచ్. డి. పట్టానికై కృషి చేసిన ఒక విద్యార్థి శ్రీ ఆరుద్రగారి సలహాతో మద్రాసు ఆర్కైవ్స్‌తో ఆ పత్రికను కనుక్కోగలిగినాడని చెప్ప డానికి సంతోషిస్తున్నాను. ఈ విధంగా రామచంద్రగారి పరిశోధన ఈనాటికి పేర్లు కూడా తెలియని అనేక పత్రికలు, పత్రికాధిపతులూ, ఆ పత్రికల్లో వచ్చే సాహిత్య స్వరూపాన్ని కూడా ప్రదర్శిస్తూ ఆంధ్ర సాహిత్య చరిత్ర నిర్మాణానికే కాకుండా తెలుగువారి సాంఘిక చరిత్రను కూడా తిరిగి రచించడానికి అనువైన అజ్ఞాత సత్యాలను పేర్కొన్నది.

ఈ పుస్తకంలో పరీక్షాపత్రాల స్వరూపం, బాలసాహిత్యం, మహిళా సమస్యలు, వేశ్యావిముఖత, కృతి విమర్శనం, ప్రచురణ సంస్థల అవతరణం, సాహిత్య విమర్శల తీరు, అముద్రితగ్రంథ చింతామణి, నవశకంలో సాగిన చైతన్యం, సంపాదకుని గుర్తింపు, సంపాదకీయాల తీరు, వ్యవహార భాషా వాదం, శాసన ప్రచురణ కళ, గౌరవాచార్యపదవి, తెలంగాణా సాహిత్య పత్రికలు, భావికవిత్వపు మలుపు, కమ్యూనిస్టు పత్రికలు, అభ్యుదయవాదం, పత్రికల భాష, వ్యాసం మొదలైన విషయాలన్నిటినీ హిరణ్యాక్షుడు భూమి నంతా చాపచుట్టగా చుట్టినట్లుచుట్టి చూపినారు. అయితే ఈ విషయాలన్నీ సమగ్రంగా చర్చించినారంటూ తనవాడు కదా అని శతిశయోక్తులు పలకడం ఉచితం కాదు. ఈ విషయాలన్నీ ఒక్కొక్కటి ఒక్కొక ఉత్తమ గ్రంథంగా సిద్ధం కావలసిన గౌరవం, ఉదాత్తత, అవసరం కలిగినవి. ఇన్ని ఉన్నాయి అంటూ చూపడానికి దివిటీగా ఉపకరిస్తుంది ఈ పుస్తకం.

అన్నిటికన్నా ప్రధానంగా అధికారభాషా సంఘాన్ని ఆలోచింపచేస్తూ ఇకముందు ఈ పనులు చేతబట్టి ఒక పథకంగా పరిశోధన చేయవలసిన విషయాలు నాకు ఈ పుస్తకంలో రామచంద్రగారు గుర్తు చేసినట్లుగా భావిస్తున్నాను. నిజానికి ఆయా కార్యాలయాల్లో తెలుగును అధికారభాషగా పతిష్ఠం చేయవలసిన తరుణంలో మన పూర్వులు వ్రాసుకునే ఉత్తర ప్రత్యుత్తరాలు, జరుపుకున్న వ్యవహార విధానం అంతా లిఖిత రూపంలో దొరికితే బాగుండును అని ఆలోచిస్తున్న సమయంలో వీరు ఈ పుస్తకంలో ఎడిటరుగార్కి, సి.పి. బ్రౌన్ దొరగారికి వ్రాసుకున్న అర్జీలు, లేఖలు మొదలైనవాని నకలును, నమూనాగా ఇచ్చి ఎంతో ఉపకారం చేసినట్లు భావిస్తున్నాను. ఆ విధంగా అప్పుడు వాడుకలో ఉన్న విలేఖక, ఉపలేఖక, స్వీకర్త, పాఠక పదాలను ఎడిటర్, రిపోర్టరు, చందాదారు, మొదలైనవారికి ఉపయోగించవచ్చునా? లేక ఆ మార్గంలో మరేవైన కొత్తపేర్లను తెలుగుతనానికి దగ్గరగా మార్చుకోవచ్చునా అనే ఆలోచనకు దోహదం చేసింది. ఇట్లే నౌకరీపాయ, దాఖలు చిత్తగించుట, ఏలినవారి ఘనతను వినయంగా ప్రార్థించుట, సమ్ముఖమునకు మనవి వ్రాసుకొనుట మొదలైన పదాలు కార్యాలయ అధికారభాషా దృష్టితో పరిశీలనార్హాలుగా ఉన్నాయి.

రామచంద్రగారు ప్రత్యేకిస్తూ "ప్రశంసలూ, ఒప్పుల కుప్పలేకావు, దొసగులను చూపుతారని మిమ్ములను కోరింది" అన్నారు. మంచిని చెడ్డ అంటూ ఎట్లా చెప్పను? అయినా ఏదో ఒకటి చూపక తప్పదు. అందుకే నాకు తెలిసిన పత్రికల పేర్లన్నీ పనిగట్టుకుని మననం చేసుకున్నాను, నాకు కలసివచ్చినట్లుగా ప్రసిద్ధమైన సాహిత్య పత్రిక వాగ్వల్లి పేరు కనిపించలేదు, నా రంధ్రాన్వేషణ ఫలించినట్లుగా, అది మాత్రం కొరతగా ఉంది అని చెప్పడానికి సాహసిస్తున్నాను.

ఆయా సందర్భాల్లో పరిచితులైన కొందరు వ్యక్తులను ఎంతో గౌరవంతో స్మరిస్తూ వారి సాహిత్య సేవలను గుర్తిస్తూ ఒక సహృదయుడైన సాహిత్య చరిత్రకారుడుగా, విమర్శకుడుగా, ఆధునిక విషయాసక్తుడైన రచయితగా రామచంద్రగారు ముద్ర వేసుకోగలిగినారు. చదివించగలిగిన, చదువదగిన పుస్తకం ఇది.

సుధర్మ
నారాయణగూడ
హైదరాబాద్-29
18-3-1992

**డా॥ పి. యశోదారెడ్డి**
అధికార భాషా సంఘం అధ్యక్షులు

# విషయసూచిక

# తెలుగు పత్రికల సాహిత్యసేవ

## తెలుగు పత్రికల ఆవిర్భావం

ఒకవిధంగా చూస్తే తెలుగులో వార్తాపత్రికా సంప్రదాయం 16వ శతాబ్ది ఉత్తరార్ధం చివరనే మొదలైందనవచ్చు; తొలి తెలుగు వార్తాపత్రిక ఉద్భవించిందనవచ్చు. అది రాయవాచకం.[1] దీని రచయిత విశ్వనాథనాయకుని స్థానాపతి. ఈ రచన విజయనగర సార్వభౌముల, ముఖ్యంగా కృష్ణరాయల సమాచారం తెలిపే ఆకరంగా ప్రభవించింది. ఇది ఒక విధంగా డైరీకూడా. ఇలాటిదే కన్నడంలో రామరాజన బఖైరు. కాని ఇవి నేటి పత్రికల దృష్టితోనే కాక ఇతర దృష్టితో చూచినా సంపూర్ణ వార్తాపత్రికలు కావు. కనుక తెలుగులో ఆధునిక సాహిత్య ప్రక్రియలైన కథ, నవల, వ్యాసం, ఆత్మాశ్రయ కవితల లాగే పత్రికా రచన కూడా పాశ్చాత్య ప్రభావంతో పూచిన సారస్వత ప్రక్రియా ప్రసూనమేనని అందాం. సాహిత్య ప్రక్రియలలో ఇది అన్యతమ మయినా అన్ని సాహిత్య ప్రక్రియలను అందించగల - ఏకకాలంలోనే అందించగల విశిష్టత దీనికి ఉంది.

భారతదేశంలో ఈ విధంగా అవతరించిన తొట్టతొలి పత్రిక ఢగ్దర్శన్. ఇది 1818 - లో వంగ రాష్ట్రంలో శ్రీరాంపూర్‌లో అవతరించింది. సంపాదకుడు మార్షమేన్.[2] అటు తర్వాత మరి 14 సంవత్సరాలకు కాని తెలుగులో పత్రిక వెలువడలేదు.

తెలుగులో మొదటి పత్రిక కర్నాటిక్ క్రానికల్ అని,[3] ఇది మద్రాసు నుంచి వెలువడేదని డా. జి. ఎన్. రెడ్డి అంటున్నారు. ఈ పత్రిక ప్రతులేవీ

---

1. రాయవాచకం - సంపాదకులు డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్య
2. వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన; పుట 180 -
   డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు (1972)
3. Modernisation of Indian Languages in News Media లో Style in the Telugu Journals వ్యాసం; పుట 133.

దొరకలేదు కాని ఒక తమిళ తెలుగు పత్రికకు అనుమతి ఇచ్చినట్లు రెవరెండు జె. లాంగ్ అనే పాదరీ 1829లో బెంగాల్ ప్రభుత్వానికి పంపిన నివేదికలో పేర్కొన్నారు. ఆయన దానిపేరు చెప్పలేదు. కాని లండన్ నుంచి వెలువడే ఏషియాటిక్ జర్నల్ 1833 నవంబర్ సంచికలో ప్రచురితమైన పుస్తక సమీక్షను బట్టి దానిపేరు 'కర్నాటిక్ క్రానికల్' అని డాక్టర్ రెడ్డి నిరూపించారు. ఆ సమీక్ష ఈ విధంగా ఉంది.

**ది కర్నాటిక్ క్రానికల్ :** ఇంగ్లీషు-తమిళ్-తెలుగు భాషలలో ముద్రించిన ఈ పత్రికల ఫైలు (సంపుటి) మాకు అందింది. ఆంగ్ల వ్యాసాలు తెలుగు తమిళాలలోను, తెలుగు తమిళ వ్యాసాలు ఇంగ్లీషులోను అనువదించబడ్డాయి. హిందూస్తాన్‌లోను ఈ పద్ధతినే ప్రవేశపెట్టే ఉద్దేశం వుంది. పత్రిక ఉపోద్ఘాతం "ఇది కేవలం వార్తలను యథాతథంగా పొందుపరచడమే కాని వ్యాఖ్య కాద"ని తెలుపుతున్నది. ఇది బాల్యావస్థకు తార్కాణం. పత్రిక ముద్రణ బాగుంది. వార్తల అనువాదం చాలవరకు మూలానుసారిగా వుంది. ధోరణి మితవాదధోరణిగా వుంది.

## తొలినాళ్ళ పత్రికలు - సత్యదూత

దీనిని బట్టి 1832లోనే తెలుగు పత్రిక తొలిసారిగా ప్రచురితమైందని నిర్ధారించుకోవచ్చు. అటు తర్వాత 1835 లో సత్యదూత అనే పత్రిక వెలువడింది.[1] దీనిని బళ్ళారి నుంచి క్రైస్తవ సంఘం వారు వెలువరించారు. 'సత్యదూత' 1835 లో లేదని ఇది కేవలం ఊహేనని శ్రీ బండి గోపాలరెడ్డి అంటున్నారు.[2] "సిలోన్ మిషనరీ కాన్ఫరెన్స్ (1879) ప్రచురణలో నేను చూచినంతవరకు బళ్ళారి క్రైస్తవ కూటమి తాలూకు సమాచారంలో ఈ ప్రస్తావన లేదు. బళ్ళారి మాన్యుయెల్లులోగాని, గెజిటీర్‌లోగాని దీని వైనం వున్నదీ లేనిదీ నేనింకా చూడలేదు. మద్రాసు ఆర్కైవ్స్‌లో, నేను గాలించినంత వరకు దీనిని గురించిన దాఖలా ఏదీ నా కనుల తగల్లేదు" అని శ్రీ గోపాలరెడ్డి వాదం. చాలామంది పెద్దలు సత్యదూతను గురించి చెప్పారు గనుక, లేదు అనడానికి తగిన బలం లేదు గనుక ఉందనే అనుకుందాం.

ఇంతకూ సత్యదూత మొదటి పత్రిక అని చెప్పినప్పుడు కదా యీ వాదనంతా. 1832లోనే తెలుగు - తమిళ - ఆంగ్ల పత్రిక వున్నట్టు డాక్టర్

---

1. Telugu Journalism Past and Present - శ్రీ దిగవల్లి వెంకట శివరావు, నార్లగారి షష్ట్యబ్దిపూర్తి ప్రచురణ.
2. బ్రౌన్ జాబులు ; పుట 2 - బంగోరె

జి. ఎన్. రెడ్డి తిరుగులేని ఆధారంతో నిరూపించారు గనుక సత్యదూత ఎప్పటి దయినా ఆక్షేపణ లేదు. కాని తెలుగు పత్రికల చరిత్రను చెప్పిన వారంతా ఇంతవరకు సత్యదూత తొలి తెలుగు వారపత్రిక అని చెబుతూ వచ్చారు. వారి మాటల ప్రామాణ్యాన్ని శంకించ నక్కర లేదుగాని డాక్టర్ జి.ఎన్. రెడ్డి చూపిన ప్రమాణం తిరుగులేనిది.

## వృత్తాంతిని (1838-41)

వంగ పత్రిక దిగ్దర్శన్, హిందీ పత్రిక ఉదంత మార్తాండ వంటివి వచ్చిన పిదప మద్రాసులోను తెలుగు తమిళ పత్రికలు నిర్వహించడానికి ప్రయత్నాలు జరిగాయి. 1832 లో మద్రాసు స్థానికులు ఒక పత్రికను స్థాపించాలని గట్టిగా ప్రయత్నించారు. రెండుభాషల వారూ ఒక తెలుగు, మలబార్ (తమిళ) పత్రికలు స్థాపించడానికి అనుమతించవలసిందిగా గవర్నరుకు నలుగురు అర్జీపెట్టుకున్నారు. దీనిని గవర్నరు ఆమోదించి అనుమతించా డనవచ్చు. కనుక 1832 ప్రాంతంలో ఏదో పత్రిక ఉండి ఉంటుంది. అదే ఇంతకు ముందుకు చెప్పిన కర్నాటిక్ క్రానికల్ కాకూడదా!

కాని మనకు అసందిగ్ధంగా తెలుస్తున్న తొలి తెలుగు వారపత్రిక వృత్తాంతిని. దీనిలో ప్రచురించిన జాబులను బ్రౌను సేకరించాడు. గిడుగు రామమూర్తి పంతులుగారు ఈ పత్రికలోని లేఖను తమ గద్యచింతామణిలో ఉదాహరించారు.[1]

దానిని - తొలిపత్రికలోది గనుక, పాఠకులు సంఘ సమస్యలపై ఎంత శ్రద్ధ చూపేవారో తెలుసుకొనడానికి - ఇక్కడ యథాతథంగా ఇస్తున్నాను:-[2]

**వివాహమును గురించిన దుర్వ్యయము :**

మహారాజశ్రీ వృత్తాంతిని ఎడిటరుగారి సముఖమునకు - అయ్యా, ఈ తైనెల పుట్టిన వెనుక మనవారిలో పెద్దమనుష్యులుగా వుండేవారి యిండ్లలో పెండ్లిండ్లు జరిగినవి. వాటిలో రెండు మూడు ఇండ్లకు నేను వెళ్ళియుంటిని. ముహూర్తము వేళకున్నూ పోయినాను. రాత్రులలో కచ్చేరీలకున్ను వెళ్ళినాను. ఈ రెండు వేళల్లో ముహూర్తం వేళకు వెళ్ళినప్పుడు నా మనస్సుకు బహు సంతోషముగా వుండినది. ఆ వేళకు పెండ్లి కుమారుడున్ను, పెండ్లి కుమార్తె యున్ను పందిరిలో కూర్చుండి వారివారికి తగిన ప్రకారం మంత్రోక్తులచేత

1. బ్రౌన్ జాబులు పుట 9 - బంగోరె; గద్యచింతామణి పుటలు; 178-179 సం. గిడుగు రామమూర్తి (1933).
2. ఈ జాబు ఒకవిధంగా ఒక విలేఖరి రిపోర్టు వంటిది.

దేవబ్రాహ్మణపూజ చేయడమున్ను వారివారికి కలిగినమట్టుకు దానాలున్ను భూరి దక్షిణలు ఇవ్వడమున్ను బ్రాహ్మణులచేతనున్ను తమ తమ వారిలో వృద్ధులుగానున్ను పెద్దలుగానున్ను వుండేవారిచేత ఆశీర్వచనములు పొందడమున్ను, యివి యావత్తున్ను మన శాస్త్ర సమ్మతిగానున్ను ఆయా కులాచార సమ్మతిగానున్ను వుంటున్నవి గనుక మహాచక్కగా యుండినది. అయితే రాత్రులలో కచ్చేరి యుంచవలె గదా. పందిరివేసి శృంగారించవలసి యున్నది గదా - అనే ఆలోచన మీద అందుకుగాను పెట్టబోయే ఖర్చుయెంతో అంతమాత్రం రూకలను ముహూర్త వేళలో ఖర్చుఅయ్యే దానిలో లోపంచేసి యిందుకుగాను విధిలేక మిగిలిస్తున్నారు. కచ్చేరి పందిలి నాట్యం వీటిని నిలిపితే - యిందుకుగాను వృథాశలవయ్యే మొత్తాన్ని దానధర్మముల కింద అగత్యంగా సెలవు చేతురనే దానికి సందేహించవలసినది లేదు.

పెండ్లిండ్లలో కచ్చేరీ వుంచటములో వుండే గుణాగుణాలు యేమని యోచనచేసి చూస్తే అనేకవిధాల దోషమే కనిపిస్తున్నదిగాని గుణలేశమున్ను లేదు.

**మొదలెత్తగా :** యీ విషయమై వారి వారి పరువుకు తగిన మట్టుకు 50 వరహాలు[1] మొదలు 1000 రూపాయలు మట్టుకు శెలవయ్యే రూకలు వృథాగా పోతున్నవి.

**రెండోది :** రాత్రులలో నిండా పొద్దుపొయ్యేవరకు మేలుకొని యుండడముచేత యింటి యజమానుడికిన్ని, కచ్చేరీకి వచ్చేవారికిన్ని నిద్రాభంగమై శరీర సౌఖ్యం తప్పిపోతున్నది.

**మూడోది :** కచ్చేరీకి వచ్చేవార్లలో వ్యవస్థ లేక పిలువబడని వారున్ను సామాన్యులయిన వారున్ను రావడమువల్ల యింటి యజమానుడు వార్లను యెరుగకపోయినప్పటికిన్ని, తనకు విహితులు కాకపోయినా తన వియ్యంకుల వారికి విహితుడేమో అని భ్రమించి వారికంతా తాజంచేసి మర్యాదలు చేయవలసి సంభవించినది గదా అని మనస్సులో నొచ్చుకుంటాడు.

**నాలుగోది :** కచ్చేరీకి వచ్చిన వార్లలో నూటిలో తొంభై తొమ్మిది మందికి భరత శాస్త్రములో గాని సంగీతములో గాని విజ్ఞానములేదు. వీర్లు కచ్చేరికి రాగానే గంధం, పుష్పం, పన్నీరు తాంబూలాలు ఇచ్చి, కూర్చుండబెట్టితే యితనికి నాట్యములో రుచిలేదు గనుక రవంత ప్రొద్దు కూర్చుండి యుండగానే నిద్రవస్తున్నది, ఇంటికి పోదామా అని తలుస్తాడు. తనకు ముందర వచ్చిన వారు యింకా వున్నారు. తాను లేస్తే మర్యాదగా ఉండదు. యిటుండగా యింకా

---

1. వరహా 3½ రూపాయలు అని ప్రౌఢ్యము.

కొందరు కచ్చేరికి తనకు వెనుక వచ్చినవారు వేరే తావు లేకపోతే, తన్ను పృష్ఠ భాగముతో తోసి తనకు ముందర వచ్చి కూర్చుంటారు. వద్దని చెప్ప జాలడు. దీనికిన్ని సహించుకొని యాలవచ్చినామని తనలోతాను నొచ్చు కుంటాడు. ఇట్లా కొంతసేపు కూర్చుండి యెవరైనా ఒకరు లేస్తే ఆ సమయము చూచి ఈమట్టుకు బ్రతికినామని తానున్ను కూడ లేచి వెళ్ళిపోతున్నాడు.

**అయిదోది :** యిందులో యింటివాడికైనా కచ్చేరీకి వచ్చిన వారికైనా యేమైనా సార్థకము కద్దా అని విచారిస్తే యెవరికిన్ని యేమీలేదు. 15 సంవత్స రాలకు మునుపు వరకు కచ్చేరీకి వచ్చేవారు నాట్యమాడుతూ యుండే దాసీకి రూపాయలు వేసే మర్యాదకద్దు.

దాని వలన యింటివాడికి కొంచెం కూడుదల యుండినది.

ఇప్పుడు ఒక దబ్బు కూడవేసే మర్యాద లేదు. కచ్చేరీకి వచ్చిన వార్లలో ఎవడో వకడి యందు మోహించినట్లు వాణ్ణి లాగే కొరకై నటించే దాసి తన అభినయములచేత వాణ్ణి మాత్రమే రంజింప చేస్తున్నది. కొదవ వారందరున్ను నిష్ప్రయోజకులయి దాని రూపలావణ్యముల జూచి భ్రమించి యింటికి వెళ్ళిన వెనుక దాన్ని తలంచుకొని నిద్రపట్టక వృథాగా చెడిపోతున్నారు. నర్తనముచేసే దానికైనా యేదైనా ప్రయోజనముకద్దా అని చూస్తే కచ్చేరీకి వచ్చినవారు రూపాయలు వెయ్యకపోయినారు. నాలుగైదు రాత్రులు నిండా కష్టపడి నిద్ర మాని తన అభినయములచేతనున్ను తాను పాడే పదాల చేతనున్ను స్త్రీలకున్ను పురుషులకున్ను వుండే మర్యాదలను తప్పి సభలో నిలుచుండి సౌజ్ఞలచేతనున్ను యుక్తుల చేతనున్ను కొన్ని రహస్యాలనంతా బయలుచేసి లజ్జవిడిచి మానము చెడి యింత కష్టపడ్డవెనుక యింటియజమానుడి వద్దకి వెళ్ళి దేహీ అని అడిగితే అతనికి ఇష్టంవచ్చిన మట్టుకు యేమి యిచ్చినా తీసుక్కపోతున్నారు గనుక వీరికిని కష్టానికి తగిన ఫలప్రాప్తిలేదు.

**ఆరోది :** యీ కచ్చేరిని వుంచడంవల్ల సంభవించిన ముఖ్యమైన కీడు యేమంటే కచ్చేరీచేస్తూ యుండేటప్పుడు యిదివరకు స్త్రీల ముఖం చూడని పిల్లకాయలు కొందరు వచ్చి కూర్చుంటారు. వారు యీవరకున్ను విద్యార్థులై చదువుకొంటున్ను ఈ లోకవ్యాపారాలు యేదిన్ని తెలియనటువంటి వారుగా నున్ను వుండి వున్నారు. యీ కచ్చేరీకి వచ్చిన వెనుక యిక్కడ నర్తనం చేస్తూయుండే దాసీ కన్యకను చూచిన్ని నటిస్తూ యుండేటప్పుడు దాని నానావిధ వ్యాపారాలనున్ను చూచి అది పాడే శృంగార పదాలనున్ను చేష్టలనున్ను నేర్చుకొంటారు. అవతల యీ విధమైన సల్లాపాలయందు చిన్నవాండ్లకు బుద్ధిపుట్టి చదువుమీద జ్ఞాపకం తప్పి ఈ దాసీల ఇండ్లకు పోవలననే - వక

ఆపేక్ష మనస్సులో కలిగి మహారాజుల యిండ్ల చిన్నవాండ్లయితే ప్రామిసరీ నోట్లు వ్రాసియిచ్చి డిస్కౌంట్‌చేసి రూకలు సంపాదించుకొని వారి యిండ్లకు పోతారు. పేదవానింటి చిన్నవాండ్లయితే యెక్కడైనా దొంగిలించి రూకలు సంపాదించి వారి యిండ్లకుపోయి వ్యాధిని సంపాదించుకొని భ్రష్టులయి చెడిపో తున్నారు. దృష్టాంతానికి కావలసియుంటే అనేక పేర్లు ఉదాహరించగలను. అయితే గడిచిపోయిన వాటిని చెప్పినందువల్ల సార్థకంలేదు గనుక వారిపేర్లను చెప్పవలసిన అగత్యము లేదు. ఇంకా అనేక దోషాలు వున్నవి. ఇది అందరికిన్ని తెలిసిన సంగతే గనుక విస్తరించవలసిన నిమిత్తములేదు. నాయొక్క తాత్పర్యమేమంటే యీ కచ్చేరీలకు మంచి దాసీలను రప్పించే టందువల్ల మనమై మన పిల్లకాయలకు దుష్టచేష్టలు నేర్పిస్తున్నాము.

గనుక యికమీదను పెండ్లిండ్లు చేసే వారు కచ్చేరి పందరివేసి అక్కడికి దాసీలను రప్పించి నాట్యము చేయించేదిమాని దానికి పట్టే ఖర్చులను ముహూర్తము వేళలో దానధర్మాలున్ను బంధువులకున్ను బ్రాహ్మణులకున్ను అన్నం పెట్టించి తృప్తి చేయిస్తే బంధువులుగాక స్నేహితులునున్ను యిష్టులుగాను పెండ్లికి వచ్చేవారిని యెట్లా తృప్తి చేయవచ్చునని అడిగితే, వారికి యావత్తును వకనాటికి బ్రాహ్మణులను కొని వంట చేయించి విందుచేసి ఆ విందు ప్రయుక్తమయి సంగీతములో విద్వాంసుడుగా (వుండే) బ్రాహ్మణ్ణైనాగాని యితర వర్ణములో గాని వక పురుషుణ్ణి రప్పించి కొంతసేపు భగవన్నామ కీర్తన చేయిస్తే చేయించేవారికిన్ని వినేవారికిన్ని పరలోక సాధనం కద్దు. తమరు దయచేసి యీ కాకితాన్ని కడాకు చదివి చూచి దీన్ని తమ వృత్తాంత పత్రికలో ప్రచురణము చేయించడము లోకోపకారంగా వుండునని తమకు తోస్తే అలాగున తాము ప్రచురణము చేయవలెనని కోరుతున్నాము. అయితే ఈ కాగితము చదివేవారు తోడుతోసే తమ యింట్లో పెండ్లి ప్రయోజనాలు వస్తే కచ్చేరీయుంచడము యిప్పుడే మానుతారని నేను యెంచలేదు. కాని దినంపేరిట యిందులో వ్రాసియుండే సంగతులు యావత్తున్ను నిశ్చయమని కొందరు బుద్ధిమంతులు యెంచుకొని కచ్చేరి యుంచక మానతారనే మొదట నేను సందేహించలేదు.

1841 సంవత్సరం
ఫిబ్రవరి నెల 15వ తేది.

తమ చందాదారుడైన
లోకరక్షణి

(బ్రౌను జాబుల సం. 1
ఎం. 417 పుట 783-80).

గురుజాడవారి యాంటీ నాచ్ ఉద్యమం కంటే ముందే ఈ లోకరక్షణీ బోగంమేళాల పట్ల పడ్డ ఆవేదనను అతని యీ జాబు ఎంతగా వ్యక్తపరుస్తున్నదో చెప్పనక్కరలేదు. అలాగే వివాహాల దుర్వ్యయం గురించి కూడా.

ఆనాడు తెలుగులో పత్రికానుభవం కలవారు లేరు. పత్రికా పరిభాష కూడా లేదు. కనుక పత్రికకు సంబంధించిన ప్రధాన పరిభాషను పత్రికా విలేఖకుడు; సంపాదకుడు మొదలయిన వాటిని వంగభాష నుంచి గ్రహించారు.

ఆంగ్ల పత్రికల నుంచి వార్తలను అనువదించుకొనేవారు. ప్రభుత్వ ప్రకటనలు, గెజిట్ వార్తలు నింపేవారు. వివాహ వృత్తాంతాలు, మరణవార్తలు ప్రచురించేవారు. సామాన్య ప్రజలకు ఎంతమాత్రమూ ప్రయోజనకరంకాని వార్తలు కూడ కొన్ని విదేశ పత్రికల నుండి తర్జుమా చేసేవారు. ఇంతకూ వృత్తాంతిని తొలినాళ్ళ పత్రిక కదా. ఇప్పటికీ పత్రికలు అవకతవకలు చేస్తున్నప్పుడు ఆనాటి తొలి పత్రికను గురించి చెప్పనక్కరలేదు. అయినా ఆ రోజుల్లో కూడా అది విమర్శకు గురికాక తప్పలేదు. రాజమండ్రిలో ఆరోజుల్లో జిల్లాజడ్జిగా ఉన్న జేమ్స్ థామస్ భార్య జూలియాథామస్ రాజమండ్రి సాంఘిక విషయాలను గురించి లండన్‌కు జాబులు వ్రాసేది. అవి తర్వాత పుస్తకంగా సంకలితమయ్యాయి. దీనిలో ఆమె వృత్తాంతిని పత్రిక వ్రాతలను గురించి 1839 జనవరి 19 నాటి జాబులో యిలా వ్రాసింది :

"There is a gentoo news paper published in Madras. A.... takes it in order to please some of the courts servants by lending it to them. It is very quaint, some items, the articles are translated from the English, always the most uninteresting and frivoulous that can possibly be selected. For instance a description of Queen's bed; with the very assertion that she always sleeps on hard mat with nothing over her; I saw the last number there was an account of a ball given by the governor of Madras to which many of the natives are invited."[1]

తొలినాళ్ళ తెలుగు వృత్తాంత పత్రిక గురించి ఒక విదేశవనిత అభిప్రాయమిది. ఆమె తన అభిప్రాయాన్ని లండన్ వారికి కూడ తెలిపింది. ఒక వైపున జాలిపడుతూనే సంపాదకుని వార్తా సంగ్రహణ శక్తిని వేళాకోళం చేసింది.

వృత్తాంతిని భాష పూర్తిగా అప్పటి మద్రాసు శిష్టవ్యావహారికం, సంపాదకుని జవాబులు కూడ వ్యావహారికంలోనే ఉన్నాయి

---

1. Letters From Madras during the years 1836–1839 by a Lady – By Mrs. Julia Thomas.

ఉదాహరణకు :[1]

ఉత్తరము వ్రాసిన వారికి జవాబు :

రా॥ రా॥ మండిగల వెంకట్రాయ శాస్త్రులవారు వ్రాయించిన ఉత్తరము అతిశ్రేష్ఠముగా నున్నందున-ప్రచుర పరచమని మా ప్రొప్రయిటర్ల ఉత్తరవయి నందున - అలాగుననే చేసినాము - నీలగిరి చరిత్ర యింకా మేము చూచికో లేదు గనుక - చేతనయినంత త్వరలో అచ్చువేసి ప్రచుర పరచుతున్నాము. ఎడిటర్.

ఒక ముఖ్యమైన సంగతి - వృత్తాంతినిలో సాహిత్యము ఊసేలేదు. వర్తమాన తరంగిణిలో సాహిత్య విషయాలు కూడా ప్రచురించడం మొదలైంది. తర్వాత పత్రికే వర్తమాన తరంగిణి.

## వర్తమాన తరంగిణి

ఈ పత్రిక 1842 లో వెలువడింది. 1850 వరకు ఉంది. మొదట్లో దీన్ని నిర్వహించిన సంపాదకు లెవ్వరో తెలియదు. తర్వాత పువ్వాడ వెంకట రావు అనే వ్యక్తి సంపాదకుడు. ఈయనకు అప్పటిలో బ్రౌన్ మొదలైన ప్రసిద్ధులతో గరిష్ఠ సంబంధముండేది. దానిలో ఒక వార్త ఈ విధంగా ఉంది:

[2]వర్తమాన తరంగిణి (1842 సం॥ ఆగస్టు నెల 11వ తేది, గురువారం).

**వారధి :** తిరివల్లిక్కేణి సముద్రము వొడ్డున నుండే మంచు గడ్డలు అమ్మే ఇంటివద్దనుంచి (ఐస్‌హౌస్‌నుంచి) సముద్రము వొడ్డున అడయారుకు పొయ్యే తోవలో ప్రేమేసన్ కంపెనీ బంగళాకు సమీపంగా ఉండే బాటలో కొయ్యలతో ఒక వారధి కట్టి వున్నది. అది వెడల్పు తక్కువగా వుండడము చేత ఒక బండికంటె ఎక్కువ పట్టదు. ఇందువలన అనేక తడవలు ఉపద్రవ ములు సంభవిస్తూ ఉండును. ఇందుకు దృష్టాంతముగా మొన్నటి దినము ఆపత్కరముగా ఒక కార్యము జరిగినది. యేమంటే, అడయారునుంచి దొరలు ఎక్కే కాటేజీ అనే ఒక పెద్ద బండి ఆ వారధి మీదికి వచ్చినది. అప్పుడే ఉత్తరపు దిక్కునుంచి దానికి యెదురుగా మరియొక బండి వచ్చినది. అడయారు నుంచి వచ్చిన బండికి లాంతర్లు వున్నవి. ఉత్తరాన్నుంచి వచ్చిన బండికి లాంతర్లు లేవు. ఈ బండ్లుతోలే వాండ్లు యిద్దరు వకరు ముందుపోతే వకరు వెనక పోవలెనని వుండిరి. యిందులో వుత్తరాన్నుంచి వచ్చిన గుర్రము పిరికి తనముచేత వారధికి అవతలవైపున వుండే వెలుతురును చూచి జడుసుకొని

1. బ్రౌన్ జాబులు - పుట 33 - బంగోరె.

2. వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాల 1872 వరకు వుంది.

బండి గిరగిర తిరిగి వెనక్కు వెనక్కే ఆ సమీపంలో నుండే వక కంచెలోకి వెళ్ళినది. అంతట దైవవశాత్తు దాని మనస్సుకు వక వికల్పముతోచి అక్కడనే నిలిచినది. ఇంకో క్షణం మాత్రం ముందుకు వెనక్కు లాగుతూ వుండి వుంటే మహా ఆపద సంభవించి ఉండును. ఆ దశలో యిటువంటి అపాయకరమైన కార్యములు సంభవించడంలో దొరలకేగాని దొరసానులకేగాని మరివకరకేగాని ప్రాణహాని కలుగును.

కనుక సర్వాధికారులైన గవర్నరుగారు యీ సంగతి ఆలోచనలోకి తెచ్చి సదరహి వారధి ఇంతకంటే విశేషంగా వెడల్పించి విశాలముగా కట్టిస్తే జనులకు మహా సౌఖ్యముగా వుండును.[1]

వృత్తాంతినికన్నా వర్తమాన తరంగిణి భాష కొంత నేవళంగా వుండడం మనం గ్రహించవచ్చు. ఈ పత్రిక తొలి సంచికలో అప్పట్లో ముద్రితమై ఉన్న కావ్య ప్రబంధ శతకాల పట్టిక ఉండడం బట్టి ఇది కొంతకు కొంత సాహిత్యానికి కూడా ప్రాధాన్య మిచ్చిందని అనుకోవచ్చు. చిన్నయసూరి వంటి మహా విద్యాంసులు కూడా దీనిలో సంపాదకీయ లేఖలు వ్రాయడం దీనికి మరొక నిదర్శనం :

మహారాజశ్రీ వర్తమాన తరంగిణి ఎడిటర్‌గారి సముఖమునకు - ఈ అడుగున వ్రాసుకొన్న పద్యంబు తమ పత్రికలో ప్రచురము చేసి పండితులగు వారివలన నా పద్యంబు కర్థంబు తెప్పించి తిరుగా తమ పత్రికలో ప్రచురము చేసి నా అభీష్టంబీడేర్తురని తమ ఘనమును బహుధా ప్రార్థించెద....తమ వినయ విధేయుడగు. చి. సూ.[2] ఆ పద్యం ఇది.

ఉ. కోడిగ మింతె గాని తనకున్
వయసెక్కడి దమ్మ నేత్రముల్
వాడు గదమ్మ పంట పగబట్టిన
దాని సుధారసంబు ము
ద్దాడు గదమ్మ యీ తెలియ
కక్కట వల్పులటమ్మ యీడికల్
వేడుక లాయె మట్ల తిరువేంగళ
నాథ యనంత శౌరికిన్.

---

1. ఆంధ్రవచన వాఙ్మయము: పుట 181-డాక్టర్ నిడుదవోలు వెంకటరావు.
2. వర్తమాన తరంగిణిలో 1842 అక్టోబరు 22 తేదీతో ఈ లేఖ ప్రకటితం - ఆంధ్ర వచన వాఙ్మయము; నిడదవోలు వెంకటరావు - పుట 91 (1954.)

పత్రికల సాహిత్య సేవ తొలిసారిగా ఈ విధంగా పద, పదార్థ చర్చతో ప్రారంభమైంది.

సాహిత్యసేవలో పుస్తక ప్రచురణ కూడా ఒక భాగం, ఈ ప్రయత్నం లోనే యీ పత్రిక మహాభారత సంపూర్ణ ముద్రణకు అంకురార్పణం చేసింది. మహాభారత ముద్రణ విషయంలో ఈ పత్రిక సంపాదకుడు పువ్వాడ వెంకట రావు బ్రౌనుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఆయన సూచనల మేరకు తన ముద్రణాలయంలో ముద్రించినట్టు తెలుస్తున్నది. ఆ ఉత్తరాలు ఉదాహరిస్తాను:

మహారాజశ్రీ సి.పి.బ్రౌన్ దొరవారి సముఖమునకు - పువ్వాడ వెంకట రావు అనేక సలాములుచేసి వ్రాసుకున్న విజ్ఞాపనము. జనవరి రోజున తమ సముఖములో శ్రుతపరచుకొన్న ప్రకారం సంస్కృత భారతం అది పర్వ సభా పర్వములనున్ను ఆంధ్ర భారతం ఆదిపర్వము సభాపర్వము అరణ్యపర్వము ఉద్యోగపర్వము యీ అయిదు పర్వములనున్ను సముఖమునకు పంపించుకొని యున్నాను. దాఖలు చిత్తగించవలెను.... తమ సముఖములో మనవి[1] చేసు కున్న ప్రకారం ద్రోణపర్వం మొదలుకొని రెండేసి పర్వముల చొప్పున దయ చేయించుచూ వచ్చిన పక్షమున తమ నిఘంటువుకు నిరోధము లేకుండా తాము వేయించియుండిన లెక్కల ననుసరించే అచ్చువేయించుచున్నాను. ప్రస్తుతము - ద్రోణపర్వం, కర్ణపర్వము అచ్చు జరుగుచున్నది గనుక ముఖ్యముగా ప్రతులని దయచేయించవలయునని ప్రార్థించెదను.

చిత్తగించవలెను
పువ్వాడ వెంకటరావు

1852 సం॥ జనవరి 10. (సంపుటం 12,ఎం. 428, పేజీలు 366-67)[2]

మహారాజశ్రీ, మేస్టరు సి పి. బ్రౌన్ దొరగారి సమ్ముఖమునకు - పువ్వాడ వెంకటరావు అనేక సలాములు చేసి చేయంగల విజ్ఞాపనములు. త॥ తాము లోగడ దయచేయించిన శల్యపర్వం అచ్చు ముగించి తిరిగి సదరు ప్రతిని పంపించడమైనది గనుక దాఖలు చిత్తగించి స్త్రీపర్వ శాంతిపర్వములు దయ చేయించగలందులకు ప్రార్థించుచున్నాను....

1852 మే 17. చిత్తగించవలయును
పువ్వాడ వెంకటరావు[3]
(సంపుటం 15, ఎం. 431 పేజి 43)

---

1. వర్తమాన తరంగిణి 1842 అక్టోబరు 22
2. బ్రౌను జాబులు పుట 38 - బంగోరె
3. అదే పుట

సాహిత్య చర్చ అంటే అప్పటికి పదార్థ చర్చ వ్యాకరణ విషయాలు అలంకారాలు మొదలయినవి మాత్రమే.

## హితవాది

తర్వాత 1848 లో వెలువడిన 'హితవాది', 'దినవర్తమాని' పత్రికలు కూడా మొదటి రెండు పత్రికలలాగే ఇతర వార్తలతో పాటు సాహిత్య చర్చ కూడా చేసేవి. కాని వార్తలకే ప్రాధాన్యం. హితవాది బందరు నుండి వెలువడేది. మాసపత్రిక, సంపాదకుడు ఫారర్ జె. ఎడ్మండ్‌షార్క్రీ. ఇది కొంత కాలానికి ఆగిపోయి మళ్ళీ 1862 లో పునరుజ్జీవనం పొంది మళ్ళీ కొంత కాలం నడిచినట్లు కనపడుతుంది. ఈ పత్రికలోనో, షార్క్రీవద్దనో పనిచేసిన బుర్రా శేషాచలశాస్త్రి 1852 నవంబరు 24న బ్రౌనుకు వ్రాసిన ఉత్తరం ఒకదానిని బంగోరె ఇచ్చారు.

అది ఇట్లా ఉంది :

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ దొరగారి సమ్ముఖమునకు - మచిలీ బందరు కాపురస్తుడున్ను ప్రకృతమునందు చెన్నాపట్నమునందు వచ్చియుండే బుర్రా శేషాచలశాస్త్రి వ్రాసుకొన్న మనవి. ఏను లోగడ బందరులో మ.రా. ఫాదిరి జె. ఇ. షర్క్రి దొరగారి వద్ద సంస్కృతాంధ్ర గ్రంథములకు సూచి మొదలైన వచన రూపకములను చేయుచుంటిని. సదరు దొరగారు ఈపని చాలించినందుననున్ను - తాము నావంటి వారికి విద్యావిషయమైన పనుల నిప్పించి రక్షించుట జగత్ప్రసిద్ధిగా నుండుటవల్లనున్ను తమను నమ్మి నేనిచ్చట జేరి అక్టోబరునెల 19వ తారీఖున తమ సమ్ముఖమునకు మనవి వ్రాసుకొని కాచుకొనియున్నాను. గాన ఈ మనవినిన్ని చిత్తగించి నన్ను సంస్కృతాంధ్రము లందు పరీక్షించి తగుపాటి జీవనమును ఇప్పించి రక్షింపవలయునని యేలినవారి ఘనతను వినయవిధేయ పూర్వకంగా మిక్కిలి ప్రార్థింపుచున్నాను. దివ్య చిత్తమునకు దేవలయను.

1852, నవంబరు 24 బు. శేషాచలశాస్త్రి.

(సంపుటం 15 ఎం. 431, పేజీ 22)[1]

## సుజనరంజని

సారస్వత విషయాలకే ప్రాధాన్యమిచ్చిన మొట్ట మొదటి పత్రిక సుజన రంజని (1862-67). దీని సంపాదకులు వింజమూరి కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు, కారుమంచి సుబ్బారాయలునాయుడు. ఇది

---

1. బ్రౌను జాబులు - పుట 111 - బంగోరె.

మొదట మాసపత్రికగా ఉండి తర్వాత ద్వైమాసిక మైంది. వింజమూరు కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు చెన్నపట్నంలోని గవర్నమెంటు నార్మల్ స్కూలులో తెలుగు పండితులుగా వుండేవారు. సుబ్బరాయలునాయుడు చెన్నపట్టణంలో గోవిందప్పనాయని ప్రైమరీస్కూలులో తెలుగు బోధించే ఉపాధ్యాయులు.

చిన్నయసూరి తన రచనలను, టీకా టిప్పణులను దీనిలో ప్రచురించేవారు.[1] ఈ పత్రిక ఆ రోజుల్లో విద్యార్థులకు, పరీక్షలకు వెళ్ళే ప్రభుత్వోద్యోగులకు చాలా ప్రయోజనకారిగా వుండేది. దీని ముఖపత్రంపై "యూనివర్సిటీ పరీక్షా విద్యార్థుల కుపకారకము" అని తెలుగులోను, **'A friend to the University students'** అని ఆంగ్లంలోనూ ముద్రించేవారు.

ఈ పత్రికలో ఆంగ్ల పారిభాషిక పదాలకు తెలుగు సమానార్థక పదాలు ప్రకటించేవారు. ఈ పారిభాషిక పదాలను వీరేశలింగంగారు మొదలైనవారు తరువాత ఉపయోగించుకొని శాస్త్రీయగ్రంథ రచన సాగించారనడానికి నిదర్శనాలున్నాయి. ఈ పత్రిక 1867 ఫిబ్రవరి సంచికలో 1866 వ సంవత్సరపు మెట్రిక్యులేషన్‌పరీక్షకు సంబంధించిన తెలుగు పరీక్షాప్రశ్నపత్రం ప్రకటించారు. దానిని బట్టి అప్పటి తెలుగు ప్రమాణం తెలుస్తుంది. ఈ పత్రికలో మనుచరిత్రాది ప్రబంధాలకు, భాస్కర రామాయణాదులకు లఘుటిప్పణి ప్రచురించబడేది చిన్నయసూరి నీతిచంద్రిక లఘుటిప్పణి కూడ దీనిలో ప్రచురించారు. మెట్రిక్యులేషన్ తెలుగు ప్రశ్న పత్రంలోని ముఖ్యప్రశ్నలివి :-[2]

1. రాముడయోధ్య విడిచి యడవికి బోయినప్పు డతని వయసెంత? అతడడవికి బోయిన ఎన్నిదినములకు దశరథుడు మృతినొందెను? దీనికి సప్రమాణముగ నుత్తరము వ్రాయుము?
2. 'పోవదు తన కర్మఫలముఁ బొందక తన్వీ' - దీనికి గణవిభజనము చేయుము? ఇది ఏ పద్యపాదము?
3. పసదనము, మోసల, రిత్త, ఈసు, వమ్ము, చేడియ, కొందలము, బొంది, మంతనము, కలువడము, గొంది, వేమ, నింగి, కాన - వీనికి సులభములగు పర్యాయపదములు వ్రాయుము. ఇందు తద్భవము లెవ్వి? దేశ్యము లెవ్వి? తద్భవ పదముల ప్రకృతులను వ్రాయుము.
4. రాముని భార్యకు మేదినీ తనయ, సీత అనునామము లేల కలిగెను?

---

1. దిగవల్లి శివరావుగారి వద్ద సుజనరంజని ప్రథమ సంపుటం ఉంది.
2. డా॥ అక్కిరాజు రమాపతిరావు నోట్సు నుంచి.

5. పసిండి పక్కెరము, కేలుదోయి, నారచీర, నావలనిభక్తి - ఇవి ఏ సమాసములు? విగ్రహ వాక్యము లెవ్వి?

6. 'పెద్దగాలం బవ్విధంబునం బ్రవర్తిల్లుడు' అను వాక్యమందలి పదములు విసంధిగా వ్రాసి నామముల విభక్తుల దెలిపి సంధుల సహేతుకముగా విశదపరుపుము.

7. ప్రవర్తిల్లుట, అనవుడు, లేకయున్నయది, కానిండు - అనువాని కతిదేశము చెప్పుము.

8. అరణ్యంబున అనునది యే విభక్తి? దాని మరియొక్క రూపమెద్ది?

9. నడయాడు నంతదనుక - అనుచో నడయాడు అనునది యేమి? ఇతర స్థలములందదది యెట్టిది?

10. నాన్ అనుదాని ప్రకృతి యెద్ది? అది యెట్టి పదము?

11. మృగేంద్రుడు అను దానిని భాగించి సంధిని వివరింపుము?

12. (వాయసాదులు అనుదానితో సంబంధించిన) వానిన్ అనునది యే లింగమును దెలియజేయునది? ఏ విభక్తి గలది?

13. "మా సత్త్వంబుకొలది దేవరకుం దెలియనిదికాదు" అనవుడు మృగేంద్రుడు వానింజూచి "దొరికినంతయె కానిండు" - ఈ వాక్యములందు దత్సమము లెవ్వి? తద్భవము లెవ్వి?

14. అగు అనునది యెట్టి విశేషములకు వెనుక జేర్పబడును?

15. అండజము, బలిభుక్కు - వీనివ్యుత్పత్త్యర్థమేమి?

పై ప్రశ్నలను బట్టి పంచతంత్రం పాఠ్యభాగంగా వుండేదని, వ్యాకరణం మున్నగునవి ఉన్నత ప్రమాణాలలో ఉండాలనే ఉత్సాహం ఎక్కువగా వుండేదని తోస్తుంది.

అప్పట్లో 'The Journal of Education' అనే పత్రికను మద్రాసు ప్రభుత్వం ప్రచురించేది. తర్వాత వచ్చిన తత్త్వబోధిని, సుజనరంజనిని పైన పేర్కొన్న ఆంగ్ల పత్రికతో పోల్చడం సమంజసంగానే వుంది.

19వ శతాబ్ది ఉత్తరార్థంలో కవులు పండితులు పలువురు వుండేవారు. అందరి వద్ద తాటాకు పుస్తకాలుండేవి. అప్పట్లో ప్రతి పండితుడు ఏదో ఒక పత్రిక నడపడం, దానిలో ఒక ప్రాచీన కావ్యం నాలుగు పుటలో, ఎనిమిది పుటలో ప్రచురించడం పరిపాటైంది. కనుక వాటిలో ముఖ్యమైన కొన్నింటిని మాత్రమే తెలుపుతాను. వాటిలో కొన్నిటిలో వార్తలూ వుండేవి.

## శ్రీయక్షిణి

ఈ పత్రిక బళ్ళారి నుంచి వెంకటరమణకవి, త్యాగరాజ మొదలియార్ అనే వారు వెలువరించేవారు. త్యాగరాజ మొదలియార్ మహాభారతం కూడా రచించారు, ఈయన తన వ్యాసాలనూ ఈ పత్రికలో ప్రచురించేవాడు. వీరేశలింగంగారు ఈ పత్రికను తమ విగ్రహతంత్ర విమర్శనములో ప్రస్తావించారు.[1] ఇది 1863 నుంచి 1865 వరకు వుంది.

## తత్త్వబోధిని (1864-70)

ఇది చెన్నపురి వేదసమాజంవారి యాజమాన్యాన 1864 న వెలువడి 1870 వరకు వుంది. వేదసమాజం బ్రహ్మసమాజానికి పూర్వరూపం, దీనిలక్ష్యం బ్రహ్మసమాజ సిద్ధాంత ప్రచారం. స్త్రీ పునర్వివాహానికి సంబంధించిన వ్యాసాలు తొలిసారిగా ఈ పత్రికలోనే ప్రచురితమయ్యాయి. దీని ప్రభావం వీరేశలింగం గారి పై పడి ఆయన సంస్కరణ కార్యక్రమాలకు పూనుకోవడానికి మిక్కిలి దోహదం చేసింది. వేద ప్రచురణ కూడా ఈ పత్రికలో జరిగింది. ఋగ్వేద సంహిత సస్వరంగా తెలుగు లిపిలో తొలిసారిగా ప్రచురణ పొందడం ఈ పత్రికలోనే. ప్రతి సంచికా నిరాకార బ్రహ్మప్రార్థనమైన ఒక ఋక్కుతో ఆరంభమయ్యేది. ఆ కాలంలో మంద్యం కృష్ణమాచార్యులవారనే వారు చేసిన శతావధానం వివరాలు దీనిలో తొలిసారిగా ప్రచురితమయ్యాయి. ఈ పత్రిక వ్యాసాలన్నీ తత్త్వబోధిని 1, 2, 3 అనే పేరుతో సంపుటాలుగా వెలువడ్డాయి. వీరేశలింగంగారు ఈ పద్ధతినే తమ వివేకవర్ధని సంపుటాలు ప్రచురించారు.

## ఆంధ్రభాషా సంజీవని - తొలి సంపాదకీయం

తెలుగు సారస్వత చరిత్రలో మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి గ్రాంథికభాషాభిమానం విశ్రుతమైంది. ఈ వెంకటరత్నం పంతులుగారే దీనికి సంపాదకుడు. ఈయన వివిధ భాషలలో విద్వాంసుడు. అనేక శాస్త్ర పారంగతుడు. ఆంగ్ల పదాలకు పారిభాషిక పదాలు, సమానార్థకాలు స్థిరపరచినవారూ, తెలుగు పత్రికలలో సంపాదకీయాలు ప్రారంభించినవారూ ఈయనే. ఈ పత్రికలో సారస్వత విషయ చర్చలు, సాంఘిక రాజకీయ విషయాలు, గ్రంథ సమీక్షలు, కవితలు మొదలయినవి ప్రచురితమయ్యేవి.[2]

వీరేశలింగంగారి తొలి పద్యకావ్యం శుద్ధాంధ్ర భారతం సభాపర్వంలో

---

1. వీరేశలింగం రచనలు : 9వ సంపుటి
2. తెలుగు వ్యాసం - నూరు సంవత్సరాలు : ఆం.ప్ర. సాహిత్య అకాడెమి ప్రచురణ - పుట. 17

కొంత, వడ్డాది సుబ్బరాయుడుగారి శోకగీతం (Elegy) ఈ పత్రికలోనే ప్రచురితమయ్యాయి. తెలుగు సాహిత్యంలో ఇదే తొలి శోకగీతం. అప్పటి ఆంగ్ల పత్రికలు Journal of Education (మద్రాసు - 1872), **Native** Public Opinion (1873), Journal of Hindu Sreyobhi Vardhani Sabha (1874) దీనిని వేనోళ్ళ కొనియాడినాయి.[1]

సమకాలిక పత్రిక పురుషార్థ ప్రదాయిని దీనిని గురించి "ఈ పత్రిక యందు చదువుటకు మిగులనానందముగను, ఉపయుక్తముగను నుండు ఆంధ్ర భాషావిషయములును, దేశాభివృద్ధికరములగు నితరములైన పద్ధతులును మంచి వృత్తాంతములును, ఇంకను కొన్ని కొన్ని విషయములును ఎన్నికకు రాదగిన తిన్నని మధురమైన శైలిలో వ్రాయబడుచున్నవి" అని ప్రశంసించింది. (1872 జూలై 17)[2]

పత్రిక ఎలా వుండాలి? సంపాదకుడు, విలేఖకుడు, చందాదారు, పాఠకుడు ఎలాంటివారు? అనే వాటికి ఈ పత్రిక కొన్ని నిర్వచనాలిచ్చింది. అవి మొట్టమొదటివి, ఆసక్తికరమైనవి, నేటికీ ఉపాదేయమైనట్టివి గనుక ఇక్కడ ఉదాహరిస్తాను :

**పత్రికా లక్షణము :**

పత్రముద్రాసౌష్ఠవంబు సద్భాషయు
ధర్మనీతి న్యాయ తత్త్వదమగు
వ్యాసము స్వాశయ వార్తాళి వివిధ వా
ర్తలకల్మి కృతి విమర్శన ముదార
సల్లేఖకౌఘంబు శాస్త్ర సదాచార
సిద్ధాంత మర్థ సంసిద్ధి కృత్య
మనెడు నీ నవలక్షణావళి దేనియం
దిరవొందు సుగుణంబు వర మణియన
నద్ది వృత్తాంత పత్రిక యౌ సలక్ష
ణం బిటులుగాని దవలక్షణ ప్రవృత్తి
పత్రికయని యనం బడుం బడు నిజముగ
గుగుణమౌమణి విబుధులు కోరి కొంద్రె?

---

1. Studies in the history of Telugu Journalism - పుట 81
2. తెలుగు వ్యాసం - నూరు సంవత్సరాలు

**విలేఖక లక్షణము :**

పండితుండును సత్ప్రవర్తకుండును జగ
ద్వ్యాపార విజ్ఞుండు స్థైర్యయుతుడు
ధైర్య సంపన్నుండు ధని యుచితజ్ఞుండు
శక్తిత్రయాఢ్యుండు సూక్తిచతురు
డనుపదంబులె బిరుదాభిధానంబులు
బిరుదాభరణములై వెలయు మిగుల
ఈ విశేషణమణుల్ భావింపబడునవ
లక్షణము లివే విలక్షణములు
గాన నిటు సవలక్షణ కలితుడైన
వాడు నవరత్నహార సంభావనీయు
డవు విలేఖకు డిటు గామి నౌనె యొరుడు
వానివలెగాక కుముఖుండయౌ నిజముగ.

**ఉపవిలేఖక లక్షణము :**

ఆదినే లేఖనీయాంశంబు సత్యంబు
స్వప్రమాణంబుగా జను నెరుంగ
సంగ్రహముగ వ్రాయ సమకట్ట వలయు నం
తట వ్రాత దగు విశదముగనుండ
విషయ విన్యాసంబు విస్పష్టముగ నుండ
వలయు సందర్భార్థములు క్రమముగ
నొప్పనాడగ గూడ దెవ్వరినేనియు
దబ్బర పొగడికల్ దగవు వ్రాయ
వాస్తవంబైన వార్తనే వలయు దెలుప
స్వీయనామ నివాసముల్ వివరముగను
దెలియ లిఖియించ వలయు నిట్లగు నుప వి
లేఖకుని లక్షణములు పోలెడు మణులను.

**స్వీకర్త లక్షణము :**

ఈయందగిన డబ్బు నీవలె ముందుగా
బత్రిక క్రమముగా బడయ వలయు
అందకున్నను దెల్పి యందుకోవలయును
దాని నెఱుంగంగ దగును ముగియ

దత్పత్రికల నాగి దగ నుంచుకొనవలె
బొ త్తంబుగానేని పొ త్తిగానొ
యొసగరా దొరులకు నొసగిన జ్ఞప్తితో
గ్రై కొన వలయును బైకమువలె
జెడక యుండంగ నప్డు కడకతోడ
వాని బరికింప వలయును వలయు జదువ
నివ్వి నవలక్షణములను నెలమి బత్రి
కలను గొనియెడి సత్పురుషుల కరయగ.

**పాఠక లక్షణము :**

పత్రిక చెడకుండ బైకప్పు నెడలింప
వలయును విప్పంగ వలయునట్లె
తాల్డాల శీర్షికల్ దొడరి చూడన్‌వలె
స్వవిషయముల ముందు చదువగవలె
నంతట దనవారి పైన విషయముల
బరికింప వలె నంత బరవిషయము
లరయంగ వలయు నేకాగ్రమనస్కుడై
మడత మార్పగరాదు ముడుతలుపడ
నీక నలుగనీక యెప్పటి యట్లునం
దుంచి దానినట్లె యొప్పనతడు
స నవలక్షణుండు సత్పాఠకుండిట్లు
గొఱలకున్న బాఠకుండెటులగు.[1]

కొక్కొండ వారి భావంలో విలేఖకుడంటే సంపాదకుడు ; ఉపవిలేఖకుడంటే ఉప సంపాదకుడో లేక రిపోర్టరో; స్వీకర్త చందాదారు ; పాఠకుడంటే చదువరి.

## పురుషార్థ ప్రదాయిని

ఉమారంగ నాయకులు గారి సంపాదకత్వంలో బందరు నుంచి ఇది 1872 లో వెలువడి దాదాపు 20 సంవత్సరాలు నడిచింది. ఇది గొప్ప పత్రిక. అన్ని శాఖలలోను సాహిత్యం విరివిగా వృద్ధి పొందాలని దీని ఆశయం. మహా

1. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు నోట్సు.

భారత టిప్పణి, పుస్తక విమర్శలు, వైద్య విషయాలు, వింతలు విశేషాలు, వ్యాస సంగ్రహాలు దీనిలో వుండేవి. ఆంధ్రభాషా సంజీవనికి దీనికి విద్యావిషయమైన వాద ప్రతివాదాలు జరిగేవి. సామెతలు, సమస్యాపూరణలు, ప్రకృతి శాస్త్ర వ్యాసాలు వుండేవి. "శాస్త్రము, భాష, మతము, వైద్యము, ఔషధములు, నీతి, వ్యవసాయము, దోహదము, వర్తకము, కళలు, చేతిపనులు, విద్యావిషయములు, దేహారోగ్య విషయములు, గృహవిద్యలు, దేశకాలజీవ చరిత్రములు, పురాతన నీతులు, పౌరాణికములు, వినోదములు, ఆశ్చర్యములు, కథలు, లోక వ్యవహారములు, ధర్మశాస్త్ర విషయములు, విశేషాభిప్రాయములు, సంవాద ములు, సిద్ధాంతములు, వృత్తాంతములు, మొదలగు నంశములను గురించి సంగ్రహముగా విశేషము ఆంధ్రమున వ్రాయబడును. గనుక తెలుగు భాషను కొంచెము చదివిగాని వినిగాని గ్రహించ గల ప్రతివారును ఈ పత్రికను పుచ్చుకొని శ్రద్ధగా చదవవలయునని కోరెదము'' అని పత్రికాసంపాదకులు ప్రకటించేవారు. దీనిలో ఆంగ్ల విభాగమూ వుండేది. అప్పటి అధికారులకు తెలుగు నేర్చుకొనడానికి వీలుగా పద్యాలకు తెలుగులో అర్థాలు, ఇంగ్లీషులో వివరణలు ఉండేవి. ఈ విధంగా మహాభారతానికి గుంటూరు ఆంగ్లో వెర్నా క్యులర్ స్కూలు ఉపాధ్యాయులు పరవస్తు వెంకటరంగాచార్యులు టిప్పణులు వ్రాశారు.

మచ్చుకు ఒకటి :

కం. అన విని నిరుత్తరుండయి
మను జేంద్రుడు కొంత సేపు మ్రాన్పడి తలపుల్
పెనగొన నిద్రాహీనిం
దనువలయగ విదురుతోడ దా నిట్లనియెన్.

నిరుత్తరుండు - ప్రత్యుత్తరము లేనివాడు. The word నిరుత్తరుండు **is compounded of** నిర్ (=నిర్గతమగు) **and** ఉత్తరము (=ఉత్తర మెవని వలననో) నిర్ **is an** ఉపసర్గ **and conveys a negative idea. The Reader is not to confound this with** ని **which means excessively as in the examples** నిహతుడు, నిబోధితుడు **and so on.**

మ్రాన్పడి=నిశ్చేష్టితుడయి. **This word is compounded of** మ్రాను **and** పడు. **See** బాలవ్యాకరణము, ప్రకీర్ణ పరిచ్ఛేదము **16**వ సూత్రం....[1]

---

1. (పురుషార్థ ప్రదాయిని సం. 1, సం. 6, 1872 జూన్)

ఈ పత్రిక అప్పుడు చాలా ప్రచారంలో వున్నదనడానికి హైదరాబాదు నుంచి ఒక పాఠకుడు వ్రాసిన ఉత్తరం తార్కాణం. రాజకీయంగా ఆయా ప్రాంతాల విభేదాలెట్లా ఉన్నా తెలుగు పత్రికల పాఠకులు ఎంత ఉత్సుకతతో వుండే వారో తెలియడానికి ఆ ఉత్తరం ఉదాహరిస్తాను:-

మహారాజశ్రీ దైవసమానులగు పురుషార్థ ప్రదాయిని పత్రికాధి పతులవారికి

అయ్యా!

శ్రీ పురుషార్థ ప్రదాయిని పత్రికలను ఇది వరకు సాలు నాలుగైదు మాసముల నుంచి బహు ఆసక్తితోనున్ను గౌరవముతోనున్ను చదువుచున్నాను. ఇక్కడ బహు మంది కొనియాడి ఆనందించుచున్నారు. మీ యీ పత్రికలో నుండే విశేషములు హంశములు చదివి బాగా గ్రహించగల అందరిని బహు బాగుగా వృద్ధిని పొందించేవిన్ని దేశాభిమానము గల్గి భాషాభిమానమున్ను గల సజ్జనులైన మానవులు సంతోషముతో సహాయులై అంగీకరించి మెచ్చుకో దగినవిన్ని సరసులు సమ్మతితో నుతించవలసినవిన్ని నీతిని జ్ఞానమును బుద్ధి చాతుర్యమును ఆలోచనను మొదలుగాగల వాటిని ప్రవృద్ధికి తెచ్చే విన్ని అయియున్నవి గనుక యీ దివ్యమైన పత్రిక శాశ్వతముగ ప్రతి నెలకు తప్పకుండ అచ్చువేయబడి ప్రకటితమై వృద్ధి బొందేటట్లు భగవంతుడు కరుణించి దీవించుగాక. మీకు తగిన ప్రోత్సాహమున్ను కలిగి మాకందరికిని కన్నుల పండుగగ నుండునుగాక.

జి. వై. **Friend of the good,** హైదరాబాదు - దివ్యక్షేత్రము

(పురుషార్థప్రదాయిని - సం. **1** సం. 6; **1872**)

రాజకీయోద్యోగం చేస్తూ అహంకారం చూపుతున్న వాళ్ళను గూర్చి దురాచారమర్దనుడనే పేరుతో సంపాదకునికి ఒకరు లేఖ వ్రాశారు. దీనినిబట్టి ఆ కాలపు స్థితిగతులు తెలుసుకోవచ్చు:-

"ఓ పురుషార్థ ప్రదాతోత్తమా ఈ విశేషము వింటిరా - కొందరు తహశ్శీల్ దారి మొదలగు నౌకరీ చేయువారు తమ జీవిత విశేషముచేత బండ్లు సవారీ లెక్క వీధులవెంట వచ్చినప్పుడు ఆయా పంచలను కూర్చునియున్న జనులందరు లేచి దండ ప్రణామంబులు గావించుచుండవలెనట! ఇదేమివింత! అయితే ఆ దండ ప్రణామంబు తమకేనో లేక తమ వాహన విశేషములకేనో తెలియదు. ఎందుచేత ననగ తమను వహించిన వాహన విశేషమున కెట్టి యధికారమో తమరు వహించి యున్న నౌకరీ పాయాకున్ను అట్టి యధికారమేగాని మరియొకటిగాదు. మరియు ఈ అధికారము వస్త్రధారణమువంటిది. వస్త్రమును ధరించినంతవరకావేషమున్న రీతినే తాము క్రమముగ నడిచి తప్పుచేసిన వానిని శిక్షించడము కేర్పడిన శాసన

ప్రకారము జరుపుటను వహించియున్నంత వరకు మాత్రము ఆ నౌకరీ వేష విశేషము కలిగియుంటున్నది గాన నౌకరీ పాటించియే గదా. ఇట్టి సంగతిలో నిర్నిమిత్తముగా నిరుపేదల భీతిని పొందజేసి వారి వలన దండప్రణామంబులు పొందదలచడమేమి ప్రయోజనము? ఇందుకు దృష్టాంతముగ నిదివరకు కొంద రధికారులు యిట్టి బెట్టిదమగు వెడగుచేష్టలచే నష్టమును బొందినవారు గలరని యెరుగరు కాబోలును. కాబట్టి ముందైనను క్రమముగ నడచుకొని నట్టయిన బాగుగనుండును.

తమ విధేయుడు

దురాచార మర్దనుడు

(పురుషార్థ ప్రదాయిని 1872 ఆగస్టు, సం. 1, సం. 8.)

దీనిలో 113 సంవత్సరాల కొకమారు కనిపించే తోకచుక్కను గురించి, గ్రేట్ బ్రిటన్ దేశపు రాణిగారి కోహినూర్-ప్రభా ప్రకరము - వజ్రము గురించి, 1872 సెప్టెంబరులో వచ్చిన తుఫాను గురించీ-ఇలా వార్తలు ఎన్నో ఉన్నాయి.

## స్వధర్మ ప్రకాశిని (1873-1976 : 1924-1932)

ఈ పత్రిక బందరు నుంచి వెలువడేది. దీని సంపాదకులు ద్వైతం కోటీశ్వరశర్మ శాస్త్రి; ఈయన శిష్యుడు కనుపర్తి మార్కండేయశర్మ. దీనిని మద్రాసు నుంచి ప్రచురించారు. గురు శిష్యులిద్దరూ గొప్ప విద్వాంసులు. ప్రామాణికమైన శంకరాచార్య చరిత్ర, 36 గురు మంత్రుల చరిత్ర (1100 - 1700) ఈ పత్రికలో ప్రచురితమయ్యాయి. కనుపర్తి మార్కండేయశర్మ సంస్కృత గ్రంథాలను కూడా ప్రచురించారు. వాటిలో సుందరపాండ్యుని 'ఆర్య' శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో వెలువడింది.

## సుధీ రంజని

దీనిని సుప్రసిద్ధ కవి ఓగిరాల జగన్నాథకవి కాకినాడ నుంచి ప్రచురించారు. సాహిత్యపు విలువలు గల పెక్కు వ్యాసాలు ఇది ప్రచురించింది. ఇది 1873 నుంచి 1880 వరకు వచ్చింది.

## సకల విద్యాభివర్ధని (1872-1879)

ఇది తెలుగుదేశంలో తొలి మహా మహోపాధ్యాయులైన పరవస్తు వేంకట రంగనాథాచార్యుల వారి సహకారంతో విశాఖపట్నం నుంచి వెలువడేది. దీనిలో కవి చరిత్రలు, వైద్యం, జ్యోతిషం మొదలయిన విషయాలు ప్రశ్నోత్తర

రూపంలో వెలువడేవి. పరవస్తువారి 'సంగ్రహములు' ఇందులోనే వెలువడ్డాయి.[1] ఈయన శాకుంతల అనువాదం ఈ పత్రికలోనే వెలువడింది. ఇది 1876 లో పుస్తకరూపంలో ముద్రితమైంది. వీరేశలింగంగారు దీనితో కల్గిన ప్రోత్సాహం తోనే శాకుంతలానువాదానికి పూనుకున్నారు. పరవస్తువారి అనువాదం అసమ గ్రంగా వున్నందున తాము అనువాదం చేశామన్నారుకాని తర్వాత తర్వాత సకల విద్యాభివర్ధనిలో ఈ అనువాదం కొనసాగడం వీరేశలింగంగారు చూసి ఉండరు.[2] పరవస్తువారు విజ్ఞాన సర్వస్వం సంస్కృత భాషలో 125 సంపుటాలుగా రచించారు. రెండు సంపుటాలు ప్రచురించారు. ప్రస్తుతం ఇది ఆంధ్రప్రదేశ్ ప్రాచ్య లిఖిత పుస్తకాలయంలో ఉంది. దీనిని పరిష్కరించి ప్రచురించ నున్నారు.

ఈ సకల విద్యాభివర్ధనిలోని ఒక విచిత్రమైన వార్తను సమకాలిక పత్రిక వీరేశలింగంగారి వివేకవర్ధని పునర్ముద్రించింది. ఈ ప్రకారంగా లిఫ్టింగ్ ఇంగ్లీషు నుంచే కాక తెలుగు పత్రికల నుంచి కూడా జరిగేది. ఆ వార్త ఇది :

నెరదొంగ :

యూరోపు దేశమున నొక యినుపదారి పొగబండిలో నేర్పరియగు నొక దొంగ పట్టువడెను. వాడు తా నిమిడి కూర్చుండదగి నట్టియు వలయుచోటికి తీసికొనిపోబడదగినట్టియు నిర్మలమగు వాయువులోనికి ప్రవేశించుటకు, నందుండు విషపుగాలి పైకి వచ్చుటకు దగినట్టియు పెట్టె నొకదానిని చేయించు కొని తానందిమిడి యుండును. ఇట్టి పెట్టెను వాని మంత్రమున జేరిన వారిలో నొకడు గొంపోయి పొగ బండిలో పడవేయును. ఆ పెట్టెలోని ముచ్చు నడికి రేయిని పెట్టె వెలుపలకి వచ్చి తన యొద్దనుండు తాళము చెవులతోడను కొదువవారి పెట్టెలను దీసి ప్రతి పెట్టె నుండియు విలువగల వస్తువుల మాత్ర మెత్తికొని మరల నా పెట్టెలో నిమిడి యుండును. మరునాడు వాని స్నేహితులలో నొకడు ఆ పెట్టె తనదని పుచ్చుకొని పోవుచుండెను. (సకల విద్యాభివర్ధని 1875 జన. సం. 3, నం.1)

## వివేకవర్ధని (1874-1893)

వీరేశలింగంగారికి సంఘ సంస్కరణోద్యమంలో ప్రముఖ ప్రచార సాధన మైన వివేకవర్ధని 1874 అక్టోబరులో ప్రారంభమైంది. ముందు మాస పత్రికగా

1. తెలుగువ్యాసం - నూరు సంవత్సరాలు, పుట - 18
2. ఆంధ్రనాటక వికాసము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు

వున్న ఇది తర్వాత పక్ష పత్రికగాను వారపత్రికగాను మారి దాదాపు 20 సంవత్సరాలు సాంఘిక, మత, రాజకీయ విషయాలలో దేశానికి ఎంతో సేవ చేసింది. లంచాలు పట్టే రాజకీయోద్యోగులకు, సంఘానికి అపకారం చేసే దుశ్శీలురకు, కుమతులకు ఇది సింహస్వప్నంగా వుండేది. వీరేశలింగంగారు ఈ పత్రికను వజ్రాయుధంగా వాడినారు. సంఘ సంస్కరణకు విద్యావ్యాప్తికి ఇలా వాడిన సాహసికులు మరొకరు లేరు. ఈ పత్రిక ముఖ తిలకంగా భారతంలోని

> 'ఒరు లేయవి యొనరించిన
> నరవర యప్రియము తన మనంబున కగు దా
> నొరులకు నవి సేయకునికి
> పరాయణము పరమధర్మ పథములకెల్లన్!'

అనే పద్యం వుండేది. ఈ ఉన్నత లక్ష్యంతోనే వీరేశలింగంగారు ఈ పత్రికను నడిపారు. ఈ లక్ష్యాన్నే కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తమ ఆంధ్ర పత్రిక ఆశయంగా పెట్టుకున్నారు. ప్రథమ సంచిక సంపాదకీయంలో వీరేశలింగం పంతులుగారు తమ పత్రిక లక్ష్యాలను ఇలా వివరించారు :-

"....మా వివేకవర్ధని తన్నుం జేపట్టిన వారలతోడ మొట్టమొదట దేట తెలుగు మాటలతో మాటి మాటికి నీతులనే సంభాషించుచుండును. ఆ వెనుక దన సువృత్తభావంబు మెరయ నానా శ్లేషంబుల గొందరను రసయుక్తములగు పాక భేదముల గొందరను వింతలగు వృత్తాంత కథనంబుల మరి కొందరను తేనియలొలుకు సుధా మధురోక్తుల గొందరను తనుపుచు నందర నానంద వారిధిం దేల్చుచుండును. మరియు నయ్యయి సమయంబుల నవసరోచితంబులగు పెక్కు విషయంబుల మిక్కిలి యక్కరతో నొక్కి వక్కాణించుచుండును. కాబట్టి నవరసికులగు మనయాంధ్ర దేశీయులందరు నత్యల్పధన లభ్యంబుగా నున్న మా వివేకవర్ధని పొందు వడయు తలంపు డెందంబుల బొందించి కై కొందురని యమందానందంబున మేమందరము నెదురు చూచుచున్నారము."

వీరేశలింగంగారి నిర్భీక ప్రవృత్తికి ఒకటి రెండుదాహరణలు.

1. విశ్వ విద్యాలయ ప్రవేశ పరీక్ష ప్రశ్న పత్రంలో దొర్లిన ముద్రారాక్షసాలను ఆయన తెలిపిన తీరు ఇది :

"ఇక ప్రవేశ పరీక్షా పత్రములోని తప్పులో యన్న నెన్నియని యెన్న శక్యముగాక యున్న అందు గొన్నిటిని బూర్వోత్తర సందర్భమునుబట్టి తెలిసి కోవచ్చుగాని తక్కినవి బొత్తిగా నర్థము చేసికొన వీలులేనివిగా నున్నట్టు చూపట్టుచున్నవి. వానిలో గొన్నిటి మాత్ర మిందు బ్రదర్శించుచున్నాము.

'అయ్యయాతి రుక్కానం జనంగాదె. ఏమిగతిలుచనంబకగు, కుసుమస్తక ఒకలాలవలెప్పుడమినకడు గావున!' ఇట్లు స్థాలీపులాక న్యాయమున గొన్నిటి మాత్రమెత్తి చూపి యిప్పటి కింతటితో విరమించుచు ముందైన భిన్న పత్రముల ముద్రింపించి సరిచూచుట యందు సకల కళాశాలాధ్యక్షులు మిక్కిలి జాగరూకతతో నుందురని యిందువలన గోరుచున్నాము." (1874 డిసెంబరు)

2. రాజమహేంద్రవరము పారిశుద్ధ్య విచారణ సభవారు (మునిసిపాలిటీ): "ప్రస్తుతము ఈ సభలో జేరియున్న రాజమహేంద్రవరపు కమీషనరు[1] లనేకులు తాము పొందియున్న యున్నత పదవుల కెంత మాత్రమును దగినవారు కారు. వీరిదివరకేవిషయము నందును సభలో నిలిచి స్వతంత్రముగా దమ యభిప్రాయము జంకుమాని యొకప్పుడైనను జెప్పినవారు కారు; ఇక జెప్పువారు కాదు; చెప్పుటకు శక్తిగల వారును గారు. వీరు సభకు నిండుగా గుర్చీలలంకరించి కూరుచుండుటయే కాని యొకనాడైన జనుల కనుకూలముగా వాదించి ప్రజా సౌఖ్యమునకు బాటుపడు పాపమును గట్టుకొన్నవారు కాదు. వీరెప్పుడైన దెగించి యొక మాట చెప్పిరేని అది 'చిత్తము చిత్తము' అనునదియే. అంత కెక్కువ చెప్పిన తహశీల్దారుగారి యభిప్రాయముతో నేకీభవించితిమి, సబ్ కలెక్టరుగారి యభిప్రాయముతో నేకీభవించితిమి అనునవియే. ఇట్టివారు తీరు వహించియున్న మహా కార్యము నెట్లు నిర్వహింపగలుగుదురు? వీరు సభికులుగానుండుట వలన ప్రజలకేమి లాభము కలుగును?" (1875 మార్చి)

వీరేశలింగముగారు శ్రీ చింతామణి (1880), సతీహితబోధిని (1883 - 1887), సత్యవాది ప్రారంభించారు. రాయసం వెంగటశివుడు గారితో పాటు జనానా పత్రికను 1889 ప్రారంభించి ఈ శతాబ్ది తొలి సంవత్సరాలలో కొన్నాళ్ళు పాటు నడిపారు. మొదట స్థాపించిన శ్రీ చింతామణికి శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు సంపాదకులు. దీనిలో వావిలాల వారి ఉత్తర రామ చరిత్ర, వీరేశలింగం గారి శాకుంతలం అనువాదాలు వచ్చాయి.

వీరేశలింగంగారు వివేకవర్ధనిలో దాదాపు 200 వ్యాసాలు వ్రాశారు.

## జనవినోదిని (1875-85)

ఈ పత్రిక వివేకవర్ధనికి సమకాలికమైనది. దీనికి ఐ. కృష్ణమాచార్యులు సంపాదకుడు.

తొలిసారిగా బాల సాహిత్యం ప్రచురించిన పత్రిక యిదే. పిల్లలకోసం

---

1. అప్పట్లో కౌన్సిలర్లను కమీషనరులు అనేవారు.

పెక్కు కథలు ప్రచురించారు. సుప్రసిద్ధ విద్వాంసులు చదలవాడ సీతరామశాస్త్రి గారు దీనిలో దక్కన్ పాత కథలు ప్రచురించారు.

## ప్రబంధ కల్పవల్లి

గురుజాడ శ్రీరామమూర్తిగారు సంపాదకులుగా ఈ పత్రిక పెద్దాపురం నుంచి వెలువడింది. (1880-82) దీని ప్రధాన లక్ష్యం ప్రాచీన ప్రబంధాలు ప్రచురించడం. తమ్మభూపాలుని కృష్ణ విజయం దీనిలో ప్రచురితమయింది. శ్రీరామమూర్తిగారు వీరేశలింగంగారికంటే ముందే ఇంగ్లీషు నాటకాలు అనువదించడానికి పూనుకొని మర్చెంట్ ఆఫ్ వెనీసు నాటకం ఆంధ్రీకరించారు. ఈ పత్రికలో మరొక విశేషం కవి జీవితాలు వరుసగా ప్రచురించడం. సకల విద్యాభివర్ధనిలోనూ, సుజనరంజనిలోనూ కవి జీవితాలు ప్రారంభమైనా అవి రెండు మూడు కన్న ఎక్కువ వెలువడలేదు. రచయిత ఎవరో కూడా సరిగా నిర్ణయించలేదు. కాని గురుజాడ శ్రీరామమూర్తిగారు ప్రబంధ కల్పవల్లిలో కవి జీవితాలు విపులంగా ప్రచురించారు. వీరి సహాయ సహకారాలతోనే వీరి బావ గారైన పారుపల్లి లక్ష్మీనారాయణగారు కాకినాడ నుంచి రాజయోగి పత్రికను "ముముక్షు జనావశ్యక పరంపరా సాధనాంతర్గత గుప్తవిద్యలను మంత్రయోగ శాస్త్రములను గురించి ప్రధానముగా ప్రశంసించుట" కోసం ప్రచురించారు. ఈ పత్రికలో ప్రబోధ చంద్రోదయం మొదలైన ఆధ్యాత్మిక గ్రంథాలు వెలువడ్డాయి.

## యదార్థవాది

గరుడా కూర్మయ్య సంపాదకత్వాన విశాఖపట్నం నుంచి ఈ పత్రిక వెలువడింది. (1881-85.) దీనిలో ప్రకటితమైన ప్రధాన గ్రంథాలు ప్రభులింగ లీలలు, ముక్తి చింతామణి.

## నీల దర్పణము

శ్రీకాకుళంజిల్లా జులుమూరు నుంచి భగతా తమ్మయ్యశాస్త్రి దీనిని వెలువరించారు. (1885-87.) ఈ కాలంలోనే **సుజనోల్లాసిని** అనే మాసపత్రిక ఏడునూతుల ముత్తయ్య సంపాదకత్వాన వెలువడింది. ఇది చాలా శైవగ్రంథాలను ప్రచురించింది.

## హిందూజన సంస్కారిణి

ఈ పత్రికను మన్నవ బుచ్చయ్య పంతులు అనే సంఘ సంస్కార ప్రియుడు మద్రాసు నుంచి నడిపించారు (1885-1902; 1912-14). మొదట్లో

ఈయన బ్రహ్మ సమాజాభిమాని. వీరేశలింగంగారికి మిత్రుడు. ఆయన ఉద్యమానికి కూడా తోడ్పడ్డాడు. కాని తర్వాత హిందూ మతాభిమానిగా మారి పోయాడు. ఈ పత్రికలో శ్రుతి స్మృతి ఉపనిషత్తులతో పాటు వార్తలు విశేషాలు, పుస్తక పరిచయాలు ఉండేవి. వార్తలకు ఒక మచ్చు : "మ.రా.శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఋగ్వేదమునకు తెలుగు వ్రాయ ప్రారంభించినారు. వీరు తెలుగున మహా పండితులు గనుక వీరి తెలుగుఋగ్వేదము మిక్కిలి బాగుగనుండును. వీరి వివేకవర్ధని యందిది ప్రచురింపబడి పిమ్మట ప్రత్యేకమైన సంచికలుగా వెలకు సిద్ధము చేయబడునని నమ్ముచున్నాము. తెలుగు తెలిసిన వారందరు వివేకవర్ధనినిగాని ప్రత్యేకమైన ఋగ్వేద సంచికలనుగాని కొని చదువుకొని ప్రాచీన హిందూమతమును తెలిసికొని వర్ధిష్ణువులు కావలెనని కోరుచున్నాము."

ఇక పుస్తక సమీక్ష : "మ.రా.శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి తెలుగు నాటకములు మొదలైన గ్రంథములు తెలుగు తెలిసిన జనులు చదువవలసినవగును. ఇప్పుడు సత్యహరిశ్చంద్ర నాటకమని యొకటి మృదు మధుర శైలిలో రచించి ప్రచురించినారు. ఇది నూరు పుటలకంటే నెక్కుడుగా నున్నను అందరికినీ సులభంగా లభింపజేయుటకై దీని వెల ఎనిమిది (8) అణాలు మాత్రమే నిర్ణయించినారు." (హిందూ జన సంస్కారిణి 1887 ఆగస్టు; సం.3, సం. 1) హిందూజన సంస్కారిణిలో పడిన ఒక తెలుగు విజ్ఞాన శాస్త్రజ్ఞుని వార్త మనకు చాలా కుతూహలం కలిగిస్తుంది :

"జమీందారు వంశస్థులు శాస్త్రవిషయమైన పరిచయము పొందుట అరుదు. అయినను శ్రీ వెంకట జగ్గారావుగారు ఈ తెగలో తప్పబుట్టినవారు. గణితశాస్త్రమునందు జ్యోతిశ్శాస్త్రమునందు విశేష పాండిత్యమును సంపాదించి జ్యోతిశాస్త్ర సిద్ధాంతులలో ముఖ్యులైనారు....

వారు స్వర్గస్థులగునపుడు తమ సంతతి వారిని దానిని (తాము నిర్మించిన నక్షత్రశాలను) తమ సంస్థానాదాయము నుండి భరించుచుండవలెనని మరణ శాసనమున వ్రాసినారు. వారి తదనంతరము మ.రా.రా.శ్రీ రాయబహద్దరు అంకితం వెంకట నరసింగరావుగారు డిప్టీ కలెక్టరుగా నుండినవారు శ్రీ వెంకట జగ్గారావుగారి ఒకే కుమార్తెను వివాహమాడి మామగారి శాస్త్ర విషయ కృషియందాసక్తి నొంది సదరు నక్షత్రశాలను నానా విధముల వృద్ధి నొందించి గవర్నమెంటువారితోను ఇతరదేశపు శాస్త్రజ్ఞులతోను ఉత్తర ప్రత్యుత్తరములు పెట్టుకొని అతి సమర్థులని పేరుపొంది రాయల్ ఏష్యాటిక్ సొసైటీకి రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీకి ఫెల్లో అయినారు. శ్రీ వెంకట జగ్గారావుగారి కుమార్తె

గారైన వీరి భార్యగారు తమ తండ్రి గారి ప్రియము చొప్పున అబ్జర్వేటరీని శాశ్వత బ్రహ్మకల్పముగా కాపాడబడుటకై మూడు లక్షల రూపాయలను మూల ధనముగ నుంచినారు. శ్రీ నరసింగరావుగారు తాము కనిపెట్టిన వింతల నంత 1883 సంవత్సరమున ఒక పుస్తకముగా ప్రచురించినారు. (హిం. జ. సం. 1891)

## అముద్రిత గ్రంథ చింతామణి

1835 నుంచి అర్ధ శతాబ్దివరకు వెలువడిన సాహిత్య పత్రికలలో సాహిత్యేతర విషయాలు ఉండేవి. వివేకవర్ధనిలోను దీనికి అవ్యాప్తిలేదు. కాని అముద్రిత గ్రంథ చింతామణి కేవలం సాహిత్యానికే అంకితమైపోయి, విమర్శన విషయంలోను పాశ్చాత్య పద్ధతులకు నారులుపోసి గొప్ప సంస్థగా వెలిగింది. పేరునుబట్టే దీని లక్ష్యం అముద్రిత గ్రంథాలను ప్రచురించడమని స్పష్టంకదా. ఇది సాహిత్య విమర్శలో నూతనదృష్టి కలిగించింది. పాశ్చాత్య విమర్శరీతులు అప్పటికింకా మనకు అలవడలేదు. ప్రాచ్యరీతిలోనే విమర్శలు జరిగేవి. ఈ పత్రిక పాశ్చాత్య పద్ధతిలో కొంచెం ఆలోచించి కొత్తదారి తొక్కింది.[1]

ఈ పత్రిక నెల్లూరునుంచి పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వంలో వెలువడేది. దీనిలో ఆనాటి మహోద్దండ పండితులు మహాభినివేశంతో చర్చలు జరిపేవారు. గ్రంథ సమీక్షలు, భాగాలుగా ప్రాచీన గ్రంథ ప్రచురణ, వాటి కాలదేశ నిర్ణయాలపై చర్చలు జరిగేవి. అవసరమైనప్పుడు పత్రికాధిపతే గ్రంథ సమీక్షలు చేసేవారు. మండపాక పార్వతీశ్వరశాస్త్రి, వేదం వేంకటరాయ శాస్త్రి, నడకుదుటి వీరరాజు పంతులు మొదలైన పండితులు చర్చలు జరిపే వారు. దీనిలో ప్రచురించిన సాహిత్య లేఖలు తర్వాత 'అముద్రిత గ్రంథ చింతామణి లేఖలు' అన్న పేరుతో పుస్తక రూపంగా వెలువడ్డాయి. ఆధునికాంధ్ర సాహిత్యానికి మూలపురుషులైన వారందరూ దీనిలో వ్యాసాలు వ్రాసినవారే.

దీనిలోని అంశాలను స్థూలంగా ప్రాచీన గ్రంథ ప్రచురణం, సమకాలిక రచన ప్రచురణం, భాషా సాహిత్యాల చర్చ, మెట్రిక్యులేషన్ మొదలు ఎం,ఎ. వరకు పాఠ్య గ్రంథాల ప్రచురణ, కవుల నిర్యాణ వార్తలు, కవిపండితుల ఉత్తర ప్రత్యుత్తరాలు, గ్రంథ సమీక్షలు అని క్రోడీకరించవచ్చు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు పందొమ్మిదవ శతాబ్ది చివరి పాదవు సాహిత్యానికి కరదీపికలు.

---

1. తెలుగు వ్యాసం - నూరు సంవత్సరాలు.

ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు బెల్గ్రాముల ద్వారానూ జరిగేవి. ఈ పత్రిక రెండు దశాబ్దాలు ఆంధ్ర సాహిత్య రంగాన్ని (1885-1904) ఏకచ్ఛత్రంగా ఏలిందన వచ్చు. ఒక ఉత్తరం, దానిపై సంపాదకుని వ్యాఖ్య ఉదాహరిస్తాను :

"మహారాజశ్రీ అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతి గారికి,

అయ్యా,

ఇందు బొందుపరచిన యంశంబులను సుధీబృందానందకరంబగు భవ దమూల్య పత్రికా పత్రములయందు బ్రకటింపగోరినాను.

'సంపుటము 1 సంచిక 5 లో వల్ల యను పదము మహాకవి ప్రయోగమున లేదని లిఖించితిరి. ఆంధ్ర కవితాపితామహుడనియు, కవి గండడనియు, సర్వతోముఖుండనియు బిరుదులందిన యల్లసాని పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిష మనుసంభవమునందు ద్వితీయాశ్వాసమున బదియవ పద్యమున "చలిమలవల్ల నుల్లసిలు చల్లదనంబును నూనకుండినన్" అని వ్రాయబడి యున్నది.

ఇట్లు తమ మిత్రుడు

కర్నూలు ఆసూరి శ్రీనివాసాచార్యులు

7-9-1891 నూతన చందాదారు, కర్నూలు

రిజిష్ట్రారుగారి ఆఫీసు హెడ్‌క్లర్క్

దీనిపై సంపాదకుని వ్యాఖ్య :

పైనుదాహరింపబడిన వల్ల యను పదమునకు శ్రీనివాసాచార్యులవారు మనుచరిత్ర ప్రయోగము గనుపరచినను గవిత్రయకృతమగు భారతమున జూపిన శిరసావహింపనర్హ మని విన్నవించుచున్నాము. పత్రికాధిపతి.

(అముద్రితగ్రంథ చింతామణి 1891 అక్టోబరు.)

కన్యాశుల్కం నాటకంపై సంపాదకుడు రామకృష్ణయ్య చేసిన సమీక్ష లోని భాగాలను కొన్నింటిని ఉదాహరిస్తాను :-

"శ్రీ విజయనగర రాజ్యమున ప్రాచీన లిపి పాఠకులగు మహారాజశ్రీ గురుజాడ అప్పారావు పంతులు బి.ఏ. గారిచే రచితమైన కన్యాశుల్కము అను నాటకము గ్రంథకర్తచే బంపబడినందున కృతజ్ఞతాభివందనాల నందుకొని సాంతముగ జదివినారము. ఈ నాటకమున కిడిన పేరువలననే గ్రంథకర్తగారి యభిప్రాయము స్పష్టమగుచున్నది కదా! మనదేశములో నీదుర్వృత్తి నానాట వృద్ధి యగుచున్నది. ప్రతిమండలములో నిట్టి కార్యములు పెచ్చు పెరుగు చున్నవి. వీనిని రాజ్యాధిపతులు నివారించవలెను.... ఇట్టి యకృత్యములు

దండనముచేగాని చక్కబడవని రూఢిగా చెప్పగలము. అయినను లోకములోని దుర్నీతి యిట్టిదని నాటకములచే బ్రదర్శించిన నట్టివారికి గొంత విషయమైనను బోధపడునని కాబోలు గ్రంథకర్తగా రీ గ్రంథమును లిఖించినందులకు మేమెంతయు సంతసించుచున్నాము. బహుకాలముల నుండి సర్వతోముఖముల వ్యాపించియున్న యిట్టి యకార్యముల నొక్క పెట్టుగ గొట్టుటకు నెట్టి వారికైన సాధ్యమగునా ?

"ఈ నరమాంస విక్రయమను కన్యాశుల్కము ముఖ్యముగ నింగ్లీషు వాసన తెలియని వారిలో నిప్పుడు జరుగుచున్నది. దాని నాపవలయునని గ్రంథకర్తగారి యుద్దేశము. అట్టివారికి స్పష్టముగ దెలియుటకై గ్రామ్యోక్తులందు జేర్పబడి నందులకై మే మామోదించితిమి. ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథికభాష నిరుపయోగముగాన 'శశిరేఖ' యభిప్రాయముతో మే మేకీభవింపముగాని ఇంగ్లీషు పదములు విశేషముగ జేర్చినందులకై మాత్రము కొంచె మాలోచించుచున్నారము.... ఇంగ్లీషు పదములలో వాడుకలోనుండు వానిని ప్రయోగించినచో నా భాషాజ్ఞానము లేనివారికి దెలియునని మావాదముగాని, వాని బొత్తిగా బ్రయోగింపగూడదని కాదు. ప్రాకృతమునకు ఛాయ వ్రాసినట్టుగ నట్టివాడుకలేని ఇంగ్లీషు మాటలకు నొక తెలుగర్థముల ఛాయ గ్రంథమున సంపూర్ణముగనున్నను గొంత మేలని తోచెడి...."[1]

పదచర్చలు, అలంకార విమర్శ కాక సమష్టిగా గ్రంథ విషయాన్ని సమీక్షించడమనేది కొత్త పద్ధతి. చాటుపద్యాలను ప్రచురించిన తొలిపత్రిక యిదే.

## చింతామణి - నవలలపోటీ

అముద్రిత గ్రంథ చింతామణి ప్రాచీన గ్రంథాలను ముద్రించడంతో సమకాలిక పత్రికలు మరొన్ని ఈ పనికి పూనుకొన్నాయి. అట్టి వాటిలో పేర్కొనదగినది న్యాపతి సుబ్బారావు పంతులుగారి యాజమాన్య నిర్వహణలో రాజమండ్రి నుంచి వచ్చిన చింతామణి. ఇది విజ్ఞానేశ్వరీయం, భోజరాజీయం, వరాహపురాణం, మొల్లరామాయణం, ప్రభావతీ ప్రద్యుమ్నం మొదలైన కావ్యాలు ప్రచురించింది. ఇది 1890-94 వరకు నాలుగేళ్ళ వచ్చింది.

ఈ పత్రిక గూర్చి చెప్పవలసిన మరొక గొప్ప సంగతి తెలుగు నవలా రచన పోటీలు తొలిసారిగా ప్రారంభించడం. ఈ సందర్భంగా నవల అంటే ఏమిటి? ఎలా వుండాలి? ఎలా వ్రాయాలి ? మొదలయిన అంశాలను

---

1. పరిశోధన - గురుజాడ సంచిక : సంపాదకుడు - తిరుమల రామచంద్ర, డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

గూర్చి వివరణ యిచ్చింది. ఆ రోజులలో ఈ ప్రక్రియకు నవల అన్న పేరు రూఢి కాలేదు. దీనిని వచన ప్రబంధమని వ్యవహరించేవారు. ఈ పత్రిక నవలల పోటీకి కొన్ని మార్గదర్శక నియమ నిబంధనలను తెలిపి, కొన్ని వివరణలు కూడా యివ్వడంవల్ల నవల పుట్టిన కాలానికి నవలను గూర్చి మన సాహిత్య వేత్తల అభిప్రాయాలు ఎలా వుండేవో తెలుసుకోవచ్చు. తొలిసారిగా జరిపిన నవలల పోటీలను గూర్చి యీ పత్రిక ఇట్లా ప్రకటించింది :-

"ఇటువంటి వచన ప్రబంధములను పశ్చిమ ఖండవాసులు విశేషముగా వృద్ధి చేసిరేకాని మనవా రీ విషయమున నంతగా కృషి చేయలేదు. ఆ దేశములందు సహితము మొట్టమొదట నీ పుస్తకములు కథల మూలముననే యారంభమయి, యంతకంతకూ స్వాభావికమైన యిప్పటి ప్రబంధ రూపమున వృద్ధి పొందినవి. మనదేశమునందలి పంచతంత్రము, హితోపదేశము, హంసవింశతి, శుకసప్తతి, మొదలయిన కథ లా దేశమునందు మొట్టమొదట పుట్టిన కథలవంటివే. కొంత కాలమయిన తర్వాత మనదేశమునందాకథలు సంస్కృతమున దశకుమార చరిత్రము మొదలయినవిగాను తెనుగున షోడశకుమార చరిత్రము మొదలయి నవి గాను గొంతవరకు వృద్ధినొందెను. గాని యావృద్ధి క్రమక్రమముగా రాక యంతటితో నిలిచిపోయినది. ఇంగ్లీషు వారి గ్రంథములను జూడ ఇప్పటి మన వారు వచన ప్రబంధములను వ్రాయనారంభించినారుగాని యింకను మన భాషలో నుండవలసినన్ని పుస్తకములు పుట్టలేదు. రాజశేఖర చరిత్రము, సత్యరాజాపూర్వదేశ యాత్రలు, సత్యవతీ చరిత్రము, సత్యసంజీవని మొద లయిన పుస్తకము లీ తరగతిలో జేరినవి. ఇంగ్లీషుభాషా పరిశ్రమము లేక యిటువంటి వచనప్రబంధములను రచియింపదలచుకున్నవారు కొంతవరకు పయి పుస్తకములను దమకు మార్గ ప్రదర్శకములుగా జేసికొనవచ్చును. మన భాషయం దిటువంటి నూతన ప్రబంధములను తన్మూలమున భాషను వృద్ధి చేయుటయే యీ చింతామణి బహుమానముల యుద్దేశము...." (1893 ఏప్రిల్, సం. 2, సం. 10.)

బహుమానం ఏర్పాట్ల వివరాలను, రాయవలసిన నవలల నియమ నిబంధనలను ఈ పత్రిక 1893 మార్చి సం. 2, సం. 9 లో యీ విధంగా ప్రకటించింది :-

**చింతామణి బహుమానములు :**

తెలుగు భాషనభివృద్ధి చేయుటకును, తద్గ్రంథ కర్తలకు ప్రోత్సాహము కలిగించుటకును చింతామణి బహుమానములని రెంటిని ద్రవ్య రూపమున నేర్పరచినారము. అందు మొదటి బహుమానము బడసిన వారికి డెబ్బదియైదు

రూప్యంబులును, రెండవ బహుమానమున కేబది రూప్యంబులు నియ్యబడును. ఈ బహుమానంబుల నంద ప్రయత్నించు వారీ కింది నిబంధనల కొడంబడి యొక 'వచన ప్రబంధమును' వ్రాసి యంపవలెను.

1. ప్రబంధము (**Novelette**) ముద్రిత మైనప్పుడు చింతామణి పుటల వంటి 50 పుటలకు తక్కువ కాకుండవలెను.
2. ప్రబంధమును వ్రాయునపుడు స్ఫుటమగు విడియక్షరములతో కాగిత మున కొకప్రక్కన మాత్రమే వ్రాసి యంపవలెను. గ్రంథము యొక్క మూలకథ హృదయరంజకముగను స్వభావ విరుద్ధముగాకయు సులభ శైలిగ నుండవలెను.
3. ఆ గ్రంథము చింతామణి పత్రికాధిపతిగారికి జూన్ నెల 1వ తేది లోపుగ జేరవలయును.
4. గ్రంథముల నంపువారు తమ తమ నామంబులను గ్రంథము పయిని వ్రాయక యేదియో యొకగురుతు నా గ్రంథము యొక్క మొదటి పుట పయినుంచి దానిని తెలియజేయుటకుగాను వేరొక యుత్తరమును వ్రాసి అందు తమ నామంబులను పయి నిబంధనల కొడంబడుచు దాము పంపిన గ్రంథ నామమును దమ చిరునామాయును వ్రాసియంపవలెను.
5. అట్లు పంపబడిన పుస్తకముల బరిశీలనార్థమై మహారాజశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి గారును, కందుకూరు వీరేశలింగము గారును చింతామణి పత్రికాధిపతులును మధ్యవర్తులుగా నేర్పడి హృద్యంబులగు వానిని రెంటినిగొని తత్ఫలితమును సాధ్యమయినంత త్వరలో జూలయి నెల చింతామణిలో ప్రచురింతురు.
6. బహుమానము లియ్యబడిన గ్రంథములు చింతామణి పత్రిక యందు ప్రకటింపబడుచుండును. ఆ పత్రిక యందవి పూర్ణముగా ప్రకటింప బడిన తర్వాతనె కాని యంతకు లోపుగా గ్రంథకర్తలు వానిని ప్రత్యేకముగ ప్రకటించుకొనగూడదు. బహుమానములు పడయని గ్రంథములు మరల వాని కర్తల కంపబడును."

ఈ నిబంధనలు ఇంత స్పష్టంగా వున్నా మళ్ళీ కొందరు వివరణలు కోరారు. దానికి పత్రికాధిపతి మరుసటి సంచికలో (సం. 2, సం. 10.) ఇలా వివరణలిచ్చాడు :

"…. ప్రబంధమనగా కల్పితమైన కథ. ఆ కథను పురాణేతి హాసాదుల నుండిగాని చరిత్రముల నుండిగాని గైకొని కథాసారస్యమున కనుకూలముగా

నుండులాగున దానికి నూతనాంశములను జేర్చి పెంచి వ్రాయవచ్చును. లేదా కవి మొదటినుండి కడవరకును స్వబుద్ధి చేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును. కథాంశము వ్రాయువారి బుద్ధి విశేషము ననుసరించియుండును గాన దానిని గురించి విధులు చెప్పుట యనావశ్యకమేయైనను కథ పూర్ణముగా కల్పితమయినను గొంతవర కితర గ్రంథములనుండి గ్రహింబడినదైనను చమత్కారముగా నుండి చదువువారికి హృద్యముగా నుండవలెనని చెప్పుట యనావశ్యకము కాదు. శృంగారమో వీరమో ఏదో యొక రసమును ప్రధానముగా జేసుకొని వివిధ రససంయుతముగా నుండునట్లు కాని యాయా రసమును పోషించుటకయి కష్ట సుఖములను ప్రయత్నములను కార్య విఘాతములను కార్య సాఫల్యములను మధ్యమధ్య సందర్భోచితముగ దీసికొని వచ్చుచు కథ యంతయు నొక్కని చరిత్రమువలె నుండునట్లు కాని వ్రాయవలెను ...."

పోటీ నవలల మొదటిసారి బహుమాన నిర్ణయము 1893 జులై సం. 3, సం. 1 లో ప్రకటించారు. అప్పుడు మొదటి బహుమానం ఖండవల్లి రామచంద్రుడుగారి ధర్మవతీ విలాసానికి, రెండవ బహుమానం తల్లా ప్రగడ సూర్యనారాయణగారి సంజీవరాయ చరితానికి వచ్చాయి. ఈ విషయం ప్రకటిస్తూ బహుమాన నిర్ణాయకులలో ఒకరైన శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు పద్యాలు కూడా చెప్పారు. మూడే నవలలు వచ్చాయి. కాబట్టి మూడో నవలకు కూడా ఎవరైనా ధనికులు బహుమతి ఇస్తే బాగుకదా అని సూచించారు. ఆ పద్యాలు ఇవి :

"కూర్మి దెలుంగు బాస నెల కొల్పుటకై వచన ప్రబంధముల్
ధార్మిక బుద్ధిరాణ్ణయ విదగ్ధులు న్యాపతి సుబ్బరావుగా
రూర్మిమదాంతరంగిక రసోత్థముగా సమకూర్చు దన్న ద
న్నిర్మితికిం గడంగిన ప్రణేతల వాక్య నిబంధనంబులన్
ధర్మవతీ విలాసకృతి తథ్యముగా దగె స్రగ పూజకున్.
రెండవ బహుమతి కిం దగి
యుండును సంజీవరాయ నురు చరితంబున్
గొండాడ జొనుపు చున్నది
చండ విధంబున వివేక చంద్రోదయమై.
మొదటి తడవ గనుక మూడవ కృతికిని
ధనికులెవ్వరేని తగినపూజ
చేయ మేలటంచు జెప్పి మన్నన గోరు
వావిలాల వాసుదేవశాస్త్రి.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు గొప్ప నవలా రచయిత కావడానికి ఈ పత్రిక చాలా ఉపకరించింది. వీరేశలింగంగారికి రావుబహద్దర్ బిరుదు వచ్చినప్పుడు రాజమండ్రిలో వివిధ సంస్థలు చేసిన సన్మానాలను ఈ పత్రిక ప్రచురించింది.

అముద్రిత గ్రంథ చింతామణిలో కన్యాశుల్కంపై విమర్శ విన్నారు. చింతామణి పత్రిక విమర్శ కూడ వినండి. విమర్శ స్థాయి క్రమంగా ఎలా పెరిగిందో తెలుసుకోవచ్చు.

**కృతి విమర్శనము - కన్యాశుల్కము**

"ఘనతకెక్కిన శ్రీ విజయనగరము మహారాజులుగారి శాస్త్ర పాఠశాలలో సహాయోపాధ్యాయులును శ్రీవిజయనగర సంస్థానమున ప్రాచీన లిపి పాఠకులును నగు మ.రా. శ్రీ గురజాడ అప్పారావు పంతులు బి. ఏ. గారిచే రచింపబడిన 'కన్యాశుల్క'మను నవీన నాటకము మా కార్య స్థానము నలంకరించినది. ఇది యేడంకములు గల నాటకము. ఈ నాటకము నందు బాల్య వివాహములు కన్యా విక్రయము మొదలగు దురాచారముల వలన దేశమునకు గలుగు నష్టములు చక్కగా వర్ణింపబడినవి. ఈ గ్రంథము హాస్యరస ప్రధానము. ఈ గ్రంథము చక్కగా బరిశోధించినచో గులాచార సంస్కరణ మావశ్యకమని తోచక మానదు. ఇదివరలో సంఘ దురాచార సంస్కరణములుగూర్చి వ్రాయ బడిన బ్రాహ్మ వివాహము మొదలగు గ్రంథముల కంటే యీ గ్రంథము నూతనపద్ధతిని వ్రాయబడినట్లు గ్రంథకర్తగారు పీఠికయందు దెలియజేసి యున్నారు. ఈ గ్రంథము నాటక రూపమున వ్రాయబడుటచే జదువరులకు హృదయరంజకముగానే యుండవచ్చును. జనోపయోగార్థమై రచింపబడిన ఈ గ్రంథ పఠనమువలన దేశారిష్టములు కొంతవరకు దొలగిపోవుగాక. ఏ తద్గ్రంథ రచన యందలి గ్రంథకర్తగారి ముఖ్యోద్దేశము నెరవేరునుగాక. సర్వజన సామాన్య గ్రాహ్యమైన యీ గ్రంథము దేశమంతటను వ్యాపించి సంఘసంస్కరణమునకు సహకారిగా నుండుగాక! వలయు వారు గ్రంథకర్త గారికి విజయ నగరము, వ్రాసి పుస్తకములబడయ వచ్చును. వెల ఎనిమిది అణాలు వి.ఎస్."

రాజకీయాలలో ఆంధ్ర భీష్ములైన న్యాపతి సుబ్బారావుగారు సాహిత్య పత్రికను రాజకీయాలకు అతీతంగా నిర్వహించడమనేది ఆశ్చర్యకర విషయం.

## శ్రీ మద్వర్తమాన తరంగిణి

"ఇయ్యది నెల్లూరు మండలములోని బుచ్చిరెడ్డి పాళియమునందలి శారదా స్థానము నుండి ప్రతి పూర్ణశకమాసమునను బెజవాడ బాలకృష్ణారెడ్డి

గారిచే ప్రకటింపబడు మాసపత్రిక" అని దీని ముఖపత్రం మీద వుండేది. ఇది రెండేడ్లు 1894-96 మనినది.

దీనిలో సంస్కృత రచనలు గూడా వుండడం విశేషం. "సత్కవిప్రశంశనము" అనే శీర్షిక కింద కవి చరిత్రాదులు ప్రచురించేవారు; సమకాలిక కవులను గురించి వ్రాసేవారు. 1895 అక్టోబరు సంచికలో వీరేశలింగముగారిని గురించి ప్రచురించారు. ఈ పత్రికకు బెజవాడ పట్టాభిరామిరెడ్డిగారు (డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి తండ్రి) మేనేజరు. ఈయనా పెక్కు రచనలు చేశారు. ఈయన వీరేశలింగంగారిని గూర్చి వ్రాసిన దానిలో కొంత భాగం ఉదాహరిస్తున్నాను. విమర్శ వ్యక్తుల చుట్టూ ఎలా పరిభ్రమించేది అన్న విషయం తెలుస్తుంది.

"....వీరి నివాస స్థలము రాజమహేంద్రవరము. జన్మభూమియు నిదియే. వీరి ముత్తాత తండ్రియైన రాజలింగముగారి పూర్వులు మా మండలమునందు కందుకూరు నందుండిరట. ఇందుచే వీరికి కందుకూరు వారను పేరు వచ్చినది. వీరి తాతయును వీరేశలింగం పంతుల వారే. వీరి పెదతండ్రి వెంకటరత్న లింగం. వీరి తల్లి పున్నమ్మ. వీరి తండ్రి సుబ్రహ్మణ్యలింగం పంతులుగారు. వీరి భార్య రాజ్యలక్ష్మమ్మ. వీరు జన్మించినది శైవ విశిష్టాద్వైత మతమున. ఇట్లయ్యు నదేమి కర్మగతియో కాని వీరికి మతమున నభిరుచియన్న మాట లేదు. ఒక్క యీ మతమునందే యననేల; దా హిందువేయయ్యు హిందూ మతములగు ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతములలో నెద్దానను వీరి కభినివేశమే లేదు. బౌద్ధ చార్వాకాదిమతములును వీరి కభిమతములు కావు. క్రైస్తవ మహమ్మదీయా ద్యన్య దేశీయ మతములందును వీరికంతగ నిష్టమున్నట్లు జూపట్టదు. మరి వీరి మత మెద్దియో? ప్రతి మతమునందును గొన్ని యంశము లంగీకరించుచునే యుందురు మరికొన్ని యంశములపై కోట కట్టుచుందురు. ఇందుచే వీరి కంగీకార్యమైన మత మిద్దియనియు నామత స్వరూప మిటువంటిదనియు దెలియక సజ్జనులు సంశయాత్ములగుచున్నారు. గాని వీరి మతమున నంగీకరింప బడియుండు యావదంశములపై పొత్తం బొంతు విరచించుట మేలని వీరికి విన్నవించుచు విబుధ విశదీకరణార్థముగ నా దెలిసిన కొలది వీరి మతము నందలి కతిపయాంశముల నిట నుదాహరించెద...." (మ్యానేజరు— శ్రీమద్వర్తమాన తరంగిణి, 1895 అక్టోబర్. సం. 2, సం. 7.)

ఆనాటి నెల్లూరు ప్రాంతపు విశేషాలు, కవులు, వారిపాండిత్యం మొదలయినవి ఈ పత్రికవల్ల లెస్సగా తెలుస్తాయి.

## శ్రీ వైజయంతి (1894-99)

దీని సంపాదకులు ప్రముఖ రాజకీయ వేత్తలైన వనప్పాకం అనంతాచార్యులు. ఈయన 1891 లో నాగపురంలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షులు. ఈయనకు 'విద్యా వినోది' అనే బిరుదు కూడా ఉన్నది. ఈ పత్రిక మద్రాసు నుంచి వెలువడేది. ఇది కూడా పూర్తిగా అముద్రిత గ్రంథ చింతామణి, చింతామణి పత్రికలను అనుసరించింది. "విద్యా విషయ వ్యాసములు, పురాతన గ్రంథ గుణాగుణ ప్రదర్శకములగు చర్చలును, నముద్రితంబులగు పూర్వకృతి రత్నంబులును, నవీన కావ్యమణులును, నాధునిక గ్రంథ విమర్శనంబులును లక్షణజ్ఞాన ప్రదంబులగు లేఖలును" ప్రచురిస్తామని మొదటి సంచికలో సంపాదకులు ప్రతిజ్ఞ చేశారు.

సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర విద్వత్కవితల్లజులు, ఆంధ్ర సాహిత్యానికి నన్నెచోడుని కుమారసంభవం, క్రీడాభిరామం, సకలనీతి సమ్మతం వంటి అపూర్వ గ్రంథాలను; సంస్కృత సాహిత్యానికి కుందమాల, చతుర్భాణి, భరతనాట్యశాస్త్రం వంటి లోకోత్తర గ్రంథాలను "తాళీదళ ప్రకరకాంతారంబుల" నుంచి వెదికి ఇచ్చిన సుగృహీత నామధేయులు మానవల్లి రామకృష్ణ కవిగారు ఈ వైజయంతిలో సమీక్షలు వ్రాసేవారు. వీరేశలింగం కవుల చరిత్ర ద్వితీయ భాగాన్ని 1895 ఏప్రిల్ సంచికలో సమీక్షించారు. 1897 లో ఉత్తర హరివంశం విశేషాలపై తొలిసారిగా వ్యాసం వ్రాశారు. ఈయన మృగావతి మహాకావ్యం ధారావాహికంగా దీనిలోనే ప్రచురితమయింది. కొక్కొండవారి ప్రసన్న రాఘవం ఇందులోనే వచ్చింది.

మానవల్లి రామకృష్ణ కవిగారి ఆంధ్రకవుల చరిత్ర సమీక్షలోని భాగం ఇక్కడ ఉదాహరిస్తాను :

**కృతివిమర్శనము :** ఆంధ్రకవుల చరిత్రము ద్వితీయ భాగము. ఇది రాఉసబహద్దరు కందుకూరు వీరేశలింగము పంతులుగారిచే విరచింపబడినది. ఈ పుస్తక ప్రతి నొక్క దాని బంతుల వారి వలనం గృతజ్ఞతా సూచక వందన పూర్వకంబుగా గైకొంటిమి. ఈ కృతికర్తగా రాంధ్రభాషాభివృద్ధి నభిలషించి యెంతయుంబాటుపడుట శ్రేయస్కరంబు. ఈ గ్రంథమున సుమారేఖది కవుల చరిత్రములు వ్రాయబడియున్నవి. ఈ గ్రంథకర్తగారి వినయ సౌశీల్యాది భావములు వెల్లడించు నుపోద్ఘాత మొకటి పొడగట్టుచున్నది. వీరనేకములైన లక్ష్య లక్షణ గ్రంథములు చరిత్రములు శాసనములు పరీక్షించి మిక్కిలి శ్రమపడి యీ గ్రంథమును వ్రాసియున్నారు. ముద్రింపబడని గ్రంథముల

సంపాదించుట కష్టసాధ్యమైన యీ కాలమునందు వీరలు వానిని సంపాదించుటయే కాక యామూలాగ్రముగ జదివి నిర్ణయించిన యనేక కవుల కాలములు తృప్తికరములుగానే యున్నవి...." ఎం.ఆర్.

సమకాలిక పత్రికల ప్రచురణలను విమర్శించే పద్ధతి ఆ కాలంలో సహృదయతతోనే ఉండేదనవచ్చు. మచ్చుకు:

"శ్రీ యాంధ్రభాషా వధూటికి నాయకమణులుకరణి గడున్ సొబగు గాంచు కావ్య రాజంబుల నత్యంత శ్రద్ధ పొసంగ ముద్రింపించి యెంతయు బేరుబెంపు వడసి త్రిలింగవాగుజ్జీవని యనగ నెగడు నముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ పూండ్ల రామకృష్ణ సుధీవరులచే మా కనుపం బడిన హరిశ్చంద్రనళోపాఖ్యాన కుశలవ చరిత్రలపై మా యభిప్రాయంబు వైశంబ తెలుపువారము." (శ్రీ వైజయంతి 1894 ఏప్రిల్.) పుస్తకాలు చేరాయని మొదట ప్రకటించి తర్వాత సమీక్షించడమనే పద్ధతి బాగానే వుంది. పుస్తకానికి రెండుసార్లు ప్రచారం కలుగుతుంది.

## తొలి మహిళా మాసపత్రిక - బాలిక

తెలుగులో తొలి మహిళా మాసపత్రిక ఇదే కావచ్చు. దీని సంపాదకులు సంగీతరావు బాపిరాజు. ఇది 1895 ప్రాంతాన వెలువడింది. (దీని వివరాలు నాకు లభించనందుకు చింతిస్తున్నాను.)

## తెలుగు జనానా (1893-1904 : 1906)

ఈ పత్రికను మొదట మల్లాది వెంకటరత్నంగారు ప్రారంభించారు. తరువాత రాయసం వెంకట శివుడు గారు స్వీకరించి నిర్వహించారు. ఈ పత్రిక దాదాపు పన్నెండేళ్ళు నడిచింది. వీరేశలింగంగారు, వావిలాల వాసుదేవశాస్త్రి ఇందులో రచనలు చేసే వాళ్ళు. ఈ పత్రిక ప్రచురించిన ఒక వార్త వ్యాఖ్యవల్ల అప్పటి బాలికా పాఠశాలల వివరాలు తెలుస్తున్నాయి: "చెన్నపురి రాజధాని[1]లో నుండు బాలికా పాఠశాలలలో 1897-98 సంవత్సరములో మన చెన్నపురి స్త్రీలకును బాలికలకును విద్య గరపుటకేర్పడియుండిన పాఠశాలలివియని ప్రభుత్వము వారు ప్రచురించిరి. పాలంకోటలో నొక రెండవ తరగతి పాఠశాల గలదు. సారాటకర్ కాలేజీ యనుపేరుగల దానినొక క్రైస్తవ సంఘమువారు జరుపుచున్నారు. మన రాజధానిలో ప్రవేశపరీక్ష వరకును జెప్పు పెద్ద పాఠశాలలు

1. పూర్వం రాష్ట్రాన్ని రాజధాని అనేవారు. చెన్న రాజధాని చెన్నరాష్ట్రం.

21 గలవు. దీనిలో చెన్నపురిలో నుండు ఉపాధ్యాయినుల బోధనాభ్యసన పాఠశాల యొకటి మాత్రమే దొరతనము వారి పరిపాలనలో నున్నది. తక్కిన 20 పాఠశాలలను క్రైస్తవ సంఘాల వారును క్రైస్తవులును జరుపుచున్నారు. ఇక లోవరు సెకండరీ పరీక్ష వరకును జెప్పు పాఠశాల సంఖ్య 185. వీనిలో 115 క్రైస్తవుల యాజమాన్యము కిందను 45 ప్రభుత్వము వారి పరిపాలనము లోను 1 జిల్లా సంఘంవారి పోషణమునందును ఉన్నవి. మిగిలిన 24 మాత్రమే జనులు జరుపుతున్నారు. మన రాజధానిలో 851 ప్రైమరీ పాఠశాలలు గలవు. వీనిలో 385 పాఠశాలలను క్రైస్తవులును, 112 ప్రభుత్వము వారును 23 బోర్డు వారును 31 స్వదేశీయులును స్థాపించి నడుపుతున్నారు. (1889 సం. 6. సం. 8.)

మన మిప్పటికి 19వ శతాబ్ది చివరికి చేరుకున్నాము. అప్పటి పత్రికలను కొన్నిటిని పేర్కొంటాను :

## శశిరేఖ (1893 - 1900)

ఈ పత్రికను గట్టుపల్లి శేషాచార్యులు మద్రాసు నుంచి వెలువరించారు. దీనిలో రాజకీయాలూ వుండేవి. దీనిని సమకాలిక 'వైజయంతి' పత్రిక ఇలా ప్రశంసించింది : "శశిరేఖ నాబరగు నాంధ్రవార్తా పత్రిక యీ చెన్నపురిని వారమున కొక్కసారి ప్రకటితంబగుచున్నది. సర్వజన సమాదరణీయంబులగు విశేషంబులును ఘనత జెందిన హిందువుల చరిత్రంబులును జనులకు దెలియ దగిన వృత్తాంతంబులుం గలిగి యిప్పత్రిక చెలువొందుచున్నది." (శ్రీ వైజయంతి 1894 జులై, సం. 1, సం. 7.)

## ఆంధ్ర ప్రకాశిక (1888-1927)

పెరుగుతున్న జాతీయోద్యమాన్ని ప్రతిబింబించడం కోసం, తెలుగు వారిలో సర్వతోముఖ జాగృతికోసం, ఆధునిక విజ్ఞానాన్ని అందివ్వడం కోసం అప్పటి దేశభక్తులైన నవ యువకులు పూనుకున్నారు. కాంగ్రెస్ వాది, దేశభక్తుడు, సాహితీవేత్త అయిన ఎ. సి. పార్థసారథి నాయుడుగారు ఆంధ్ర ప్రకాశిక అనే వారపత్రిక స్థాపించి 25 సంవత్సరాలు సంపాదకుడుగా ఉండి ప్రభుత్వాన్ని నిర్భయంగా విమర్శించారు. ఈ వారపత్రిక తర్వాత కొంతకాలం వారానికి రెండుమార్లు వచ్చేది. మొత్తానికి నాలుగు దశాబ్దాలు సేవచేసింది. ఒక వారపత్రిక ఆ కాలంలో అంతకాలం అవిచ్ఛిన్నంగా సేవచేయడం అపూర్వం. అప్పట్లో ప్రచురితమైన తెలుగు పుస్తకాల ప్రచురణ కూడా ఇచ్చేది ఇది.

## సత్త్వసాధని (1899-1905)

సుప్రసిద్ధవచన రచయిత ఓ. వి. దొరస్వామయ్యగారి సంపాదకత్వాన మద్రాసు నుండి వెలువడేది ఈ పత్రిక. ఈయన తమిళంలోనూ విద్వాంసుడు కనుక తమిళ నాయనారుల కథలను, వేదాంత విషయాలను దీనిలో ప్రచురించేవారు.

మల్లంపల్లి భైరవశర్మగారి సంపాదకత్వాన వెలువడిన 'రత్నాకరం' (1899-1902), పోలవరం జమీందారు రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు సంపాదకత్వాన రాజమండ్రి నుంచి వెలువడిన 'సరస్వతి' (1898-1912), లక్కవరం జమీందారు రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారి సంపాదకత్వాన ఏలూరి నుంచి వెలువడిన 'మంజువాణి' (1898-1904) పరస్పరం పోటీలుపడి సాహిత్యసేవ చేశాయా అనిపిస్తుంది. రత్నాకరంలో కోరాడ రామచంద్రశాస్త్రిగారి శాకుంతలానువాదం వెలువడింది. సరస్వతి తిరుపతి వేంకట కవులను చాలాకాలం పోషించింది. ఈ పత్రిక కథలను, జీవిత చరిత్రలను, నవలలను, నాటకాలను ప్రచురించింది. కొమర్రాజు లక్ష్మణ రావుగారు దీనిలో శివాజీ చరిత్రను ప్రచురించారు. సి. నరసింహారాయుడు గారు సర్ ఆర్థర్ కాటన్ చరిత్ర ప్రకటించారు. మంజువాణి తిరుపతి వెంకట కవులు వ్యావహారికంలో వ్రాసిన 'పల్లెటూళ్ళ పట్టుదలలను' ప్రచురించింది.

## విజ్ఞాన వర్ధని

తొలి విజ్ఞానశాస్త్ర పత్రిక (1894) ఇది. కేవలం విజ్ఞాన శాస్త్రానికే అంకితమైన పక్షపత్రిక ఇది. దీనిని రాయదుర్గం నుంచి యల్లమరాజు నారాయణమూర్తి ప్రచురించారు. కేవలం వ్యవసాయానికే అంకితమైన పత్రిక జ్ఞానోదయం (1893). దీనికి దాసు కేశవరావు సంపాదకులు. వ్యవసాయం, గొడ్లబాగు, వర్తకం, తోటల పెంపకం, కులాచారాలు, గెజట్ ఆర్డర్లు, వినోదాలు, హాస్యాలు దీనిలో వుండేవి.

అయితే వివేకవర్ధనికి (1875) సమకాలికంగా వెలువడ్డ 'లోకరంజని'లో కూడా శాస్త్రీయ విషయాలు కొన్ని ప్రచురితమయ్యేవి. ఇది చెన్నపురి నుంచి వెలువడేది. సంపాదకులు కాకర్ల సుబ్బయ్య పంతులు. భూగోళశాస్త్ర విషయాలు, హాస్యకథలు, పరీక్షకు కావలసిన టిప్పణులు ఈ పత్రికలో ప్రచురితమయ్యేవి.

ఇవి కాక పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో దాసు శ్రీరామ పండితుల

అనల్ప జల్పితా కల్పవల్లి (1880), సి. గోపాలయ్య టీచర్ (1888), నాదెళ్ళ పురుషోత్తమకవి బుధవిధేయి (1880), క్రైస్తవ మత ప్రచారం కోసం బళ్ళారి నుంచి వెలువడిన లూధరిన్ (1891), సత్తిరాజు సీతారామయ్య సంపాదకత్వంలో ఏలూరు నుంచి వెలువడ్డ లావర్తమాని, దేశోపకారి పత్రికలు, జన మంచి శేషాద్రిశర్మగారి సంపాదకత్వాన నెల్లూరు నుంచి వెలువడ్డ ఆనందదాయిని (1889) ముఖ్యంగా పేర్కొనదగినవి. సామాజిక సాహిత్య రంగాలలో ఇవి ఎంతో సేవచేశాయి. కొమాండూరు వేంకట రామానుజశర్మ సంపాదకత్వాన నెల్లూరు నుండి వెలువడిన వాగ్వల్లి (1899-1903), మహా మహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి సంపాదకత్వంలో రాజమండ్రి నుంచి వచ్చిన కళావతి (1900) గొప్ప సాహిత్యసేవ చేశాయి.

## కల్పలత - భావకవితా బీజాలు

భావ కవితా బీజాలు, తొలి తెలుగు కథానిక బీజాలు, విజ్ఞానశాస్త్ర విషయాలు ఈ పత్రికను గురించి చెప్పేటప్పుడు గుర్తువస్తాయి. విజ్ఞానశాస్త్ర విషయాల కోసమే వెలువడిన విజ్ఞాన వర్ధనిని గురించి ఇది వరకు చదివారు. సాహిత్యంతో పాటు విజ్ఞాన విషయాలను విరివిగా ప్రచురించిన పత్రిక కల్పలత. దీని సంపాదకులు మహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయన శర్మగారు. దీనిలోని వ్యాసాలన్నిటినీ సంపాదకులే వ్రాసేవారు. వెలువడిన 30 సంచికలు అమూల్య మైనవి. ఆధునిక రూపరేఖలతో కథానికలను, ఆధునిక కవితలను ప్రచురిచిన తొలిపత్రిక ఇదే. చాటువులను ఇది విరివిగా ప్రచురించింది. ప్రాచీన తెలుగు సాహిత్యం నుంచి వైజ్ఞానిక విషయాలను ఏర్చికూర్చేవారు సంపాదకులు. 1903 లో ఇందులో వచ్చిన ఒక కథే తొలి తెలుగు కథానిక అనే అభిప్రాయం కూడా ఒకటి వుంది. ఈ కథపేరు లలిత. రచయిత సాంఖ్యాయనశర్మ. ఆయన ఈ పత్రిక ద్వారా సాహిత్య ప్రతిభా పాటవ పరీక్షలు కూడా నిర్వహించేవారు. వేంకటపార్వతీశ్వర జంటకవులు ఈ పత్రిక ద్వారానే ప్రభవించారు. ఇది 1903 నుంచి 1905 వరకు, 1927 లోను వెలువడింది.

> కవియై యెవ్వడు నవ్యకావ్య రచనా కౌతూహలం బాత్మలో
> చివురింపం దనయూహకల్మి కవితాసీమంతినిన్ నూత్న మా
> ర్గ విహారం బొనరింపనీక కడు నిర్బంధించెడున్ కట్టుబా
> ట్లు విడంజాలక యట్టివాని గతి చాలుంజాలు సంరోధమే.

అని అంటూ శర్మగారు కవితను నూతన మార్గంలో నడిపించారు.

## తొలి తెలుగు దినపత్రిక

తెలుగు జనానా పత్రికలో ఒక సమీక్షా ప్రస్తావనవల్ల తెలుగువారి మొదటిది లేదా రెండవది అయిన దినపత్రిక రాజమండ్రి నుంచి వెలువడిన వైనం తెలుస్తున్నది. దీని సంపాదకులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి మహోదయులు కావడం మరింత విశేషం. 1901 సెప్టెంబరు నెలలో జనానా పత్రిక దీని సమీక్షా వార్తను ఈ విధంగా ప్రచురించింది :-

"ఈ యాగస్టునెల మొదట 'గౌతమి' యనుపేర నొక యాంధ్ర వార్తాపత్రిక యనుదినమును రాజమహేంద్రవరమున బ్రచురమగుచున్నది. ఈ పత్రిక యొక్క 1, 2, 3 వ సంచికలు వందన పూర్వకముగ నందుకొన్నారము. పత్రిక అరఠావు కాకితము పరిమాణముగలది. ప్రతిసారియును నేదోయొక ముఖ్య వ్యాఖ్యానమును కొన్ని చిన్న వ్యాసములును వృత్తాంతములును ముద్రితములగుచున్నవి. అప్పుడప్పుడు చిన్నచిన్న ప్రహసనములు గూడ గలవు. ఇతర గ్రామస్థులీ పత్రికకు 6 మాసములకు రు-4-6-0, 3 మాసములకు రు-2-2-0ను జందా చెల్లింపవలయును.

"ఏదేశముయొక్క నాగరికతనైనను కొంతవరకు అక్కడవి వార్తాపత్రికలను బట్టి గ్రహింపవచ్చును. ఎక్కువ వార్తాపత్రికలు బాగుగా జరుపబడుచుండుటయే దేశము యొక్క శుభస్థితికి కొంత సూచకము. మోటు జనులకు వార్తాపత్రికలును పుస్తకములును యేల? కాని విద్యాధికులకును నాగరకులకు మాత్రము సద్గ్రంథములును వార్తాపత్రికలును గావలయును. వార్తాపత్రికలు దేశమునకు గన్నుల వంటివి. కంటివలననే గదా మనకు లోకము గోచరమగుచున్నది. అట్లే వార్తాపత్రికల మూలముననే ప్రపంచము యొక్క ప్రస్తుత స్థితి మనకు దెలియవచ్చుచున్నది. వార్తాపత్రికలు చదువుచుండని వాడును వినుచుండని వాడును త్రుప్పుపట్టిన మనసుగల వాడేయగునని చెప్పవచ్చును. లోకము యొక్క వర్తమానపు స్థితిని గురించి యట్టివానికి జ్ఞానమేమియు నుండదు.

"ప్రపంచ జ్ఞానము విషయమున దాము వెనుకబడి యుండనొల్లని వారెల్లరును తప్పక వార్తాపత్రికల నామోదింపవలసినదే. అంధ్రదేశమున దిన వార్తాపత్రిక లేని లోపము నిప్పుడీ గౌతమి కొంతవరకు వారింపబూనుకొన్నది. ఇది మంచి సంగతియే. పత్రికాధిపతియగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు అంధ్ర భాషా పాండిత్యము గాంచినవారు. ఇదివరకు వీరు కొన్ని గ్రంథములు చేసి యుండుటయే గాక 'కళావతి' యను మాసపత్రికను గూడ బ్రచురించుచున్నారు.

వారికి ముద్రా యంత్రము గూడ గలదు. 5 నెలల వరకును ఈ పత్రికను సాగించి తరువాత పీలుకొలది నాలోచించెదమని చెప్పియున్నారు. ఇది మంచి నియమమేయని యెన్నుచున్నాము. తామవిచ్ఛిన్నముగా బత్రిక జరపెదమని యాసపెట్టి కొందరివలన సం. చందాలు వసూలు చేసి పిమ్మట తగినంత ప్రోత్సాహము లేక పత్రికను మూలవైచి అనేక విధముల జందాదారుల విశ్వాస మునకును జనుల యాసలకును భంగము కలిగించిన పత్రికాధిపతులను మనము చూచుచున్నాము. ఈ యైదునెలలైనను క్రమముగా నీ గౌతమి పత్రిక సాగు ననియు మిత్రులును జందాదారులును బత్రికాధిపతికి దోడుపడెదరనియును నమ్ముచున్నాము.

"ఆంధ్ర లోకమునకు గౌతమియే మొదటి దినపత్రికకాదు. అట్టి భాగ్యము కృష్ణకే లభించినది కాని అది కృష్ణవెల్లువలవలెనే మూడునాళ్ళ ముచ్చటయై సింధుగతమైనది. ఇదివరకు బెజవాడలో నుండి యీ మధ్య కృష్ణ దాటి వెడలి గుంటూరు జొచ్చిన 'దేశాభిమాని' కొంతకాలము క్రిందట దినదినమును దల చూపుచు వచ్చెను. ఇప్పుడు ప్రచురమగుచున్న ఈ గౌతమి పత్రికయొక్క మొదటి పుటలో పైభాగమున నున్న "క. భూతల వార్తల నీతుల। జాతుల రీతులను దెలియ జాటెదనని యీ। గౌతమియను పత్రిక ప్రఖ్యాతిమెయిన్ వెడలు బత్యహంబు గడంకన్." అను పద్యములోని చివరి చరణమును "ప్రఖ్యాతి మెయిన్ వెడలు బత్యహము గడకంటన్" అని మొదట మేము పొరపాటున జదివి ఎల్లప్పుడు నీ పత్రిక సాగునుగదాయని యొక నిమిషము సంతసించితిమి. మా సంతోషమునకు శాశ్వత జీవితము కలుగుగాక.

"దినపత్రికలో నెప్పుడును 'తంత్రీవార్తలు' గూడ నుండవలయును. ఈ విషయమై పత్రికాధిపతి యేమి ప్రయత్నములు చేయునో తెలియదు. అధమ పక్షము చెన్నపురి పత్రికలలో బ్రచురమగు తంతి వార్తల గొన్నింటినైనను "గౌతమి"కి ఆ దినముననే తంతి మూలమున నెవరైన జెన్నపురి నుండి యిచ్చు చుండిన బాగుగనుండును. వార్తలను గురించి యిటువంటి యేర్పాటు చేయలేనిచో అధమపక్షము పూర్వము ఇంగ్లండులో దినదినమును వెడలుచుండిన స్పెక్టేటర్ వలెనే నీతి మొదలగు నుత్కృష్టవిషయములను గురించి మంచి యుపన్యాసములు వ్రాయబడినను బాగుగనుండును." (పుట 61-63. 1901 సెప్టెంబరు, తెలుగు జనానా.)

## ప్రచురణ సంస్థల అవతరణ

1903 నాటికి పాత ఘట్టం సమాప్తమైందనవచ్చు. అంతవరకు ప్రతి

పత్రికా ప్రాచీన కావ్యాలను ధారావాహికంగా ప్రచురించేది. 1903లో మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు విశాఖపట్టణం నుంచి ప్రాచీన కావ్యాల ప్రచురణ కోసం "కళాభివర్ధినీ కావ్యమాలిక" అనే ప్రాచీన కావ్య ప్రచురణ సంస్థను నెలకొల్పారు. అటు తర్వాత కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు మొదలైనవారు 1906 లో విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి నెలకొల్పారు. ఈ గ్రంథ మండలికి ఆ రోజుల్లోనే 3,800 మంది చందాదార్లు ఉండేవారు. ఈ సంస్థవారు వంద పుటల పుస్తకాన్ని నాలుగణాలకు యిచ్చేవారు. దీనవల్ల పత్రికలు ప్రాచీన గ్రంథాలను నాలుగుపుటలో, ఫారమో ప్రచురించే పద్ధతిని మానుకున్నాయి. వెంటనే ప్రాచీన కావ్యాలు చౌకగా లభిస్తున్నప్పుడు పత్రికల నుంచి నాలుగు పుటలు చింపుకొని భద్రపరచుకొనో, కావ్యమంతా పూర్తయే వరకు నిరీక్షిస్తూనో యెవరుంటారు?

## సాహిత్య విమర్శల తీరు

ఇన్ని పత్రికలు పుట్టినా సాహిత్య విమర్శతీరు హెచ్చుగా పదచర్య వరకే పరిమితమై ఉండేదనవచ్చు. ప్రాచీన సంస్కృతాలంకారకుల దారిని కూడా చాలమంది తొక్కలేదు.

దేశంలో ముద్రణ యంత్రాలు నెలకొనడం, పత్రికలు ప్రారంభం కావడం, తొలుత భారత భాగవత రామాయణాలు, ఆ తర్వాత కావ్యాలు, ప్రబంధాలు అచ్చుకావడం తెలుగుకు కొత్తవెలుగు చేకూర్చాయనే చెప్పాలి. విద్యుత్తు వాడుకలోకి రాకముందు పరిశ్రమల వికాసానికి, విద్యుత్తు వినియోగం తర్వాత పరిశ్రమల అభివృద్ధికీ ఎంత వ్యత్యాసం ఉన్నదో అటువంటిదే దేశీయ భాషాసారస్వతరంగంలో ముద్రణ యంత్రాలకు ముందు వెనకల సంఘంలో భాషాసాహిత్యాలపట్ల ఆసక్తీ వ్యాప్తీ ఉండేవని అనుకోవచ్చు.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రతి పండితులూ కొంతకాలమైనా ఏదో ఒక పత్రిక నిర్వహించారు. ప్రాచీన కావ్యాలను పరిష్కరించి అచ్చువేశారు. వీళ్ళందరికీ బ్రౌను పండితుని కృషి, గ్రంథపరిష్కరణ, ముద్రణ పద్ధతులు చాలా ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. అయితే అప్పటికింకా ప్రధానంగా తెలుగు సాహిత్యం సంస్కృత పండితుల ఆధీనంలోనే ఉన్నది. తాళపత్ర గ్రంథాల పరిష్కరణం కూడా తమ సంస్కృత పాండిత్య ప్రభావానికే లోను చేశారు వారు. తత్సమ బహుళమైన తెలుగు భాషాపద స్వరూప స్వభావాలను సంస్కృత వ్యాకరణ మర్యాదానుసారమే పరిష్కరించటానికి పూనుకొనేవాళ్ళు. తెలుగుభాష స్వరూప స్వభావాలను గూర్చిన వ్యాకరణ సూత్రీకరణ సంస్కృత

వ్యాకరణ పరిభాషానుసారంగానే నిర్వహించేవాళ్ళు. సంస్కృతంలో ఎంత గొప్పపండితులైతే అంతగా తమ ప్రజ్ఞాపాటవం కనపరచి తెలుగు కావ్య పరిష్కరణం చేసేవాళ్ళు. వివక్షులను సాధించేవాళ్ళు. పద పాఠ పరిష్కరణం చేసేవాళ్ళు. పండితులు పరస్పర ప్రశంసాశిరఃకంపనాన్ని ఆశించేవాళ్ళు. స్వపక్ష పరపక్షాలుగా చీలిపోయేవాళ్ళు. ఒక పండితుడు చేసిన పాఠ పరిష్కరణనుకాని, కవి కావ్యప్రశంసాదులు కాని ఇతర పండితులు ఒక పిడిరాయిపై పరీక్షించినట్లు పరిశీలించేవాళ్ళు. మెప్పులు, దెప్పులు, విమర్శలు, ప్రతి విమర్శలు ఆ తర్వాత ప్రారంభమయ్యేవి. పాఠకులలో సాధారణ సాంఘిక వర్గం అంటూ ఉండేది కాదనే చెప్పాలి. ఆ రోజుల్లో పత్రికలపేర్లే ఎంతో ప్రౌఢంగా ఉండేవి. అంటే అవి పండితులను ఉద్దేశించినవే అని తెలిసిపోతూనే ఉందికదా! ఆంధ్రభాషా సంజీవని, అనల్ప జల్పితా కల్పవల్లి, సకల విద్యాభివర్ధని, పురుషార్థ ప్రదాయిని, వివేకవర్ధని, చింతామణి, విద్వన్మనోహారిణి, బుధవిధేయ, వాగ్వల్లి, రసికోల్లాసిని, మందారమంజరి, సరస్వతి, వైజయంతి, అముద్రిత గ్రంథ చింతామణి మొదలైన విధంగా ఉండేవి ఆనాటి పత్రికలపేర్లు.

ఆ పత్రికలలో తరచు సాహిత్య విషయాలే తప్ప సాంఘిక విషయాలకు అట్టే చోటుండేదికాదు. పురుషార్థప్రదాయిని, వివేకవర్ధని, హిందూజన సంస్కారిణి మొదలైన పత్రికలలో సామాజిక విషయాలు కూడా వుండేవి. కాని సాహిత్య పత్రికలు సామాజిక విషయాలను పట్టించుకొనేవికావు. ఇక ఈ సాహిత్య పత్రికలలో ఆనాటి సాహిత్య విమర్శ అంతా పదప్రయోగ ఔచిత్యం, శబ్దసాధుత్వా సాధుత్వ చర్చలు, వ్యాకరణ విధేయత వీటిచుట్టూ మాత్రమే పరిభ్రమిస్తూ ఉండేది. వచనశైలి ఆటోపంగా ఉంటే కాని ఆనాటి పండితులకు నచ్చేదికాదు. వస్తు నిర్వహణ, పాత్రపోషణ, పాత్రల క్రమోన్మీలనం, రసం, మొదలైన వాటిని గురించిన ప్రసక్తికన్నా పదప్రయోగం తప్పని ఒకరి గ్రంథాల గురించి మరొకరు, ఒకరి పాఠ పరిష్కరణం గురించి మరొకరు వివదించుకొనే వాళ్ళు.

1885 వ సంవత్సరం వరకు పండితులు ప్రామాణికంగా స్వీకరించే తెలుగు నిఘంటువు వెలువడలేదు. అంతకు పూర్వమే 30 ఏళ్ళ క్రిందట బ్రౌన్ పండితుని ద్విభాషా నిఘంటువులు వెలువడ్డా అవి కావ్యభాషా సమర్థకమైనవి కావు. వాడుక భాషలో తెలివిడి ఉండటం, వాడుక భాషా పదాలను స్వీకరించడం పండితుల దృష్టిలో ఆ నిఘంటువులను అప్రమాణికమైనవిగా చేశాయి. పద ప్రయోగం విషయంలో ఏదైనా సందేహం వచ్చినప్పుడు, వివాదం వచ్చినప్పుడు భారత ప్రయోగం కావాలని పట్టుబట్టే వాళ్ళు పండితులు. అదీ నిర్ధారక

ప్రయోగమే కావాలనే వాళ్ళు. అంటే యతి ప్రాస స్థానాలలో ఉన్న ప్రయోగమే కావాలని మొండికెత్తేవాళ్ళు. ఒకవేళ భారతంలోదే అట్టి ప్రయోగం ఎలాగో కన బరచినా నన్నయ ప్రయోగం కావాలనే వాళ్ళు. ఈ విధంగా శబ్ద సాధుత్వా సాధుత్వ చర్చచుట్టూ ఆనాటి సాహిత్య విమర్శ ప్రధానంగా కొనసాగేది.

అప్పకవి ఒప్పుకోకపోతే మేము ఒప్పుకోము అని వాదించేవాళ్ళు. ఆ తర్వాత యతిప్రాసల గురించి; ఆ శబ్ద స్వరూపాల గురించి అభినివేశంతో చర్చించుకొనే వాళ్ళు. రల, శస, తద, వబ లకు మైత్రి చెల్లుతుందా చెల్లదా, నిర్ధారకమైన భారత ప్రయోగాలున్నాయా? ఈ విధంగా సాహిత్య విమర్శ సాగించేవాళ్ళు.

'వల్ల' అనే పదం శ్రీనాథుడు ప్రయోగించాడని చూపితే అది అపముద్రణ మనీ పెద్దన ప్రయోగించాడంటే అది ప్రామాణికంకాదనీ, భారతంలో ఉంటే చూపవలసిందనీ - ఈ విధంగా అముద్రితగ్రంథచింతామణిలో చర్చలు కొనసాగాయి.

పరిఖ, పరిఘ శబ్దములు ఏకార్థములనీ, ఏకార్థములు కలవనుట పొసగ దని 1890, 91 వ సంవత్సరాల అముద్రిత గ్రంథ చింతామణిలో పెద్ద చర్చ సాగింది. పూండ్ల రామకృష్ణయ్యగారు, వడ్డాది సుబ్బారాయ కవిగారు, కొండముది నరసింహంగారు, కొండూరు తాతయాచార్యులవారు ఈ చర్చలలో పాల్గొన్నారు.

కొండూరు తాతయాచార్యుల వారు రెండు శబ్దాలు ఏకార్థకాలే అని అభిప్రాయపడ్డారు...."ఖేయపరంబగు పదంబు ఖాంతంబెకాని ఘాంతంబుకాదని యొప్పుకొనియే తీరవలసినంత (నవ క్తవ్యంఖేయాదికమేతస్య ఘాంత పరిఘ శబ్దస్య అని) పాతంజల్యాదిశబ్ద శాసన నిర్వచనం బెచ్చటను నిర్వచించియుండ నందున వర్గ ద్వితీయ వర్ణాంతంబగు పరిఖాశబ్దంబును, కవర్గములోని నాలవ యక్కరంబు నంతంబునంగల బరిఘః అను పుంలింగశబ్దంబును స్త్రీత్వ వ్యవహారిత పరిఘా శబ్దంబును సమానార్థక ఖేయపర్యాయపదంబులే యని మా సమ్మతము. ఇతి సర్వం సమంజసం."

(అముద్రిత గ్రంథ చింతామణి సం. 4; సం. 2, 1891 ఫిబ్రవరి, పుట 8.)

దీనికి సమాధానంగా కొండముది నరసింహంగారు చాలా చర్చ చేశారు: "నిఘంటువులయందు సందేహమొందిన పట్టున వ్యాకరణము ననుసరించి నిశ్చయింపవలసియున్నది.

"శిష్ట ప్రయోగహితమని స్పష్టమైయుండగా అమరుడు - శేషంతు శిష్ట ప్రయోగతః - యన్నాడని చెప్పుట - శశవిషాణాన్వేషణము - గగనారవిందా ఘ్రాతమన్నటులున్నది.

"శ్రీ భారత, భాగవత, రామాయణాద్యనేక కవితాధార భూతాది మహాకవి ప్రణీత పురాణేతిహాస కావ్య నాటకాదులయందు భేయార్థమందు 'క' వర్గద్వితీయ వర్ణముగానే ప్రయోగించియుండిరి. అటుల కాదంటిరేని - ప్రాసస్థానాధిష్ఠితమగు పరిఖకు బదులు పరిఘయనియున్న శబ్దముగల పద్యముల ప్రకటించి యుండరైరి. ఇందువలన నిఘంటువులనుబట్టి, పాణినీయ వ్యాకరణమునుబట్టి, లేఖకదోషమగుటకు సందియములేదు. ఇంక సజీవాధునిక సుకవికృతకోశ ప్రబంధములనున్నట్టులైతే యందుల నైఘంటికుల వైయాకరణుల మతములకు ప్రతిహతముగా భేయార్థమునకు 'క' వర్గ చతుర్థ వర్ణముగా ప్రయోగించరు. అటుల ప్రయోగించిరేని "మహాగజాః పలాయంతే మశకానాంతుకాకథా" అన్నట్లు పూర్వకవులొప్పని తప్పు వీరు చెప్పిన వొప్పగునే! ఇదియునుగాక "వక్తవ్యం భేయాదిక మేతన్న ఘాంత పరిఘశబ్దస్య"యని పాతంజల్యాదిశబ్దానుశాసన వచనం బెచ్చటను ముచ్చటించి యుండలేదు." ఇట్లు పండిత జనవిధేయుడు, కొండముది నరసింహము.

(సంపుటి. 4 సం.) అముద్రిత గ్రంథచింతామణి - (1891 జూలై, పుట. 27).

ఇదే సంచికలో రాకశబ్దం పులింగంగా ప్రయోగించారు గోపీనాథం వెంకయ్యగారు తమ రామాయణ బాలకాండంలో. ఇటువంటి ప్రయోగం సంస్కృతంలోకాని తెలుగులోకాని మాకు కనపడలేదు. తప్పుకదా - అని పత్రికాధిపతి పూండ్ల రామకృష్ణయ్యగారు విమర్శించారు.

రల లకు, శసలకు మైత్రి చెల్లుతుందా చెల్లదా అనే విషయమై అముద్రిత గ్రంథ చింతామణి పత్రికలో చాలా చర్చ జరిగింది. ఆసూరి శ్రీనివాసాచార్యుల వారు "రల లకు, శసలకు మైత్రి ఉన్నదన్న భారత పద్యాలు ఉదాహరించారు. సభాపర్వంలో భీమార్జున నకుల సహదేవులు దిగ్విజయం నిర్వహించిన సందర్భంలో తరల వృత్తంలో తరణిసన్నిభ ధర్మపుత్రునుదార తేజము 'పర్వ" అని ఎత్తుగడ గల పద్యం నాలుగోపాదంలో 'కలధనంబులు దెచ్చియిచ్చిరి గౌరవంబలరారగన్' అని ఉన్నది. ఈ విధంగానే అరణ్యపర్వంలో ఋశ్యశృంగుడి చరిత్రలో :

సురుచిర సురూపగుణసుం।
దరి యూర్వశియను లతాంగి తద్దర్శనగో।
చరయగునప్పుడు రేత।
స్థలసంబుమ్మునికి వయ్యె గామకృతమునన్॥"

అనే ఈ పద్యంలో కూడా నాలుగోపాదంలో ర, ల లకు సాంకర్యం కలిగింది. స్త్రీ పర్వంలో కూడా ర, డ లకు, శ, సలకుమైత్రి చెల్లిన పద్యా లున్నాయి. ఈ ప్రయోగాలు లేఖక ప్రమాదజనితాలని మీరు భావిస్తే సరైన ప్రయోగాలేమిటో, తెలవిస్తారా? - అని ఈ లేఖకుడు ప్రశ్నించాడు. (అముద్రిత గ్రంథ చింతామణి - ఫిబ్రవరి 1894, పుట 8.) దీనికి ఆతర్వాత నెల పత్రికలో అప్పికట్ల నుంచి కొండముది నరసింహంగారు సమాధానం వ్రాశారు ఇలా:- (పుటలు 14, 15, 16.)

"1894 సంవత్సరము ఫిబ్రవరి సంచిక యందు శ్రీమాన్ శ్రీనివాసా చార్యులవారు రల లకు, శసలకు మైత్రిగల ప్రయోగములు భారతమున నగుపడుచున్నవనియు నీ ప్రయోగములు లేఖక ప్రమాద జనితములని మీరాద రించని యెడల వీనికి సరియైనవి యేవియో తెలుపుడని మీ పేర వ్రాసినందుకు నేను జవాబును వారికిచ్చుచున్నాను. ఎట్లన :- సభాపర్వ ప్రథమాశ్వాసమున నున్న "కలధనంబులు దెచ్చియిచ్చిరి గౌరవంబలరారగన్" అని యుండుటకు బదులుగ "కరధనంబులు" అనియు అరణ్య పర్వ తృతీయాశ్వాసముననున్న" స్థలనంబమ్మునికి నయ్యె గామకృతమునన్" అనియుండుటకు బదులుగ "స్కరణంబమ్మునికి నయ్యె" ననియు; (క్ష్వావిక్షేపణే - ఇత్యస్మాద్ధాతోః భావే ల్యుటి రూపం) రేతస్థలనంబున నే యర్థమో రేతస్కరణమున నంతే యర్థము" అన్నారు వారు. అట్లాగే స్త్రీ పర్వంలో "బోరగిలబడ్డవాడు కపాల మొకటి" అనే పాదాన్ని కపోలమని దిద్దుకోవాలని కొండముది నరసింహంగారు సూచించారు.

ఈ విధంగా వ్యాకరణాన్ని బట్టి, తమకు తెలిసిన లక్షణ గ్రంథాలను బట్టి తాళపత్రాల, అచ్చు ప్రతుల ప్రయోగాలు దిద్దుతామని వాదించేవారు ఆనాటి పండితులు.

ఇదే సంచికలో పత్రికా సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రాచీన కావ్యాలలోని అపురూప ప్రయోగాలను చూపి వీటికి సమర్థనం ఏమిటి? అని ప్రశ్నించారు.

చిచ్చుఱ, చిచ్చఱ, (విరాటపర్వం), పరిమాల్చు (శల్యపర్వం) ఇలుగు (చచ్చు అని అర్థం), ఆ తల (అవ్వల అని అర్థం)ల, మిఫులు, తలా, నమలి

(నెమలి), చెఱియొక, చాలా, దృతాంత శబ్దముపై గచటతపలు నిలుచుట, లడ లకు ప్రాస సాంకర్యం" ప్రస్తావిస్తూ వుండ్ల రామకృష్ణయ్యగారిట్లా వ్రాశారు: "ఈ ప్రయోగము లసాధువులైనచో వీని సవరింప బండితులు ప్రార్థితులు." - (పత్రికాధిపతి).

ఈవిధంగా సారస్వత పత్రికలు బయలుదేరిన మొదటి మూడు నాలుగు దశాబ్దాలు శబ్దచర్చలే సారస్వత విమర్శలో అధికంగా చోటుచేసుకొన్నాయి. పండితులు, పండితులు ఢీకొని నిర్విరామంగా పోరాడారు. గ్రంథస్థ పీఠికలలో ఒకరి నొకరు చెనకి కొన్నారు. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి ప్రసన్న రాఘవ నాటకాన్ని వేదం వెంకట్రాయశాస్త్రిగారిట్లా విమర్శించారు:-

"ఛందో వ్యాకరణాలంకారముల కిది వేరు పురుగు. గ్రచ్చగాయ పాకము, మేడిపండు పాకము, మునిడిపండు పాకము, దృష్టిపిడత పాకము, బీరపీచు పాకము టెంకాయ బొచ్చిక పాకము, ఆ పెంకు పాకము, ఉడుకుతారు పాకము, ఇత్యాదులు కలవు. తప్పు ప్రాసలు, తప్పు యతులు, తప్పు గణములు తప్పు సంధులు........ వీరికి సంస్కృతము తెలియదు........ దేవనాగరిలిపి తెలియదు. నాటక లక్షణము తెలియదు............ ఆంధ్రభాషకు విషము పెట్టినారు."

కొక్కొండ వెంకటరత్నం పంతులుగారివంటి గొప్ప పండితుణ్ణే ఈవిధంగా వెంకట్రాయ శాస్త్రిగారు తప్పులుపట్టారంటే ఇక ఆరోజుల్లో గ్రాంథికభాషలో పండితులెవరైనా ఉండేవారా? - అని సందేహించవచ్చు. స్పర్థైక మూలంగా పండితులు ఈవిధంగా ఒకరి తప్పులు ఒకరు బయటపెట్టుకునే వాళ్ళు. ఎవరి వ్యాకరణం వాళ్ళది, ఎవరి లక్షణం వాళ్ళదిగా మోహరించేవాళ్ళు.

1870 నుంచి 1920 వరకు ఇంచుమించు ఇదే ధోరణిలో సాహిత్య విమర్శ సాగింది. అప్పటికింకా సాహిత్యం పూర్తిగా పండితాధీనంగానే ఉండేది. గ్రాంథిక వ్యవహారిక భాషాశైలీ వివాదం ఒక కొలిక్కి వచ్చిన తర్వాత 1919వ సంవత్సరంలో ఫిబ్రవరిలో వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం ఏర్పడిన తర్వాత, ఆధునిక కవిత్వం, కథా సాహిత్యం, నవలలు విరివిగా వెలువడ్డం మొదలైన తర్వాత గ్రాంథిక వ్యవహారిక వాదతీవ్రత కొంతవరకు సడలింది.

ఆనాటి పండితులలో ఈ స్పర్ధకు విద్యా సంస్థలలో వారి వారి స్థానాలు, శిష్యసంఘం అభిమానాలు, సారస్వత సంఘాల స్పర్ధలు కూడా దోహదంచేసి ఉండవచ్చు. ఆనాడు మద్రాసులో ప్రెసిడెన్సీ కాలేజీలో, క్రిస్టియన్ కాలేజీలో

విద్యార్థి సంఘాలుండేవి; ఆచార్య స్థానాలుండేవి. ఈ కళాశాలల ఉపాధ్యాయ వర్గాలలో ప్రత్యేక కూటములుండేవి. రాజధాని కళాశాల ప్రధానాంధ్ర పండితులు కొక్కొండవారు. క్రిస్టియన్ కళాశాల ప్రధాన పండితులు వేదంవారు. వీరి చుట్టూ చేరి పండితులు, తరుణ విద్యార్థులు సాహిత్య వివాదాలు సాగించేవాళ్ళు.[1]

తెలుగు సాహిత్య పత్రికలు, వార్తలతోపాటు సాహిత్యాన్ని అందించిన రాజకీయాది పత్రికలు చేసిన కృషిని ఈ విధంగా క్రోడీకరించవచ్చు:

1. ప్రాచీన కావ్య ప్రబంధాల ప్రచురణం
2. భాషా సాహిత్య విమర్శనం
3. సాహిత్య వాద వివాదాలు
4. నవలలు వ్యాసాలు కథల ప్రచురణం
5. పుస్తక పరిచయాలు, సమీక్షలు
6. సారస్వత విషయాలపై పండితుల ఉత్తర ప్రత్యుత్తరాలు
7. ఆంగ్ల సంస్కృతాల నుంచి అనువాదాలు
8. అంకాలు అంకాలుగా నాటకాల ప్రచురణం
9. ఉపన్యాసాల గోష్ఠుల సారాంశాలు, సభల చర్చా విశేషాల ప్రచురణం

19 వ శతాబ్ది సమాప్తితో తెలుగు పత్రికలలో గొప్ప మలుపు వచ్చింది. దానికి కారణం ప్రజలలో నూతన చైతన్యం కలగడం. అఖిల భారత కాంగ్రెస్ వల్ల, ఇతర సంస్థలవల్ల దేశ ప్రజల భావాలలో మార్పు వచ్చింది. ఒకవైపు జాతీయోద్యమ ప్రభావంతో మాతృదేశ భాషా సారస్వతాలపై అభిమానం పెరగడంతో పాటు పాశ్చాత్యుల ఆధునిక పద్ధతులతో మన భాషాసాహిత్యాలను సంపన్నం చేసుకొందామనే ఆవేగమూ కలిగింది. కనుక అప్పటి నుంచి పత్రికలలో మార్పు వచ్చింది. దానికి సాంఖ్యాయనశర్మగారి కల్పలత నాంది పలికింది.

## ఇరవయ్యో శతాబ్దితో నవశకం

ఇరవైయో శతాబ్ది ప్రారంభానికి పత్రికల రూప రేఖలు మారాయి. సచిత్ర సాహిత్య పత్రికలు వెలువడ్డాయి. ఒక చిత్రం పది వార్తల పెట్టు - అని పత్రికా పరిభాష. చిత్రంతోపాటు వార్తనో, వ్యాసాన్నో ప్రచురించడం

---

1. డాక్టరు అక్కిరాజు రమాపతి రావుగారి "గిడుగు రామమూర్తి జీవితం - ఉద్యమం" నుంచి.

పాఠకులను విశేషంగా ఆకర్షిస్తుంది. కనుక చిత్రంగాని, ఛాయా చిత్రంగాని ప్రచురించడం అత్యవసరమనే భావన పత్రికాధిపతులకు కలగడం సహజమే.

చిత్రాలతోపాటు పుటల సంఖ్య కూడ పెరిగింది. అంతకుముందు పత్రికలు 36 పుటలకు మించి ఉండేవి కావు సాధారణంగా. 1901 నాటికి పుటల సంఖ్య పెరగడమూ ప్రారంభమయింది. భాష కూడ సరళం కావడం గమనించదగిన విషయం. ముఖ్యంగా ఆబాలగోపాలమూ విజ్ఞానవంతం కావాలనే దృష్టి ఏర్పడడంతో పత్రికల భాషనుండి తైకవేద్యం కాక "బాల స్త్రీ పామర" వేద్యం గాను మారింది. దీనికి హిందూ సుందరి వంటి పత్రికలను ఉదాహరణంగా పేర్కొనవచ్చు.

## హిందూ సుందరి

మహిళల నిర్వహణలో 'మహిళల సంపాదకత్వంలో' మహిళల సమస్యల కోసం వెలువడిన తొలి మహిళల మాసపత్రిక హిందూసుందరి. దీని తొలి సంచిక కాకినాడ నుంచి 1902 జూన్‌లో శ్రీమతులు మాడభూషి చూడమ్మ, కళ్ళేపల్లి వేంకటరమణమ్మల సంపాదకత్వాన వెలువడింది. ఇది దాదాపు 15 సంవత్సరాలకు పైగా కొనసాగింది. రచయిత్రులు అందరూ మహిళలే కావడం దీని విశిష్టత.

తొలిపుట సంపాదకీయంతో, దానిపైన పద్యంతో ప్రారంభమయ్యేది. ఆపద్య మిది:

శా. శ్రీ సంభావిత వాక్య సంపదలచే
చెన్నొందు సాధ్వీమనో
ల్లాసం బేర్పడ జేయుచున్ విమలశీ
లంబొప్పగా వైదుషీ
వ్యాసంగంబుల వైరవృత్తు లెడపున్
భాషాఢ్యయై కాన, సం
తోషం బొంది కొనుండు సుందరులు హిం
దూ సుందరీ రత్నమున్.

"ఇది ప్రత్యేకముగా హిందూ స్త్రీల కొఱకు ప్రతి మాసము ప్రచురింపబడును."

స్త్రీలే ఈ పత్రికకు వివిధ విషయాలపై వ్రాసేవారు. రచయిత్రులు దాదాపు వందమంది ఉండేవారు. వారిలో కొంతమంది పేర్లివి :- శ్రీమతులు

కందనపల్లి కనకమ్మ, గూడపాటి లక్ష్మీనరసమ్మ, బుర్రా బుచ్చి బంగారమ్మ, కొటికలపూడి సీతమ్మ, వింజమూరి వెంకటరత్నమ్మ, అమర్తి భాస్కరమ్మ, దామెర్ల సీతమ్మ, మోటుపల్లె రాజాబాయమ్మ, మల్లాది లక్ష్మీదేవమ్మ, నడుపల్లె బుచ్చివెంకట సుబ్బమ్మ, జూలూరి తులశెమ్మ, మామిడన్న కామేశ్వరమ్మ, పిళ్ళారిశెట్టి లక్ష్మీకాంతమ్మ, బులుసు సూరమ్మ, ఇప్పగుంట వెంకమాంబ, చోడిగుడి సీతమ్మ, యర్రగుంట జనార్దనమ్మ మొదలయినవారు.

పదకొండవ సంపుటం రెండవ సంచిక (1913 జులై) సంపాదకురాలి విన్నపము ఇలా ఉంది: "ఈ సంచికయందు శ్రీమతి కాశీనాథుని రామాబాయమ్మగారి చిత్రపటమును వేసియున్నారము. గత మాసము నందు బంపియున్న కె. కనకమ్మగారి పటపు చరిత్రము నీ సంచిక యందు వేరొకచో చూడగలరు. రామాబాయమ్మగారి చరిత్రము పూర్తిగా లభింపమికి మిక్కిలి చింతించుచున్నారము.

"ఈమె గడచిన నాలుగు సంవత్సరములనుండి నిరాఘాటముగా వెలువడుచున్న ఆంధ్ర పత్రికా రాజముయొక్క యధిపతులగు శ్రీయుత నాగేశ్వరరావు పంతులుగారియొక్క సహధర్మచారిణి. మిక్కిలి చక్కగ బండిన వరి, తలల భారముచే గట్లపైకి వంగినమాడ్కి యీ విదుషీమణి విద్వచ్ఛక్తి, సౌశీల్యము మున్నగువానిచే గనబఱచు శాంతస్వభావము, నమ్రభావము ప్రశంసార్హమయినవి.

"ఈమె గడచిన మార్చి నెల 21వ తేదీని బందరులో జరుపబడిన ఆంధ్ర మహిళా మహాసభ కగ్రాసనాధిపత్యము వహించి యిచ్చిన గంభీరోపన్యాసము మా చదువరులకు పంపించియే యున్నారము. ఇట్టి స్త్రీరత్నము లింకను బయలు వెడలినగాని భారతవర్ష మభివృద్ధిం గాంచనేరదు. స్త్రీ విద్యాభిమానము గల సోదరీమణులందఱు నిట్టి స్త్రీ రత్నముల ఛాయాపటములు దయచేసి, మాకు ప్రోత్సాహ మివ్వగలందులకు ప్రార్థించుచున్నారము.

"శ్రీ విద్యార్థినీ సమాజము శ్రీమతి బండారు అచ్చమాంబగారి స్థాపన మగుటచేతను ఆమె స్థాపించిన మొలక యభివృద్ధి సూచకమయి పత్రికా నిర్వహణ మొనరించు శక్తిగలదగుటచేతను హిందూసుందరి యామెకు ప్రియపత్రికారత్న మగుటచేతను యింతటినుండి నెలనెల శ్రీ సుందరి అచ్చమాంబగారిని ముందిడుకొని గృహేగృహే నీతులు బోధింప వెలువడు చుండును. ఈ సంచిక యందలి రామాబాయమ్మగారి యొక్కయు, కె. కనకమ్మ

గారి యొక్కయు చిత్రపటముల దిమ్మ(బ్లాకు)లను దయచేసిన ఆంధ్రపత్రికాధిపతు లెంతయు వందనీయులు."

ఈ సంచికలోనే బందరులో జరిగిన ఆంధ్ర మహిళా మహాసభలో శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారి "సంఘలాభములు" అనే ప్రసంగం, శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి "బాలికా వివాహములు" ప్రసంగంలో కొంతభాగం, శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారి "సత్కార్యోత్సాహము" అనే ప్రసంగం ప్రచురితమయ్యాయి.

స్త్రీల సమస్యలపట్ల స్త్రీలే ఆసక్తితో, శ్రద్ధతో, వివేచనతో దీనిలో వ్రాసిన వ్యాసాలు పెక్కు నేటికీ ప్రయోజనకరంగా కనిపిస్తాయి. ఈ సంచిక లోనే శ్రీమతి జి. రామలక్షమ్మగారు వ్రాసిన "శ్రీ భజగోవింద శ్లోకార్థవచనము" అప్పటి మహిళల పాండిత్యానికి తార్కాణం.

ఈ పత్రిక విదేశాలలో జరిగిన స్త్రీలకు సంబంధించిన సంఘటనలను ప్రచురించేది. 1913 ఆగస్టు సంచికలో వార్తావళి శీర్షికలో ప్రచురించిన ఒక వార్త ఆసక్తిదాయకమైంది.

**భర్త భార్యను మోసగించుట :-**

ఒక ఫ్రెంచి జమీందారిణిని ఒకడు పెండ్లియాడెను. వాడింకొకధనవంతురాలిని పెండ్లియాడగోరి భార్యతో నన్యోన్యముగ మెలంగుచు మంచి మాటలచే నామెవలన సంతకము చేయించి కొన్ని తెల్లకాగితములను బుచ్చుకొని వాని మీద తన కనుకూలముగ నాతడామె వ్రాసినట్లు కొన్ని యుత్తరములు వ్రాసి ఆమె వ్యభిచారిణియని దావావేసి వివాహము రద్దుపరచుట కుత్తరువులు బడసి అందుల కామెగూడ యంగీకరించునట్లు తానే వ్రాసెను. కాని ఆమె కేమియును తెలియదు. ఆ కుటుంబమునకు పరిచితుడగు నొక వైద్యుడొకనాడు నీ భర్త నిన్ను పర్యిజించిన పిమ్మట నీ వెచటనున్నావని యడుగ నామె తానేమియు నెరుగనని చెప్పెను. పిమ్మట నామె యతనివలన మోసమంతయు తెలుసుకొని పోలీసువారి కెరింగించెనట. ఆమె ప్రవర్తనమున నేమియు లోటులేదని యందరెరుఁగుదురట. మోసగాడగు నామె భర్త యామెను వదలి తాను కోరిన ధనవంతురాలిని పెండ్లియాడెనట. పోలీసువారరయవలసి యున్నది.

ఆచంట లక్ష్మీపతిగారు అలోపతి వైద్య నిపుణులయినా, వైద్యరత్న పండిత దీవి గోపాలాచార్యుల ప్రభావంవల్ల ఆయుర్వేదంలోను ఉద్దండులయ్యారు. ఆయన ఆయుర్వేద ప్రచార ప్రసంగాలలో "అభ్యంగమాచరేన్నిత్యం స జరాశ్రమవాతహా" (ప్రతిదినమూ అభ్యంగం చేసుకోవాలి, అది

ముదిమిని, అలసటను, వాతాన్ని పోగొడుతుంది) అని అభ్యంగప్రాశస్త్యాన్ని ఉద్ఘోషించేవారు. ఆయన వివాహం ఆనాడొక సంచలనాత్మకమైన ఉదంతం. దానిని హిందూసుందరి రచయిత్రులలో ఒకరైన శ్రీమతి గూడపాటి లక్ష్మి నరసమ్మగారు "స్వయంవరము" అనే పేరుతో చిన్న నాటకంగా రచించారు. దాని వ్యాపార ప్రకటన హిందూ సుందరి చివరి అట్టపై చాలకాలం వెలువడింది. దానిని ఇక్కడ ఉదాహరిస్తున్నాను:-

**స్వయంవరము**

ఇయ్యది శ్రీయుత ఆచంట లక్ష్మీపతి బి.ఎ., ఎం.బి.సి.ఎమ్. గారి యొక్కయు, శ్రీమతి రుక్మిణమ్మగారి యొక్కయు స్వయంవరమును దెల్పునొక చిన్న నాటకము. కథానాయిక జనకుండగు శ్రీనివాసరావుగారి సంస్కరణాభిలాషయు, కథానాయకుని పట్టుదలయు, ఆమె విద్యాసక్తియు, పవిత్ర చరిత్రమును, జక్కగ వర్ణింపబడినవి. ఇది విద్యావతియగు శ్రీమతి గూడపాటి లక్ష్మి నరసమ్మగారిచే రచియింపబడినది.

హిందూసుందరి చందాదారులకు వెల రు. 0-4-0.

తదితరులకు 0-6-0.

పోస్టేజి ప్యాకింగు ఖర్చులు కొనువారే భరించవలెను.

వలయువారు "హిందూ సుందరి" ఆఫీసు, కాకినాడ యని వ్రాసిన బడయగలరు.

ఈ ఉదాహరణలను బట్టి ఈ పత్రిక స్త్రీల సమస్యల విషయంలో ఎంత శ్రద్ధ చూపేదో స్పష్టమవుతుంది.

## పండితులలో చైతన్యం

దేశ రాజకీయ చైతన్యం పట్ల ప్రాచీన విద్వాంసులకూ ఆసక్తి కలిగింది. తత్ఫలితంగానే శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి మహావిద్వాంసులు 1907 నాటికే వందేమాతరం అనే వారపత్రికను స్థాపించడం సంభవించింది. ఇది ఒక సంవత్సరం వచ్చి ఆగిపోయింది. శాస్త్రిగారు రకరకాల పత్రికలు నడిపారు. గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యవహారిక భాషా ప్రచారం కోసం తెలుగు పత్రిక నడపగా, అందుకు ప్రతిగా శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు వజ్రాయుధం నడిపారు. శాస్త్రిగారు అశ్వమేధం వరకు యజ్ఞయాగాదులు చేయించగల మహాశ్రౌతులు. ఒకమారు వారితో పాటు ఢిల్లీ నుంచి మద్రాసుకు ప్రయాణంచేసే అవకాశం కలిగింది. నేను ఆంధ్రప్రభలో పనిచేసేవాడిని అప్పట్లో. ప్రసంగ వశాత్తు వ్యవహార భాష గురించి చర్చ వచ్చింది. ఆయన

మహావిద్వాంసులు. నేను ఊరికే ఆయన చెబుతున్నది వింటున్నాను. వార్తా పత్రికలు ప్రజలకు వివిధ విషయాలు తెలుపడం అవసరం గనుక, పత్రికలలో భాష కన్నా విషయానికే ప్రాధాన్యం గనుక వ్యవహార భాషను వాడడమే ఉచితమని ఆయన అన్నారు. "మరి మీ వజ్రాయుధమో!" అన్నాను. దానికి ఆయన నవ్వి "అది పండిత విషయం. ఉదాత్తమైన కావ్య రచనకు గ్రాంధిక భాషే వుండాలి. నిత్య వ్యవహారానికి, సామాన్య విషయ పరిజ్ఞానానికి వ్యవహార భాష" - అని వివరించారు. ఈ అభిప్రాయమే తెలుపుతూ శాస్త్రిగారు తమకు వ్రాసిన జాబును నార్లగారు నాకు 1975లో చూపారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి సంపాదకత్వాన రాజమండ్రి నుండి మనోరమ (1906-1910), దేశమాత వారపత్రిక (1910-1913) వెలువడ్డాయి. ఈ పత్రికలు, ఆంధ్రభారతి, ఆంధ్రసర్వస్వం, ఏలూరిపాటి రామచంద్ర చయనుల సారస్వత సర్వస్వం, ముక్త్యాల సరస్వతి, అక్కిరాజు ఉమాకాంతం గారి తెలుగు వాఙ్మయపత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక మొదలయినవి శారదభారతి వంటి సమగ్ర పత్రికల ఆవిర్భావానికి ప్రోది చేశాయి.

## సంపాదకుడు లేని ఆంధ్ర భారతి

నూతన సారస్వత ముల్యాలతో. అన్ని వర్గాలకు చెందిన, అన్ని వాదాలకు చెందిన రచయితల రచనలతో వెలువడిన తొలి సాహిత్యపత్రిక ఆంధ్రభారతి. ఇది మచిలీపట్నం, ముట్నూరు, బెజవాడల నుంచి 1910 జూన్ నుంచి 1915 వరకు వెలువడింది. దీనికి పోషకులు, రచయితలేగాని, సంపాదకులు లేరు. పోషకులు శ్రీయుతులు రాజా యార్లగడ్డ మల్లికార్జున ప్రసాదనాయుడు బహద్దర్ (చల్లపల్లి), కుమారరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ బహద్దరు (చల్లపల్లి), శ్రీ రాజా బలుసు బుచ్చిసర్వారాయుడు బహద్దరు (కపిలేశ్వరపురం, గోదావరి), శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహద్దర్ (మునగాల), శ్రీ మోతే గంగరాజుగారు (జమీందార్ విస్సన్నపేట), ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణి పండిత డి.గోపాలాచార్యులవారు (మదరాసు), హనుమార రామస్వామిగారు (పెయ్యేరు), శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్ (పిఠాపురం), శ్రీ కుమారరాజా కోటగిరి వేంకట కృష్ణా రావు బహద్దర్ (గంపలగూడెం), హర్‌హైనెస్ మహారాణీ సాహెబా (విజయ నగరం), కాలారి మురహరిరావుగారు (రాయపూడి), కొవ్వూరి చంద్రారెడ్డిగారు (జమిందారు, నిడదవోలు).

లేఖకులు పలువురు ప్రముఖులు. వారి పేర్లను ఈ పత్రిక ప్రతి సంచిక ప్రారంభంలో ప్రచురించేది. వారిలో కొందరు వీరు:-

జయంతి రామయ్యగారు బి.ఏ.బి.ఎల్.
గురజాడ అప్పారావుగారు బి.ఏ.
చెన్నాప్రగడ భానుమూర్తిగారు బి.ఏ.ఎల్.టి.
బోడపాటి రాజన్నగారు బి.ఏ.
గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఎమ్.ఏ.
కొమర్రాజు లక్ష్మణరావుగారు ఎమ్.ఏ.
వేమూరి విశ్వనాథశర్మగారు ఎమ్.ఏ.
ఆచంట లక్ష్మీపతిగారు బి.ఏ., ఎమ్.బి.సి.ఎమ్.
భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు బి.ఏ., ఎమ్.బి.సి.ఎమ్.
ఏ. ఎల్. నరసింహాచార్యులుగారు ఎమ్.ఏ.
విద్వాన్ శిష్టా నరసింహశాస్త్రిగారు
శతావధానులు వేంకట రామకృష్ణకవులు
శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులు
వల్లూరి సూర్యనారాయణరావుగారు బి.ఏ.,బి.ఎల్.,ఎల్.టి.
వేమవరపు రామదాసుగారు బి.ఏ.బి.ఎల్.
కోపల్లె హనుమంతరావుగారు ఎమ్.ఏ.,బి.ఎల్.
ఉలిగుండం రంగారావుగారు బి.ఏ.
చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు
మంగిపూడి వేంకటశర్మగారు
రాయప్రోలు సుబ్బారావుగారు
పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు
కె. వి. ఆర్. స్వామిగారు బారిస్టరు
దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు బి.ఏ.
ఎమ్. గున్నయ్యశాస్త్రిగారు బి.ఏ.
చిట్టా సుందరరామయ్యగారు బి.ఏ.,బి.ఎల్.
వేముగంటి రామకృష్ణారావుగారు
మాడపాటి హనుమంతరావుగారు

ఈ ఆంధ్ర భారతిలో శ్రీ గురుజాడ అప్పారావుగారి దిద్దుబాటు మొదలైన కథలే గాక కన్యక కవిత కూడ వెలువడింది (1912 అక్టోబర్). గురుజాడ

వారికి ఈ పత్రిక కవిశేఖర బిరుదం కూడ తగిలించింది. అప్పటి ప్రచురణకు మచ్చుగా కన్యక నుంచి కొన్ని ముత్యాలసరాలు కొన్నిటిని ఉదాహరిస్తున్నాను:-

1. తగటు బంగరు చీరెకట్టి
కురుల పువ్వుల సరులుజుట్టి
నుదుట కుంకుమ బొట్టుపెట్టి
సొంపు పెంపారన్.

తొగల కాంతులు కనులు పరవగ
మించు తళుకులు నగలు నెరవగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీథిని.

2. పసిడి కడవలు పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్లు పువ్వులు
మోము లందున మొలక నవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంట నడిచిరి.

3. అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్నుచెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్.

4. "ఔర! చుక్కల నడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నెముందర
వన్నె కాంచిన నగరి సుందరు
లందరొక లెక్క.

5. "పట్టవలెగా దీని బలిమిని
కొట్టవలెరా మరునిరాజ్యం...."

రాయప్రోలు సుబ్బారావుగారి కోయిల, కనకము మున్నగు కవితలూ దీనిలో ప్రచురితమయ్యాయి. పైన పేర్కొన్న లేఖకులే కాక ఇతరులు కూడ గొప్ప వ్యాసాలు వివిధ ప్రక్రియలపై వ్రాశారు. ఉదాహరణకు, ప్రిన్సిపాలు కె. రామానుజాచార్యుల ఆంధ్ర భాషా సంస్కరణము, వల్లూరు సూర్య నారాయణరావుగారి రాజ్య పాలనము, గిడుగు రామమూర్తి పంతులుగారి

గ్రామ్య పద ప్రయోగము, కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారి శృంగారము - పూర్వలాక్షణికులు, కవుకొండల సాంబశివరావుగారి శ్రీ కేశవచంద్ర సేన బ్రహ్మానందులవారు, తిరుపతి వేంకటకవుల శృంగార వర్ణనము, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి ఆశుకవిత్వము - అవధానములు, బుర్రా శేషగిరిరావుగారి పాశ్చాత్య మార్గములు- గ్రంథవిమర్శనము, కాశీకృష్ణాచార్యులుగారి ఆంధ్రభాషా సంస్కరణము, మామిడిపూడి వెంకట రంగయ్యగారి ఆంధ్రభాషాభివృద్ధి, అక్కిరాజు ఉమాకాంతంగారి దేశభాషా వ్యవహారము, పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగార్ల ఆర్యవట శాసనము, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారి ఆయుర్వేద గ్రంథములు, వేలూరి శివరామశాస్త్రిగారి జీర్ణతరువు మున్నగు కవితలు, కాళ్ళకూరి సాంబశివరావుగారి గ్రామ్యభాష, చిల్లరిగె వేంకట లక్ష్మీ నరసింహంగారి శ్రీమద్భాగవత సందేశము, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పాణిగ్రహీతా శ్రవణానంద శృంఖలము (విమర్శ), దానికి సమాధానంగా తిరుపతి వేంకటకవుల శృంఖలా తృణీకరణము (ప్రతి విమర్శ), అయ్యంకి వేంకట రమణయ్యగారి సేతురామేశ్వరము. మంగిపూడి వెంకట శర్మగారి ఆంధ్రభాష మొదలయిన కవితలు ఇంకా ఎన్నో గొప్ప వ్యాసాలు వెలువడ్డాయి. మాడపాటి హనుమంతరావుగారు దీనిలో మహాభారతంపై వ్యాసం వ్రాశారు. ఈ కాలంలోనే వెలువడిన పత్రికలలో పేర్కొన దగింది ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.

## ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (1912)

ఈ ద్విమాస పత్రికకు ప్రధాన పోషకులు పిఠాపురం రాజా రావు సూర్యరావు బహద్దర్ గారు. ఇది చేసిన సేవ అపారం. ఈ పత్రికకు కొత్తపల్లి సూర్యరావు గారు స్థాపన నుంచి 1940 వరకు నిర్వాహకులుగా పనిచేశారు. దీనిలో పరిషత్తు వార్షికోత్సవంలో చదివిన పరిశోధన వ్యాసాలు, అధ్యక్షోప న్యాసాలు మొదలైనవి ప్రచురించేవారు. పెక్కు చారిత్రక వ్యాసాలు, భాషా విషయాలు, శాసనాలు దీనిలో ప్రచురితమయాయి.

## అభినవ సరస్వతి

ఈ కాలం నాటిదే పేర్కొనవలసిన మరొక మంచి పత్రిక అభినవ సరస్వతి. ఇది జానపాటి పట్టాభిరామశాస్త్రి సంపాదకత్వాన 1908 నుండి 1946 వరకు వచ్చినట్లు కనపడుతుంది. చెళ్ళపిళ్ళవారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలైన విశ్రుతులుకూడా ఈ పత్రికకు వ్యాసాలు వ్రాసేవారు. అభినవ

సరస్వతిలో సీతాఫలం గురించి జ్ఞానాంబ అనే రచయిత్రి వ్రాసిన రచన చాలా ఆకర్షణీయంగా ఉంది. చూడండి :

"తీయని గుజ్జుతో నింపి దుమ్ము పడకుండ మురికి తగలకుండ ప్రకృతి మాత పంపిన వరమాన్నమే యీ ఫలరసము. దీనిని చవి చూచుటకు నాగరకులు సంశయించుచున్నారు. విషయుతములగు మందులను మ్రింగుటకు వెనుదీయని వారీ యమృత సేవనమున కడలు సెందనేల? పనికిమాలిన వస్తువులతో బాకము చేయబడి కశ్మలములై మురికి చేతులతో ముట్టబడుచు నన్నివిధములను ననారోగ్యకారులై యుండు పకోడీ పెసరట్టు ఇడ్డెన లడ్డు కాఫీ నామక వ్యర్థ పదార్థముల నింటచేయబడు వంటకముల నిస్సంశయముగ నిరాఘాటముగ దినుచుండు వారీ ప్రకృతి సిద్ధ నిర్మల నిరపాయకర ఫలము నానుట కింత భయమొందనేల? దీనింగూర్చి తిన్నగ తెలియకపోవుటయు మితి తప్పి తినుటచే కొన్ని దుర్లక్షణములు పొడజూపుటయు శరీరము రోగగ్రస్తమై యుండ నీ ఫల మా రోగపదార్థమును వెలువరింప యత్నించుటయు నిందులకు కారణములు.... సీతాఫలము నందలి సుగుణములను గొన్నిటి వస్తుగుణ దీపిక యిట్లు వర్ణించుచున్నది.

'రక్తమును నింద్రియమును వృద్ధి చేయును. గుండెకు మనసుకు బలమునిచ్చును. జీర్ణశక్తి నిచ్చును. క్రిమిని హరించును.'

కావున బ్రకృతి వర ప్రదానమగు నీ స్వాదు ఫలము నందరును స్వేచ్ఛమై ననుభవింపనగును. సక్రమముగ నుపయోగించినచో నిది యారోగ్య సంవర్ధకమును సంతుష్టి ప్రదమును కాగలదు." (సం. 37- సం. 11, 12-1942.)

## త్రిలింగ

త్రిలింగ పత్రికను వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు వావిళ్ళ సంస్థ పక్షాన 1916 లో స్థాపించి 40 సంవత్సరాలపాటు నిరాఘాటంగా నిర్వహించారు. ఇది మొదట్లో మాసపత్రికగా వెలువడి తర్వాత పక్షపత్రిక అయి రెండు మూడేళ్ళ పిదప వారపత్రిక అయింది. ఇది పూర్తిగా సాహిత్య వారపత్రికే. త్రిలింగ విషయం చెప్పడానికి ముందు వావిళ్ళ సంస్థను గురించి చెప్పాలి.

గత శతాబ్దిలో సగం భాగం జరిగే వరకు మనదేశంలో గ్రంథ పఠనం గడ్డు సమస్యగా ఉండేది. పాఠకులు వ్రాతప్రతులపైనే ఆధారపడవలసి వచ్చేది. వ్రాతకు ఎంతోకాలం పట్టేది. శ్రమ కూడ అధికం. కొన్ని వ్రాత పుస్తకాలు చదవడానికి వీలయ్యేదికాదు. క్రమంగా పుస్తకాలు అచ్చుకావడం ప్రారంభమై కొంత సౌకర్యం ఏర్పడింది. కాని అప్పట్లో అచ్చుపడ్డ పుస్తకాలు సంతృప్తి

కరంగా ఉండేవికావు. అప్పుడు దొరికే కాగితం పీచు కాగితం; ముట్టుకుంటే చినిగిపోయే పరిస్థితిలో ఉండేది. ముద్రణ పదానికీ పదానికీ మధ్య ఎడం (Spacing) లేకుండా ఉండేది. ఒక అక్షరం పట్టే స్థలం కూడ ఖాళీగా ఉండనిచ్చేవారుకారు. రీము కాగితం వెల రూపాయి. అచ్చు కూర్పు చార్జీ ఫారానికి రూపాయి. కావలసినన్ని అక్షరాల దిమ్మలు లేకపోతే వ-వలు, స-నలు, శ-శలు, జ-జలు ఇత్యాదులు భేదం లేకుండా వాడేవారు. సంస్కరించే పండితులకు ఫారానికి రూపాయి గిట్టుబాటు అయ్యేది. అచ్చుకు శుద్ధ ప్రతి వ్రాయడం, అచ్చు తప్పులు దిద్దడం పండితులు చేయవలసినదే. ఆ రూపాయి తోనే వారు తృప్తి పొందేవారు. ఇలా తయారయిన గ్రంథాలు నిర్దుష్టంగా ఎలా ఉంటాయి? అందువల్ల పాఠకులకు శ్రమ తప్పేది కాదు.

ఈ విధంగా గ్రంథ ప్రచురణ అస్తవ్యస్తంగా ఉన్న సమయంలో సమర్థులూ, విద్వాంసులూ, వ్యాపార మర్మజ్ఞులూ అయిన శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు సరైన పద్ధతిలో గ్రంథ ముద్రణకూ ప్రకటనకూ పూనుకున్నారు. తెల్లదనం ఏ మాత్రం లేని పలుచని పీచుకాయితాలకు బదులుగా ముద్రణకు ఆయన యెక్కువ వెల యిచ్చి కొని తెల్ల కాగితాలనే ఉపయోగించే వారు. పద్యాలు ముద్రించవలసి వచ్చినప్పుడు పాదానికి పంక్తి చొప్పున నాలుగు పంక్తులను ఉపయోగించేవారు. పదానికి పదానికి మధ్య కొంత ఎడం ఉంచడం వల్ల పాఠకులకు ఎంతో సౌకర్యంగా ఉండేది. ఆయన స్వయంగా గొప్ప విద్వాంసులయినందున తామే గ్రంథ సంస్కరణ చేసేవారు. అందువల్ల తప్పులు లేని చక్కని ముద్రిత ప్రతులు తయారయ్యేవి. అంతకు పూర్వం చేతులలో ఇముడని పెద్ద సైజులోనే తరచుగా పుస్తకాలు ఉండేవి. శ్రీ శాస్త్రి గారు డెమ్మీ, క్రౌన్, రాయల్ మొదలైన చిన్న సైజులలోనే అచ్చు కూర్పించే వారు. అందువల్ల అంగళ్ళలో ఇతరుల పుస్తకాలు ఉన్నా, వావిళ్ళ వారి పుస్త కాలకే గిరాకీ ఎక్కువగా ఉండేది. వీరు వేదాధ్యయ సంపన్నులు కూడ. అందువల్ల సంస్కృతాంధ్ర గ్రంథాలతోపాటు జన సామాన్యానికి నిత్యమూ ఉపయుక్తాలైన వైదిక గ్రంథాలను కూడ ప్రచురించేవారు. తెలుగు లిపిలో సవ్యాఖ్యా సంస్కృత రామాయణాన్నీ, భారతాన్నీ తొలుత ప్రచురించినవారు శ్రీ శాస్త్రులుగారే. ఇప్పుడు బహుళ వ్యాప్తిలో ఉన్న తెలుగు గ్రేట్ ప్రైమరు టైపును తీర్చి అక్షరాలు పోతపోయించి ముత్యాలకోవవలె అచ్చు కూర్పించిన కీర్తి వీరికే దక్కింది.

1854-62 సంవత్సరాల మధ్యలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు అనేక ఉద్గ్రంథాలను ప్రకటించినట్లు లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం

అధికారులు 1876లో ఇండియాలో ప్రకటితమైన గ్రంథాల జాబితాలో పేర్కొన్నారు. శ్రీ శాస్త్రిలుగారిని గురించి సుప్రసిద్ధ తెలుగు విద్వాంసుడు సి. పి. బ్రౌన్‌గారు "చేతివ్రాత పుస్తకములు చదువుకొనే దినాలలో వావిళ్ళ రామస్వామి శాస్త్రిలుగారు ముద్రణాలయము స్థాపించి చదువరుల కష్టములు నివర్తింప జేసిరి" అని వ్రాశారు. దీనిని బట్టి ముద్రణ పసతులులేని ఆ రోజులలో శ్రీ శాస్త్రిలవారు ఎంతటి వ్యయ ప్రయాసల కోర్చి ఉద్గ్రంథాలను అచ్చొత్తించారో తెలుస్తుంది.

రామస్వామి శాస్త్రిగారి ఏకైక పుత్రులు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిలుగారు. 1884 లో జన్మించారు. తండ్రిగారు మరణించేటప్పటికి ఈయన వయస్సు ఆరేండ్లు. ప్రతిభాశాలి అయిన వేంకటేశ్వరశాస్త్రిలుగారు స్వల్ప వయస్సులోనే పాఠశాల విద్య ముగించి పచ్చయ్యప్ప కళాశాలలో ప్రవేశించారు. అప్పటికి వీరి దృష్టి తండ్రిగారు స్థాపించిన వావిళ్ళ సంస్థపై పడింది. కళాశాలలో చదువు కొనసాగిస్తూ సంస్థను పురోభివృద్ధికి తీసుకు రావడం సాధ్యంకాదని వారికి తోచింది. అభివృద్ధే ప్రధానలక్ష్యమైన వేంకటేశ్వరశాస్త్రిలుగారు చదువుకు స్వస్తిచెప్పి సంస్థా కార్యాలలో నిమగ్నులయినారు.

శ్రీ శాస్త్రిలుగారికి ఉదారాశయాలున్నాయేగాని, వాటిని కార్యరూపంలో పెట్టడానికి తగిన స్తోమత లేదు. ధైర్యసాహసాలు, మంచి పలుకుబడి మాత్రం పుష్కలంగా ఉన్నవి. దానికి తోడుగా అడిగినదే తడువుగా అప్పిచ్చే శ్రీమంతులయిన మిత్రులున్నారు. అందువల్ల వీరు తలపెట్టిన కార్యాలు వెంటనే ఫలోన్ముఖమయ్యేవి. చెన్నపట్నం జార్జిటౌన్‌లోని మలయ పెరుమాళ్ వీధిలో ఉన్న వారి ఆదిసరస్వతీ నిలయ ముద్రాశాల నుంచి అమూల్యమైన సంస్కృతాంధ్ర గ్రంథాలు అతి సుందరంగా తయారై ఆంధ్రుల కరతలాలను అలంకరించేవి.

వేంకటేశ్వరశాస్త్రిలుగారు సమర్థులైన విద్వాంసులతో పుస్తకాలు పరిష్కరింపజేసి, టీకలు, ఉపోద్ఘాతాలు, పీఠికలు వ్రాయించి ప్రచురించేవారు. సుప్రసిద్ధులైన రాయదుర్గం నరసయ్యశాస్త్రి, శతఘంటం వేంకట రంగశాస్త్రి, కపిస్థలం కృష్ణమాచార్యులు, చదలవాడ సీతారామశాస్త్రి, బండారు తమ్మయ్య, బులుసు వేంకట రమణయ్య, దూసి రామమూర్తిశాస్త్రి, జనమంచి శేషాద్రిశర్మ, శేషాద్రి రమణ కవులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, పురాణం సూర్యనారాయణ తీర్థులు, వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి, ఉత్పలవేంకట నరసింహాచార్యులు, ఆకుండి వేంకటశాస్త్రి, నిడుదవోలు వేంకటరావుగార్లు అలాటి విద్వాంసులలో ముఖ్యులు.

వీరికి ప్రాచీన సంప్రదాయాలతోపాటు నవీన సంప్రదాయాలమీద, గ్రాంథికభాషతో పాటు వ్యావహారిక భాషమీద కూడ ఆసక్తి ఎక్కువే. శ్రీ శాస్త్రిలుగారికి గురజాడ అప్పారావుగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, అక్కిరాజు ఉమాకాంతంగారు ఆప్తులు. అప్పారావుగారు సంస్కరించి పెంచిన కన్యాశుల్క నాటకాన్ని, డిసెంట్ పత్రాన్ని తొలుత శాస్త్రిలుగారే ప్రకటించారు. ప్రాచీన కవితా సంప్రదాయాలను ఘాటుగా విమర్శించి నూతన పద్ధతిలో కవితా విమర్శ చేస్తూ కళాపూర్ణోదయంపైని కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన విపుల విమర్శనూ వీరే ప్రకటించారు. నూతన కవిత్వంపై ధ్వజమెత్తిన అక్కిరాజు ఉమాకాంతంగారి "నేటికాలపు కవిత్వం" ముద్రించారు. రవీంద్రనాథ్ టాగూర్‌గారి గ్రంథాల వ్యావహారికానువాదాలను ఎంతో చక్కగా ముద్రించారు.

వేంకటేశ్వరశాస్త్రిలుగారు గొప్ప జాతీయవాది. ఈయన శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారికి, దివ్యజ్ఞాన సమాజస్థాపకురాలు అనిబిసెంటమ్మగారికి తీవ్ర స్వతంత్రవాది బాలగంగాధరతిలక్ మహాశయునికి, ఆంధ్రుల ఆరాధ్య నాయకుడు శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారు మున్నగు ఎందరికో సన్నిహితులు. అనిబిసెంట్ భగవద్గీతకు చేసిన ఆంగ్లానువాదాన్ని ఈయనే ప్రకటించారు. తిలక్ మహాశయుని గీతా రహస్యమనే కర్మయోగశాస్త్రాన్ని మరాఠీ నుంచి తెలుగులోకి ఆయన కోరికపై తర్జుమా చేయించి ప్రకటించారు.

శాస్త్రిలుగారు తెలుగు ప్రధాన విషయంగా ఎం.ఎ. చదివే విద్యార్థులు పలువురికి బస, భోజన సౌకర్యాలు కలిగించి ఆదుకొనేవారు. కొందరికి ఆర్థికంగా సహాయం చేసేవారు. ప్రతినెలా ఉపకార భృతి పొందినవారు చాలమంది ఉన్నారు. వీరి ఔదర్యానికీ, దయాళుత్వానికి ఇవి నిదర్శనాలు.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రిలుగారు పక్షవాత పీడితులై చాల సంవత్సరాలు బాధపడి 1956 లో యశశ్శరీరులయ్యారు.[1]

వావిళ్ళ సంస్థ చేసిన సేవను ప్రశంసిస్తూ శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు చెప్పిన ఒక పద్యం ఎంతో అర్థవంతమయింది. ఆ పద్యం ఇది:-

"బాలశిక్ష మొదలు భారతంబు వరకు
గ్రంథమేది యయిన గావలసిన
వ్రాయుడింక నేల వావిళ్ళ కనియెడు
పలుకె తెలుగునాట నిలిచె నేడు."

---

1. శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలుగారి శత జయంతి సంపుటములోని శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి వ్యాసం నుంచి.

వేంకటేశ్వర శాస్త్రిలుగారి భాషా వాఙ్మయసేవను గుర్తించి వారిని కడప ప్రజానీకం "భాషోద్ధారక" బిరుదంతో సత్కరించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1955 లో కళాప్రపూర్ణ బిరుదంతో గౌరవించింది. కాశీక్షేత్ర విద్వన్మండలి "శాస్త్రప్రచారభూషణ" బిరుదం ఇచ్చింది. నెల్లూరు వర్ధమాన సమాజంవారు ఒక సువర్ణ కంకణం బహూకరించారు.

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలుగారు త్రిలింగ పత్రికను 1916 లో ప్రారంభించారు. ఇది పూర్తిగా సారస్వత పత్రిక. ఈ పత్రిక ప్రారంభ సంపాదకులు అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు. ఈయన రెండు మూడు సంవత్సరాలు సంపాదక పదవిలో ఉన్నట్టు తోస్తుంది. ఈయన గొప్ప సంస్కృతాంధ్ర విద్వాంసులు. కలకత్తాలో ప్రమథనాథ తర్కవాచస్పతి అనే మహా విద్వాంసుల వద్ద తర్కశాస్త్రం చదివారు. చెన్నపట్నంలోని ప్రెసిడెన్సీ కళాశాలలో తెలుగు పండితులుగా పదహారేళ్ళు పనిచేశారు. అంతకుముందు ఈ పదవిని అధిష్ఠించిన వారు చిన్నయసూరి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, వీరేశలింగం, వావిలికొలను సుబ్బారావుగార్లు. ఉమాకాంతంగారు ఈ పదవికి మరింత వన్నె తెచ్చారు. ఉమాకాంతంగారి తర్వాత త్రిలింగ పత్రికకు ఎస్. సుబ్బారాయుడుగారు కొంతకాలం సంపాదకులుగా ఉన్నారు.

శ్రీ వేంకటేశ్వర శాస్త్రిలుగారు లోకమాన్య బాలగంగాధర తిలక్ అనుయాయులు. భారతదేశం అఖండంగా ఉండాలని కోరే తీవ్రవాదులు తమ భావాలను ఈ పత్రిక ద్వారా వెల్లడించేవారు. త్రిలింగపత్రిక తొలి సంపాదకీయం వారి భావాలను ఈ విధంగా వ్యక్తం చేసింది :-

"జాతియొక్క నాగరకత తద్వాఙ్మయమున ప్రదర్శిత మగుచుండును. నాగరకత ననుసరించి వాఙ్మయము మార్పు చెందుట సహజము. గ్రంథకర్తల భావములు, జనుల అభిప్రాయములు మొదట మాఱి యామార్పులు వాఙ్మయమున ప్రవేశించుచుండును. నూతన భావములను నవీనాదర్శములను వ్యాప్తిలోనికి దెచ్చుటకు పత్రికలు ముఖ్య సాధనములుగా నున్నవి. వాఙ్మయ పరిణామమున నీ పత్రికలెంత ప్రాధాన్యము వహించినది పాశ్చాత్య చరిత్రలను జదివిన వారెరుగుదురు. ఇతర దేశములకు బోనేల? మన దేశముననే గడచిన 25, 30 సంవత్సరములలో బత్రిక లెంత పనిచేసినది విమర్శ దృష్టితో జూచిన దెలియగలదు. వివేకవర్ధని, ఆంధ్రభాషా సంజీవని, అముద్రిత గ్రంథ చింతామణి మొదలగు పత్రికలాయాకాలములకు దగిన రీతిని ప్రవర్తించియుపకరించినవి. నేడు సకలజాతులును దూర్ణగమనమున నభివృద్ధి మార్గమునందు ముందడుగు వేయుచుండగా

మనము కాలమునకు వెనుకబడి పెంపులేక ఎన్నిదినములుండవలయును? నవీనములైన కల్పనలు, కథలు, గీతములు, విమర్శములు, చర్చలు, పరిశోధనములు వాఙ్మయమునకు నూతన జీవనము నీయవలసియున్నవి. సభావేదికల మీదను, పత్రికా కార్యస్థానములయందును మ్రోయు సందేశనాదములు కర్ణపుటముల యందు లగ్నములు కావలసియున్నవి. పత్రికలు చేయవలసిన పని విస్తారముగా గలదు. ఈ ఉద్దేశముతోడనే త్రిలింగ ప్రారంభించితిమి. భాషాభిమానుల యాదరణము నపేక్షించుచున్నాము. ఈ సంచికకు వ్యాసములు వ్రాసి పంపిన పండితులకు కృతజ్ఞతా సూచక వందనములాచరించుచున్నాము.

వావిళ్ళ వేంకటేశ్వరులు

ఉమాకాంత విద్యాశేఖరులు

తెలుగుదేశంలో సుదీర్ఘకాలం సేవచేసిన పత్రికలలో ఇదొకటి.... ఈ పత్రిక రజతోత్సవం 1941 లో అత్యంత వైభవంగా జరిగింది. డబుల్ క్రౌను సైజులో 844 పుటల రజతోత్సవ సంచిక సుందరంగా ముద్రితమై శాస్త్రిలు గారికి బహూకృతమైనది. దీనిలో విలువైన వ్యాసాలు, కవితలు ఉన్నాయి. ఎందరో ప్రముఖులు, కవిపండితులు పంపిన గద్య పద్య సందేశాలూ ఉన్నాయి. ఇదే సందర్భంలో సన్మానసంచిక (Commem oration Volume) 300 పుటలతో ఆంగ్లంలో వెలువడింది. దీనిలో 200 మంది అభినందనపత్రాలు, అమూల్య వ్యాసాలు ఉన్నాయి. బరోడారాజు సాయాజీరావు తమ శుభాకాంక్షలలో శాస్త్రిలుగారు ఋగ్వేదాన్ని ప్రచురించవలసిందిగా కోరారు.

వేంకటేశ్వర శాస్త్రిలుగారికి వారి స్వగృహంలోనే 1948 ఏప్రిల్ 2వ తేదీన షష్ట్యబ్దపూర్త్యుత్సవం జరిగింది. దానికి సర్ డాక్టర్ కట్టమంచి రామలింగా రెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఈ ఉత్సవంలో శాస్త్రిగారితో పరిచయంగల ఎందరో పెద్దలు కవిపండిత విమర్శక గాయకులు, పత్రికా సంపాదకులు, పత్రికాధిపతులు, డాక్టర్ పరంజపే, సర్వేపల్లిరాధాకృష్ణ, శ్రీనివాస అయ్యంగార్, మునగాలరాజా మున్నగువారు ఉన్నారు. 240 పుటలతో "భాషోద్ధారక శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సన్మాన సంపుటము" ప్రచురించారు. దానిలో శ్రీ నిడుదవోలు వేంకటేశ్వరరావుగారి "దక్షిణ దేశము-ఆంధ్రవాఙ్మయము," అక్కిరాజు ఉమాకాంతంగారి "అరవదేశమునందలి ఆంధ్ర వాఙ్మయము", టంగుటూరి శ్రీరాములుగారి "వీరేశలింగంపంతులుగారి కేసు" మున్నగు అమూల్య వ్యాసాలున్నాయి.

వేంకటేశ్వర శాస్త్రిలుగారు త్రిలింగకు తోడుగ "ఫెడరేటెడ్

ఇండియా" అనే ఒక ఆంగ్ల వార పత్రికను కూడ 1927 లో ప్రారంభించారు. అఖండ భారతమే మనకు ఉండాలి, విభజించరాదు - అనేది ఈ పత్రిక పరమోద్దేశం. స్వదేశ విదేశాల్లో ఈ పత్రిక మిక్కిలి ప్రచారం పొందింది. సి. వై. చింతామణి, ఖాసా సుబ్బారావుగారు వంటి ప్రముఖ ఆంగ్ల పత్రికా సంపాదకులు ఫెడరేటెడ్ ఇండియా నిర్వహణంలో శాస్త్రిగారికి తోడ్పడ్డారు. ఈ రెండు పత్రికలూ భాషా వాఙ్మయ సాంస్కృతిక రాజకీయరంగాలలో చేసిన సేవ గణనీయమైనది.

## గ్రంథాలయ సర్వస్వం

ఇది (1918 - 1928) గ్రంథాలయోద్యమం కోసం అవతరించింది. గ్రంథాలయాల నిర్వహణ మున్నగువాటిని గురించిన వ్యాసాలతోపాటు ఇది ఆధునిక కవితనూ ప్రచురించింది.

## 'తెలుగు' పత్రిక - వ్యవహార భాషా వాదం

పందొమ్మిదో శతాబ్ది చివరి దశకంలో ఒక విధంగా వ్యవహారా భాషా వాదానికి నారులుపడ్డాయనవచ్చు. సంస్కృత నాటకాలలో లాగే పాత్రోచిత భాషావాదం వ్యవహార భాషోద్యమానికి పూర్వరంగం. అముద్రిత గ్రంథ చింతామణి సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్య వంటి పత్రికా సంపాదకులు కూడా పాత్రోచిత భాషను సమర్థించారు. (కన్యాశుల్కం భాషను ప్రశంసిస్తూ అముద్రిత గ్రంథ చింతామణి చేసిన విమర్శను ఇదివరకే మరొకచోట పాఠకులు చదివారు.)

ఇరవయ్యో శతాబ్దం ప్రథమ దశకంలో - 1910 లో 'ఆంధ్ర భారతి' మాస పత్రిక గురజాడ అప్పారావుగారు రచించిన దిద్దుబాటు, మీ పేరేమిటి? అనే చిన్న కథలను ప్రచురించింది. అప్పారావుగారు వ్యవహార భాషలో రచించిన తోకచుక్క, లవణరాజుకథ, కన్యక మొదలైన కవితలను ప్రచురించింది. అప్పారావుగారి రచనలను తొలిసారిగా ప్రచురించింది ఆంధ్రభారతి పత్రికే.

ఇరవయ్యో శతాబ్ది రెండవదశలో వ్యవహార భాషావాదం తీవ్రమయింది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ఈ వాదాన్ని ప్రతిఘటించింది. దేశంలో వ్యవహార భాషపట్ల సుముఖత్వం సంపాదించడానికి గిడుగు రామమూర్తి పంతులుగారు బరంపురం నుంచి తంజాపురం వరకు పర్యటించి వివిధమయిన వ్యవహార భాషానుకూల సాక్ష్యాధారాలు సేకరించారు. కృష్ణ, ఆంధ్రపత్రికలు ఆయన వాదాన్ని సమర్థిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి. మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రుగారి వంటివారు సమర్థించారు

1919 ఫిబ్రవరి 28వ తేదీన వీరేశలింగంగారి అధ్యక్షతన "వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజం" ఏర్పడింది. ఈ సమాజం నాయకత్వాన గిడుగు వారి సంపాదకత్వంలో 1919 సెప్టెంబరు నెలలో 'తెలుగు' పత్రిక వెలువడింది. ఇది ఒక సంవత్సరం మాత్రమే నడిచింది. కాని, ఇది సాధించిన ఫలితం అసదృశం.

గిడుగువారు తొలి సంచిక సంపాదకీయమైన 'విన్నపము'లో ఇలా తమ ఉద్దేశాలను తెలిపారు. దానిలోని కొన్ని వాక్యాలను ఉదాహరిస్తాను:

"ఎందుకీ కొత్త పత్రిక మరి ఒకటి? దేశంలో కావలసినన్ని ఉన్నవే పత్రికలు, అనేక విధములైనవి; వాటివల్ల నెరవేరనిదీ దీనివల్లనే కాదగ్గదీ ఏమున్నది విశేష ప్రయోజనము? ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరము వివరించి మనవి చేస్తున్నాము. చదువరులు సావధానముగా పక్షపాతములేక చిత్తగింతురు గాక! నిజమే! అనేక పత్రికలున్నవి. పత్రికాధిపతులూ, సంపాదకులూ చాలా కష్టపడి ధనము ఖర్చుపెట్టి జనులకు అనేక విధాల ఉపకారము చేయడానికి ప్రయత్నము చేస్తున్నారు. వారి ఉద్దేశము దొడ్డదే. వారి ఉద్యమము కొనియాడ దగినదే గాని, వారి ఉద్దేశము చక్కగా నెరవెరలేదనన్నీ వారి ఉద్యమం పూర్ణంగా ఫలించకుండా కొంత మట్టుకయినా వ్యర్థమవుతున్నదనిన్నీ మాకు తోస్తున్నది. ఇట్లే పుస్తకములు వ్రాస్తూ ఉన్నవారి ఉద్యమము సార్థకము కావడములేదు. వ్యర్థముగా ధనము వెచ్చించడమే కూడని వ్యసనమంటారే, ధనము కన్న ఎక్కువ విలువగల దేహ బలము బుద్ధి బలము వ్యర్థముగా వెచ్చించడము ఎంత కీడో గదా!....

"లోక వ్యవహారమున తేటతెలుగున నలుగురూ వాడుకొనే మాటలతో చెప్పితే స్పష్టముగా బోధపడే విషయము వాడుకలో లేని మాటలతో చెప్పితే వృథా ప్రయాసము గాదా? దానివల్ల ఏమైనా లాభమున్నదా? లేదని తెలిసినా చాలామంది వ్యర్థముగా తాము ఆయాసపడి చదివేవారిని ఆయాస పెట్టుతున్నారు.... ఈ పత్రికలో మొట్టమొదట చర్చించే విషయము వ్యావహారిక భాష, దాని ప్రవృత్తి, దాని ఉపయోగములు, దాని గౌరవము, దానిని ఉపేక్షించడము వల్ల దేశమునకు కలుగుతూ ఉన్న నష్టములు."

ఈ పత్రికలో గిడుగువారు గ్రాంథిక వాదులను బాగా రెచ్చగొట్టారు. గ్రాంథికవాదులయిన పండితులు భాషాస్వరూపం ఎరుగరని, వారు వాడే భాష సలక్షణంకాదని ఈ పత్రిక ద్వారా ఆయన నిరూపించారు. ఆంధ్ర పండిత బిషకుల భాషాభేషజం అనే శీర్షికలో ఆయన పండితుల - ముఖ్యంగా వేదం

వేంకటరాయ శాస్త్రిగారి అప్రయోగాలను చూపించారు. తర్వాత ఆ వ్యాసాలు పుస్తకరూపం దాల్చాయి.

"ఈ పత్రిక ద్వారా వ్యావహారిక భాషోద్యమం ప్రచారానికి గిడుగు వారు చేసిన కృషి ఫలించింది. ఆంధ్ర వచన రచనా మార్గం వ్యావహారిక భాషోన్ముఖ మైంది. యువ రచయితల కంఠాల్లోని గడియలు విడిపోయాయి. పాండిత్యం ఉంటే గాని రచనకు దిగకూడదనే బెదురుపోయింది. వ్యావహారిక భాషావాదం రూఢమై మాతృ భాషలో స్వేచ్ఛగా వ్రాయవచ్చుననే ప్రత్యయం కలిగింది. దాంతో వ్యాకరణ భయం లేకుండా వచన రచన ప్రబలింది. 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం' పరాస్తమై, బాల కవులకు శరణ్యం లభించింది"[1]

రామమూర్తిగారు రాజశేఖరుని కావ్య మీమాంసలోని సూక్తిని తెలుగు పత్రిక ముఖ పత్రంపై ప్రచురించేవారు.

దీని తాత్పర్యమిది : సంస్కృతం గొప్ప భాషే. అందుకు సందేహం లేదు. అయితే సరసుడైనవాడు తన సిగలో తులసిమాల ధరిస్తాడా, జాజిపూలు ధరిస్తాడా చెప్పండి. అట్లాగే ప్రాకృతానికున్న సౌందర్యం, లాలిత్యం సంస్కృతాని కెక్కడివి? ప్రాకృతమే మాకు ఇష్టం."

రామమూర్తిగారు తాము యావదాంధ్ర ప్రాంతంలోను పర్యటించి సేకరించిన ఆంధ్ర వ్యవహార సమాచారాన్ని ఈ పత్రికలో ప్రచురించాలని ఉద్దేశించారు. కాని, ఇది కేవలం భాషా శాస్త్ర వాద ప్రతివాద పత్రిక కాబట్టి సామాన్య పఠితలు దీనిని అంతగా ఆదరించి ఆత్మీయం చేసుకోలేకపోయారు. కనుక సంవత్సరం కన్న ఇది ఎక్కువ నిలువలేదు.

ఈ తెలుగు పత్రికను చదివి ఉత్సాహితులైన యువకులు సాహితీ సమితి అనే సంస్థను నెలకొల్పి, దానికి గౌరవ సభ్యులుగా రామమూర్తిగారిని ఎన్నుకున్నారు. సాహితీ సమితి 1919 లో 'సాహితి' పత్రికను ప్రచురించి, వ్యావహారిక రచనలకు స్థానం కల్పించింది.

## ముక్త్యాల సరస్వతి (1923-28)

ఇది కృష్ణాజిల్లా ముక్త్యాల నుంచి రచయితలు, విద్వాంసులు అయిన ముక్త్యాల రాజా వాసిరెడ్డి సదాశివేశ్వరప్రసాద్ బహద్దర్‌వారి సంపాదకత్వంలో వెలువడేది. ఇది కూడా ప్రధానంగా ప్రాచీన కావ్య ప్రబంధాల ప్రచురణకు ఉద్దేశించినట్టిదే. సుప్రసిద్ధ పరిశోధక విద్యత్కవులు శ్రీ వేటూరి ప్రభాకర

---

1. వి. లక్ష్మణరెడ్డి వ్యాసం నుంచి - మరోసారి గిడుగు రామమూర్తి.

శాస్త్రిగారు దీనిలో నాసికేతో పాఖ్యానము, ఉద్భటారాధ్య చరిత్ర, చారుచర్య, వైద్యగ్రంథ సముచ్చయము మొదలైన వాటిని సంస్కరించి ప్రచురించినారు. తెలుగుదేశ కవులను గురించి పెక్కువ్యాసాలు వ్రాశారు. జయంతిపురం రాజాగారు క్షేమేంద్రుని అవదాన కల్పలత కథలను కొన్నిటిని సంస్కృతం నుంచి అనువదించి దీనిలో ప్రచురించారు.

పత్రికలు స్థాపించడానికి, నిర్వహించడానికి పండితులు, సాహిత్య పోషకులు ఎంత ఆరాటపడేవారో, పరోక్షంగాను, ప్రత్యక్షంగాను ప్రతి విషయం లోను ఎంత శ్రద్ధ తీసుకొనేవారో తెలుసుకొనడానికి ముక్త్యాల సరస్వతి పత్రిక ఆవిర్భావ నిర్వహణ చరిత్రను వివరంగా ఇక్కడ పొందుపరుస్తారు. ఇది ఇతర పత్రికల విషయంలోను వర్తిస్తుంది. ఇది నాకు పూర్తిగా తెలిసిన విషయం గనుక ఉదాహరణ ప్రాయంగా వివరిస్తాను :-

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి పత్రికను నిర్వహించాలనే వాంఛ మిక్కుటంగా ఉండేది. తమ కాలంలో వివిధ పత్రికలకు కవితలు, విమర్శ వ్యాసాలూ, చారిత్రక శాసన పరిశోధకవ్యాసాలు వ్రాసేవారు. ముక్త్యాల సరస్వతి మాసపత్రికను స్థాపింపజేయడంలో ప్రభాకరులకు జయంతిపురం జమీందారు రాజా శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ బహద్దర్‌గారితో పరిచయమైంది. రాజాగారు బహుభాషకోవిదులు, బహుశాస్త్రజ్ఞులు, ప్రత్యేకంగా బౌద్ధంలోను, ఆయుర్వేదంలోను, వృక్షాయుర్వేదంలోను విశేషాసక్తి, పరిశ్రమ కలవారు. వారిద్దరి పరిచయం క్రమంగా స్నేహ సాహిత్య. బంధంగా పరి ణామం పొందింది. ఈ ఘట్టాన్ని రాజాగారి మాటలలోనే చెబుతాను :

"ఒకనాడు శ్రీ ప్రభాకరశాస్త్రిగారూ, నేనూ మాటలాడుచున్నాము. అపుడు శ్రీ చల్లా సూర్యనారాయణగారూ వచ్చినారు. శ్రీ సూర్యనారాయణగారు నా విద్యా వ్యాసంగమును గురించి ప్రస్తావించిరి. దానినందుకొని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 'వీరి విద్యా వినోదము నన్ను ముదితుని జేసినది. వీరనువదించిన అవదాన కల్పలత 1, 2 పల్లవములు చూచినాను. శైలి సరళముగా నింపుగా నున్నది. కృషి చేసినచో వీరుత్తమ రచయిత కాగలరు' అని (నావైపు తిరిగి), 'మీ విద్యా వినోదమునకు తగిన విద్యారంగ స్థల మవసరము. అందుకు సారస్వత పత్రికను మీరు నడుపదగును. దానిమూలమున మీ విద్యా వినోదమును ప్రోగు చేసికొని మీరానందించుచు విద్వల్లోకమునూ ఆనందపరచనగును.' అని నన్నుద్దే శించి ఆ పత్రికను నిర్వహించుటకు నన్ను మిగుల ప్రోత్సహించిరి. శ్రీ సూర్య నారాయణగారున్ను నన్నందుకు ప్రోత్సహించిరి. పత్రికను నడుపుటకు

నేనంగీకరించితిని. అంతట శాస్త్రిగారి విషయమును శ్రీ అన్నగారితో చెప్పి పత్రిక ముద్రణ ముక్త్యాలలో శ్రీ అన్నగారి ముద్రణాలయమున జరపుట కేర్పాటు చేసిరి. 'సరస్వతి' అను పేరుతో మాసపత్రికను నడుపుటకు నిశ్చయించి నాము. నేను సంపాదకుడనుగా శ్రీ చల్లా సూర్యనారాయణగారు ముద్రాపకులుగా డిక్లరేషను లిచ్చినాము. ఆ పత్రికలో ప్రచురింపదగిన ప్రాచీన గ్రంథములను శ్రీ ప్రభాకరశాస్త్రిగారితో సంప్రదించి నిశ్చయించినాము. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు మద్రాసు వెళ్ళిరి."

ఈ విధంగా సరస్వతి పత్రిక 1923 మార్చిలో రాజా శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదు బహద్దరు వారు పత్రికాధిపతిగా ముక్త్యాల నుంచి వెలువడింది. ప్రభాకరుల బాల్యమిత్రులు శ్రీ చల్లా సూర్యనారాయణగారు దానికి మేనేజరు. ప్రభాకరులు పరోక్ష సంపాదకులు. ప్రభాకరులు దీని ముఖపత్రంపై సరస్వతీ ప్రార్థనా రూపంగా 'సరస్వతి' గొప్పదనం తెలుపుతూ ఒక పద్యం ప్రచురించారు :

మ. చెలి! కన్గొంటివె? చిత్రచిత్రమగు సృ
ష్టిం జేయు నా నేర్పనన్
నలువన్ నవ్వుచు భూతపంచకము సం
ధానించి నిర్మించు మీ
మెలు పౌనౌ నిది నిష్పదార్థముగ ని
ర్మింతున్ విచిత్రార్థ వా
క్కలనల్ కంటిరె? యన్ సరస్వతి తదు
త్కర్షంబు మా కీవుతన్.

అప్పటి పత్రికలలో ప్రాచీన కావ్యాలను ధారావాహికంగా ప్రచురించడం పరిపాటి. దానిని అనుసరించి ప్రభాకరుల ప్రేరణచే ఈ పత్రికలో నాచికేతో పాఖ్యానం, ఉద్భటారాధ్యచరిత్ర, భోజరాజు సంస్కృత చారుచర్య సటీకగాను, సద్వైద్యగ్రంథ సముచ్చయమనే వైద్య గ్రంథం సటీకగాను ప్రచురిత మయాయి. వాసిరెడ్డివారి వంశచరిత్ర ప్రచురితమైంది. రాజావారు క్షేమేంద్రుని అవధాన కల్పలతను అనువదించి వరుసగా ప్రచురించారు. దాదాపు పదకొండు పల్లవాలు పూర్తయాయి. శ్రీయుతులు భావరాజు వెంకటకృష్ణారావు, పెద్దిబొట్ల వీరయ్యపంతులు. మానికొండ సత్యనారాయణ. డాక్టర్ వేటూరి శంకరశాస్త్రి గార్లు మున్నగువారు వ్రాసేవారు.

ప్రభాకరులు ఈ పత్రికలో సమస్యాపూరణం ప్రవేశపెట్టారు. గ్రంథ

విమర్శనము ప్రవేశపెట్టారు. సాహిత్య వార్తలు - ఎవరికైనను సన్మానాలు జరిగినా, ప్రముఖ కవి పండిత విమర్శకులు మరణించినా ప్రచురించారు. బ్రౌను దొర జాబులు అనే శీర్షిక కింద అతడు సేకరించి సంపుటాలుగా భద్రపరచిన జాబులను ప్రచురించారు. వార్తకొక ఉదాహరణం :

"ఆంధ్రభాషా విలాసినీ పత్రిక వెలయించియు, ఆంధ్రపరిశోధక మండలి స్థాపించియు, అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వము పాదుకొల్పియు, ఆంధ్రకవి సముదాయము నాదరించియు, ఇంకను బలువిధముల ఆంధ్రభాషా సేవ యొనర్చుచున్న మన కావ్యనిధి చెలికాని లచ్చారావుగా రకాలమృత్యువు వాతం బడినందుల కెంతయు సంతాపము నొందుచున్నాము."[1]

ఇప్పటి క్విజ్ లాంటి 'ప్రశ్నమాల'ను ప్రవేశపెట్టారు. ఈ ప్రశ్నలు ఇలా ఉంటాయి. "తేనెయునేయియు గలిసిన విషమగునందురు గదా! దీనికి ప్రమాణ మెందుగలదు? అనుభవములో విషమగుచున్నదా?" "ఆంధ్రదేశమునం దక్కడక్కడ 'రాకాసిగుండ్లు' అనునవి యున్నవి. వాని చరిత్రమేమి?" "ఆలేఖ మతస్థాపకు లెవరు? ఈ మతము యొక్క ముఖ్యోద్దేశమేమి? ఇది యే యే ప్రాంతములందు వ్యాపించియున్నది. ఈ మతస్థుల ఆచార వ్యవహారము లెట్టివి? ఆలేఖ మనగా అర్థమేమి?"

సమస్యాపూరణంపై విమర్శలు ప్రతి విమర్శలు జరిపించేవారు! సమస్యా పూరణంలో శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రి (బందరు) వంటి పండిత ప్రకాండులు పాల్గొనేవారు.

ప్రభాకరులు ఈ పత్రికలో ఏణీ పంచకము, సంవత్సరాది పద్యములు మొదలయిన కవితలు, తెలుగుదేశపు సంస్కృత కవులు, భాగవతము, సుభోజనము, ప్రతిమా నాటకానువాదం మున్నగు వ్యాసాలు పేరుతోను, కొన్ని పేరుపెట్టుకొనక ప్రచురించారు. తెలుగుదేశపు సంస్కృతకవులు శీర్షికకింద జాయప సేనాని, విద్యానాథుడు, అగస్త్యుడు, పశుపతి నాగనాథుడు, విశ్వనాథుడు, నరసింహకవి, చెన్నుభట్టు మొదలగు వారిని గురించిన అపూర్వ విషయాలు తెలిపారు. ముక్త్యాల, నందిగామ శాసనాలు, అనంతవరం తామ్ర శాసనం ప్రకటించారు.

ఈ పత్రికకు పరోక్ష సంపాదకులు ప్రభాకరులే. పత్రిక మేనేజరు శ్రీ చల్లా సూర్యనారాయణగారు పత్రికకు వచ్చిన వ్యాసాలనన్నిటిని మద్రాసుకు ప్రభాకరుల వద్దకు పంపేవారు. వారు వాటిని పరిశీలించి, సంస్కరించి సూచన లతో తిప్పి పంపేవారు. ఈ సందర్భంలో వారు సూర్యనారాయణగారికి వ్రాసిన

---

1. సరస్వతి సం. 1, సం. 3.

ఒక ఉత్తరం ఇక్కడ పొందుపరుస్తాను. ఇది నేటి పత్రికా రచయితలకు కూడా ఉపకరిస్తుంది.

9 అర్ముగం వీథి
21-3-23

నమస్కారములు

మీ యుత్తరములందినవి. అశ్రద్ధకొంత; అవ్యవధికొంత; అశక్తికొంత.

నమస్యాపూర్తులు చక్కగా నున్నవి. I II వంపుటొంపులు లేకున్నవి. రెండు పత్రికలు సం దాక పడయుదురు లెండు.

1 లో మెచ్చుకొనె; నీ వద్దానినే దిద్దుమా,

యింకం గుంకుమబొట్టు పెట్టకుమః

అని మార్చుటవసరము. అది **సెబాసుః II బాగుః బాగుః: III పద్యము చక్కగా నున్నది.** కాని కల్పనలో కొంతటొంకు తోచుచున్నది. సైరంధ్రీ కీచకులు వలదు. మాయజోగి శివుడు; తపస్విని పార్వతి-గా మార్చి టొంకు తీరి ఔచితి పొసంగునని నాయూహ. ఆ దంపతులను గూర్చుటకై పూర్వము తపస్వియైన శివుని గొట్టి చిచ్చుఅకంట నీఱయినాడు మన్మథుడు. కాన- ఇప్పుడు తపస్వినిగా నున్న పార్వతిని గొట్ట వెఱచుచున్నాడనవచ్చును. అప్పుడు పార్వతి మన్మథవశయై శివుని చెంతకు వచ్చియున్నది. ఇప్పుడు శివుడు (మాయా వేషముతో) మన్మథవశుడై పార్వతి చెంతకు వచ్చి వేడుచున్నాడు. పార్వతి గర్హించుచున్నది. ఇది పూరణ సందర్భము.

IV పద్యమందు కల్పనమందు టొంకు ఉన్నది. నీ మగడు నీవు ఇద్దరు సిగ్గరులే అయితిరి. ప్రియుని కంటిన కుంకుమాంకములను జెలులు నఖక్షతాదికము క్రింద లెక్కించి మిమ్ము బరిహసింతురు. ఆ పనులలో మీరెంత జాగ్రత్తగా ఉన్నా దీనిమూలాన తంటావస్తుంది. కాని - ఇంకేం - అనుట సరియనుకొంటాను. పురుషాయితము, అసృద్భాతి, అనుటేలః పల్లుకొక్కుల నాతను నొప్పజేయకుము - అనుట ఎందుకుః మూడు నాలుగులు పైవిధముగా మార్చితే ఇవి కూడ ఒకటికొకటి తీసిపోనివనిపించుననుకొంటాను. కడపటి రెండు ఇప్పుడును బాగుండకపోలేదు.

అనపద్యమయినవే పూర్తులు.

ఏదో నేను నొకటి యిగిలించినాను. పంపితిని.

సంవత్సరాది పద్యాలు

ii iii, పంపుడు - iv కూడ ఒకటి తోచక వ్రాసితిని గానీ వానితోనే పంపుడు అది యిది :

మ. వ్యథలం గూర్చును మంగళాఖ్యగలదై
యంగారవారం, బిలన్
సుధ నా(బేర్పడి నోరు పుండొనరుచున్
సున్నం, బిదేమాడ్కి నీ
రుధిరోద్గారి సమాఖ్య కర్థమున వై
రుద్ధ్యంబు సిద్ధంబగున్
మధిరోద్గారివి నీవుకా(గలవు చు
మ్మా మాకు నూత్నాబ్దమా!

ఇది నాదిగా చెప్పేవు, వ్రాసేవు సుమా! అట్లు వద్దు. కృష్ణకో, ఆంధ్రకో పంపుడు. ఆంధ్రకు నేనియ్యను. మీరే పంపుడు. అక్కడ నేను కొంచెము కోపగించి యున్నాను. తక్కిన కాయితాలు 2, 3 నాళ్ళలో అంపుతాను. ఉద్భట ముగిసినది. తక్కినవి చూడవలెను. శృంగా - బెజవాడ ఉత్తరం వచ్చినది. బెజవాడ రానా? ఒక్కడనే ఆరంభించనా?

చిత్తగింపుడు
వే. ప్ర."

ఈ ఉత్తరాన్నిబట్టి పత్రికకు సంబంధించిన సకలమూ ప్రభాకరులకు పంప బడేవని, వారు వాటిని చూచి తగిన సూచనలిచ్చేవారని స్పష్టంకదా! సమస్యా పూరణం విషయంలోను, పద్య ప్రచురణ విషయంలోను వారు ఎంత శ్రద్ధ తీసుకొనేవారో ఈ ఉత్తరం చాటుతున్నది. తాము వ్రాసిన పద్యానికి పేరు వేయవద్దన్నారు. దానికి కారణాలుంటాయి. పత్రికలో ఒక వ్యాసానికో, రచ నకో ఒక రచయిత పేరు వుంటే బాగుంటుంది. కాని, అంతకుమించి ఉంటే బాగుండదు. ఇది పత్రికా రచనారంగంలో ఉన్నవారందరికీ అనుభవమే.

ఒకమారు చల్లావారు పత్రికపై చిన్నచూపు చూడవద్దని వ్రాశారు కాబోలు. దానికి ప్రభాకరులు పద్యలేఖ వ్రాశారు. దానిలోని విషయాలు నేటి పత్రికాధిపతులు కూడా పాటించదగినవే. ఆ పద్యలేఖ ఇది :

నమస్కారములు. ఉభయకుశలోపరి.

గీ॥ సోగ ముత్యాల జాలు మీసొగసువ్రాలు
చూచి చదివి మఱిన్ మఱి చూచి చూచి
చదివి చదివి యానందించి యెదుర(గల్గు
మిత్రులకు(జూపి వారల మెప్పు( బడసి
నా(డ, నిది మీకు వ్రాయుట వేడు కగునె।

2. హ్రస్వపుంజూవు। నాకు! సరస్వతి యెడ।
నెంతమాటాడితిరి। నాకు వంత చుండు।
చూతునెంతయు సర్వాంగసుందరగను
మాసరస్వతి నంచు నే నాసపడుదు.

3. ఆస యదియెల్ల నా కడియాసయయ్యె
నలుగురు నిసీరె యనఁగఁ జిన్నతనమయ్యె
చచ్చుపుచ్చు టక్కరములే యచ్చుకయ్యె

4. ప్రతిమ జూచితి నాయాత్మ కుతిలపడియె
నా రచనగూడఁ జదువుట నాకు దుష్క
రమ్ముగాఁ దోఁచెనిది మీరు నమ్మరేమొ।

5. వ్రాయగాఁ జేయిరాదింక వ్రాసినవియుఁ
బంపఁగా బుద్ధిపుట్టదు పంపినదియు
నచ్చువడి రాఁగఁ జదువుట కిచ్చవొడమ
దేమిచేయుదు తప్పు నాదేకదోట।
అచ్చుచక్కన నెలనెల వచ్చుటయును

6. గుదురుచుఁడు, పైన నాతప్పు వెదకుటొప్పు
క్రొత్త యక్షరాల్ తెప్పించుకొనుట యొండె
గొండె వేఱొక్కచో నచ్చు కొసగుట యెదొ
యేర్పడన్ వలెఁ బత్రిక పేర్వడవలె
నుందుఁగా కంతదాక కుట్టుసురు తోడ.

7. కన్నతండ్రి జయంతీశుఁ డెన్నఁడైన
కనికరింపక యుండునో! కన్నతండ్రి
కన్నఁ బుట్టిన దాదిగ గారవించి
పెంచుచున్న మీరును జేయి విడుతురొక్కొ!
ఎఱుఁగుదును వారి మఱిమిమ్ము నెఱుఁగుదును, వి
చారపడను, సరస్వతి తీరు కొఱకు.

8. వ్రాసితిని దీనిఁ గూర్చి శ్రీవారికేను
సల్పుచున్నారు జతనంబు సాఁగఁ గలదు,
వెలయఁ గలదు సరస్వతి నెలకు నెలకు
బలము లేదని మీరును పలుకరాదు

గొప్పగా బుద్ధికిని బని చెప్పవలయు
జయ మొసఁగు నింక మకరధ్వజంబు మీకు;

9. క్రొత్తవత్సర మరుదెంచెఁ గోర్కెఁ గోకి
లములు, చిగిరించెఁ దరువులు, క్రమము గాదె.
(లేఖలో కొంతభాగం లోపించింది.)

ఇంతేకాక ఏరకం అచ్చుసిరా తీసుకోవాలో, ఎలా ప్రింటుచేయాలో కూడ ప్రభాకరులు తెలిపారు.

ప్రభాకరులు సరస్వతిలోనే ప్రతిమా నాటకానువాదం ప్రారంభించారు. తర్వాత భారతిలో అది సమాప్తమై పుస్తక రూపం పొందింది ఆంధ్రపత్రికా కార్యాలయంలో. అది సరస్వతిలో అచ్చవుతున్నప్పుడు జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలలో ఒక లేఖను ఇక్కడ ఉట్టకిస్తాను :-

3/15 నల్లతంబి వీథి
16-12-25

నమస్కారములు. ఉభయకుశలోపరి. మీ రెండు జాబులును చేరినవి. కడపటి జాబు కడపటి విషయములనుండి బదులు పూర్వ పూర్వమునకు వ్రాస్తున్నాను........పత్రికకు వ్యాసములు 4 దినములలో పంపుతాను. ప్రతిమ కాపీలు 250, 300 కంటె ఎక్కువవద్దు. ఆదర్శే వల్కాలానీవ కిమేతే సూర్యరశ్మయః అని ఉన్నది. అందుకని అట్లా వ్రాసినాను. తర్వాత రాము డొకటి అడుగుతాడు. ఇదివరకు వచ్చినచోట్లకూడ బహువచనం ఉంటే మంచి దనుకొంటాను. 'సూర్యరశ్మల' ఉండుటేసరి. రస్మల ఉండెవలెననుటకు బల వత్ప్రమాణములు లేవు. రాశి - రాశులు, కాని దానిని రాసి - రాసులు అన వచ్చును. ధృతపాశి - ధృతపాశులు అగును. ఇది చాలా విచారించి ఉన్నాను. ('నిర్వర్ణ్య' నిర్వర్ణించి సౌందర్యమును చక్కగాఁ బారఁజూచి అని అర్థము.) 'అరఁజూచి' అనవచ్చును. కరములఁ 'దెల్పు' ఉంచుడు. లిర్పు నాకు తృప్తి గొప్పలేదు. సంస్రంసితాభరణ గౌరతలౌ చ హస్తౌ. ప్రెస్సువిషయము - ప్రస్సు విషయము - జగ్గయ్యపేటకు మార్చటము, ముందు ముఖ్యముగా మీరు, తర్వాత ఇక్కడి స్థితిగతులుఁ జూచుకొని నేనున్నూ తత్కార్యములను జూడ వచ్చును. ఆ విషయము అన్నగారితో సంప్రదించవలసిందే. సన్ను వ్రాయమంటే వ్రాస్తాను....ఇది రెండో జాబుకు జవాబు. ప్రతిమ రెండో ఇష్యూకు తయారు చేస్తాను. ప్రథమాంకం ముగిస్తే ఆ మీద అన్ని పద్యాలూ వ్రాసే ఉన్నవి గనుక ఇబ్బంది ఉండదు. మొన్నటి పోర్షన్‌లో పద్యాలెట్లా

ఉన్నాయి? 'సేవ్య సేవక' ఈ తూరి కడముట్ట అచ్చగును. దానిని వేరే పుస్తకాలుగా........"

ఈ ఉత్తరం పత్రికాసంపాదకులు, అధిపతి అయిన శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాద్ బహద్దర్ గారికి వ్రాసినది. దీనిలో ప్రస్తావించిన అన్న గారు ముక్త్యాలరాజా శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరుగారు. ఈ ఉత్తరములోని పదచర్చను బట్టి ప్రభాకరులు ఎంత నిశితంగా ప్రతిదీ చూచేవారో తెలుస్తుంది.

ప్రభాకరులు సంపాదకులుగానే కాక ఇతర విధాల కూడ యువ రచయితలను తీర్చిదిద్దేవారు. అలాటివారిలో ఒకరైన శ్రీ ఎన్. ఎ. నారాయణరావు అనుభవం ఆయన మాటలలోనే వినండి:

"నేను విద్వాన్ ఫైనల్ మొదటి సంవత్సరములో చదువుచున్నప్పుడు విద్వాన్ విద్యార్థులకు కవిత్వరచనలో ఆసక్తి కలిగించుటకై ఒక కవితాగోష్ఠి నిర్వహింపబడినది. విద్యార్థులు పెక్కండ్రు తమ రచనలు సమావేశములో చదివి వినిపించినారు. నేను ఎస్. ఎస్. ఎల్. సి ఆంగ్లపాఠ్యభాగములో చదివియున్న జాన్ ఎడ్డింగ్టన్ సైమండ్స్ (**John Addington Symonds**) రచన. **A vista** అనే దానిని తేటగీతలలో అనువదించి చదివినాను. మరుసటి దినము తరగతిలో శ్రీ శాస్త్రిగారు కవితాగోష్ఠి వివరముల నడిగినారు. నా రచనా ప్రసక్తి వచ్చినది. పద్యములను గురుదేవులకు చూపితిని. అందలి మహోన్నత భావములకు వారు ముగ్ధులై ఇంగ్లీషు పద్యములతో నా అనువాదము చూచినారు. అనువాదము మూలానుసారముగానే ఉన్నది. కాని ఆ భావములను విస్తృతపరచుట అవసరమని గేయములుగా అనువదించిన బాగుండునని సెలవిచ్చిరి................ముత్యాల సరాల పద్ధతిలో నా పద్యముల ననుసరించిన బాగుండునని తెలిపి రచనకు శ్రీకారము చుట్టిరి. రచన చాలవరకు వారిదే. అనువాదము పూర్తియైన పిదప ఆ గేయములను తాము మనశ్శాంతికై అప్పుడప్పుడు చదువుకొందునని వ్రాసి యిమ్మనిరి. అట్లే వ్రాసి యిచ్చితిని,........ అది 1944 వ సం॥ ఉగాది సంచికలో ప్రకటింపబడెను."

ఇది వారి ప్రోత్సాహపద్ధతి. ఆ రచన "తీయని తలుపులు" అనే శీర్షిక కింద ప్రచురితమయింది. మొదటి గేయాన్ని చివరిదానిని ఉదాహరిస్తాను:

"జగతి నికనివి తప్పకుండగ
జరుగనున్నవి యుత్తమోత్తమ
జాతి యొక్కటి వెలయు నదియును
జగమెఱుంగనిది.

*　　　*　　　*

దాననెల్లర హృదయములు స్వా
తంత్ర్య తేజముతో వెలుంగును
మెఱయుచుండును వారి కనుగవ
లెఱుక మెఱపులతో.

భ్రమముగాదిది స్వప్న వృత్తాం
తమునుగా దత్యంత సత్య
క్రమముగా నిక మీద జగమున
కలుగనున్న దియే.

మనము చూతుమొ చూడమో మన
తనయులైనను చూడనేర్తురు
కనుటకే యాసింత మా బం
గారు కాలంబున్."

సంపాదకుని పని వ్రాయడం, తిరగ వ్రాయడం, సరిదిద్దడం, సవరించడం - ఈ చతుష్కార్యాలు ప్రభాకరుల సంపాదకత్వంలో కనిపిస్తాయి.[1]

## తెలుగుదేశ వాఙ్మయ పత్రిక

మద్రాసు నుంచి సుమారు రెండేళ్ళపాటు అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు నడిపిన యీ పత్రికను గురించి చాలామందికి తెలియదు. 1921 లోనే యీ పత్రికను విద్యాశేఖరులు ప్రారంభించారు. తెలుగుదేశ వాఙ్మయ సమితి, తిరువల్లిక్కేణి, మద్రాసు నుంచి ఈ పత్రిక వెలువడేది. ఆనాటి సాహిత్య కార్యకలాపాలను నిశితంగా విమర్శించేవారు ఉమాకాంతంగారు ఈ పత్రిక ద్వారా. ఉన్నత ప్రమాణాలు పాటిస్తూ వారీపత్రికను నిర్వహించారు. తెలుగుదేశపు వాఙ్మయసమితిని ఆయన తెలంగాణా లిటరేచర్ ఎసోసియేషన్ అని ఇంగ్లీషులో సమానార్థకంగా ప్రతిపాదనం చేయడం చూస్తే మొత్తం తెలుగు నాడును ఆయన తెలంగాణాగా భావించడం స్పష్టమవుతుంది. దీనినిబట్టి ఆయన విశాల దృక్పథం వ్యక్తమవుతుంది. ఉమాకాంతంగారి చాలా రచనలు ఇందులో వచ్చాయి. విష్ణు చిత్తీయసభ పరామర్శ శీర్షికతో వేదం వారి ఆముక్తమాల్యద వ్యాఖ్య సంజీవని ఆవిష్కరణ సభను, ఆనాటి పండితుల ఉపన్యాసాలను ఉమాకాంతంగారు విమర్శించారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు, మేడేపల్లి వేంకట

---

1. ప్రభాకర స్మారిక నాల్గవ సంపుటంలో నా వ్యాసం నుంచి.

రమణాచార్యుల వంటి గొప్ప విద్వాంసులు, పరిశోధకులు ఈ పత్రికలో రచనలు చేసేవారు. కొమర్రాజువారు పరమపదించిన వార్తను ఈ పత్రిక యీ విధంగా ప్రకటించింది: "శ్రీ లక్ష్మణరావుగారి నిర్యాణము వాఙ్మయ పత్రికకు అపారమైన కొఱతను కలిగించినది. వీరి వైదుష్యము ఆంధ్రలోకమున ప్రసిద్ధమైనది. గనుక మేము వివరించలేదు. ఈ పురుషుని వియోగమువల్ల ఆంధ్రదేశమునకు కలిగిన కొరత ఏనాటికి తీరునా అని విచారముతో ఈ సంతాపకరమైన వార్త నిక ముగించుచున్నాము." దీనిని రుధిరోద్గారి 12వ సంచికలో ప్రకటించారు. ఈ పత్రికలో న్యాయదర్శనం కొమర్రాజు వారూ, వైశేషికదర్శనం మేడేపల్లి వారూ ప్రకటించారు. సంస్కృత వ్యాకరణ ప్రదీపము పేరుతో ఉమాకాంత విద్యాశేఖరులు పాణినీయం సాంధ్ర వివరణం ప్రచురించారు.

ఉమాకాంతంగారు నూటికి నూరుపాళ్లూ భారతీయత ఇమిరిన వారు, కనుక పాశ్చాత్య పద్ధతులను ఈసడించేవారు. క్రీస్తు శకానికి మారు తమ పత్రికలో కల్యబ్దాలే వాడేవారు. వాఙ్మయదర్శనం అనే పేరుతో వ్రాసిన సూత్రాల ప్రాచీన ఖండం ప్రథమాధ్యాయం పంచమాలోకంలో "పాశ్చాత్యుల భారతీయ వాఙ్మయేతిహాస విమర్శములు భారతీయులకు అనుపాదేయములు (సూ.6), అట్లే పాశ్చాత్యకృత భారతీయులవి" (సూ.7) అని తమ వైఖరిని స్పష్టపరచారు. ఈ దృష్టితోనే ఆయన "శ్రీమద్రామాయణ మహాభారత విమర్శ విచారణ" అనే వ్యాసంలో డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు మహాభారతంపై గోఖలేహాలులో చేసిన ప్రసంగాన్ని విమర్శించారు.

ఉమాకాంతంగారు ఈ పత్రిక ద్వారా తెలుగు సంస్కృత సాహిత్య సిద్ధాంతాలకు కొత్తరూపు తెచ్చారు. ఆయన రససిద్ధాంతం, నైషధతత్త్వజిజ్ఞాస, ఫారిన్ కనెక్షన్ ఆఫ్ బుద్ధ మొదలైన వ్యాసాలు, సాంప్రదాయికమార్గంలో నూతనత్వాన్ని వెలార్చేవి. ఆయన సాహిత్య సూత్రీకరణ నైపుణికి వాఙ్మయ దర్శనం ప్రాచీన ఖండంలోని రెండు ఆలోకాలను ఉదాహరిస్తున్నాను:-

ప్రథమా లోకము

౧. ఇక వాఙ్మయమునకు వ్యాఖ్య చేయబోవుచున్నాను

౨. సహృదయుల అంతఃకరణము ప్రమాణము

౩. గద్యపద్య కృతి సముదాయము వాఙ్మయము

౪. ధర్మార్థకామములయందలి జనుల ప్రవృత్తినివృత్తులు ఇతిహాసమని

౫. అది వాఙ్మయము వలన,

౬. ఆచారములవలన,

౭. సంప్రదాయములవలన,
౮. శాసనములవలన,
౯. వృద్ధ వ్యవహారములవలన వ్యక్తము
౧౦. వేషభాషలు ఆచార సంప్రదాయములు వాఙ్మయమునకు అనుబంధములు
౧౧. శాసనములు, వృద్ధ వ్యవహారములు వాఙ్మయమున అంశములు
౧౨. ఫలాభిసంధి లేని ప్రవృత్తి ధర్మము
౧౩. అవిశేషము వలన వీరత్వము ధర్మమని
౧౪. కామప్రధాన సాధనము అర్థము
౧౫. ఫలాకాంక్ష కామము
౧౬. ధర్మము ఆత్మవశము
౧౭. కామము పర వశము
౧౮. ధర్మము ఉత్తరోత్తరము వికాసప్రాపకము
౧౯. అర్థకామములకు అవధి వినాశపతనములు
౨౦. జాతివికాస సంకోచములు ఇతిహాస జీవమని
౨౧. తారీఖులు పేర్లు కథలు, ఇతిహాసమున గుణీ భూతములు

అని శ్రీ మదక్కిరాజు లక్ష్మీ నారాయణ పుత్ర
........ఉమాకాన్త విద్యాశేఖర కృతియందు
వాఙ్మయ దర్శనమున ప్రాచీన ఖండమున
ప్రథమాధ్యాయమున ప్రథమాలోకము.

**ద్వితీయాలోకము**

౧. అభారతీయము గనుక
౨. సంప్రదాయ విచ్ఛేదకము గనుక
౩. త్యాజ్యము క్రీస్తు శకము
౪. ఆత్మీయము గనుక
౫. అఖండ కాల దర్శనసాధనము గనుక
౬. శ్రుతి స్మృతి పురాణేతిహాస దేశీయ కథాదులనుండి అవిచ్ఛిన్నత్వము ప్రతిపాదించును గనుక
౭. సంప్రదాయ సిద్ధము గనుక
౮. గ్రాహ్యము కలిశకము
౯. అవిశేషమువల్ల కలిశకము కృష్ణశకమని
౧౦. అంతర్భూతము గనుక శాలివాహనము పాక్షికము

పథ అని...........వాఙ్మయ దర్శన ప్రాచీనఖండమున ప్రథమాధ్యాయమున ద్వితీయాలోకము.

**తృతీయా లోకము**

౧. శ్రుతి, కావ్యము, స్మృతి, ఇతిహాసము, పురాణము, శాస్త్రము, వారుణ్యాదివిద్యలు, మిశ్రకృతి, దేశకృతి అని ఆంధ్రుల వాఙ్మయము తొమ్మిది విధములు.

౨. శ్రుతి నిత్యము అధ్యేయమని ప్రాచీనులు

౩. మొదటి యేడు యథాశక్తి అధ్యయనము చేసిన పితరులకు దేవతలకు తర్పణమని యాజ్ఞవల్క్యులు

ఈ పత్రిక సుమారు రెండు సంవత్సరాలు మాత్రమే వచ్చి ఆగిపోయింది.

## ఆంధ్ర సర్వస్వం

కాకినాడలో 1923 లో అఖిలభారత కాంగ్రెస్ మహాసభ జరుగడం తెలుగునాట పెక్కు నూతన ప్రక్రియలకు నారులు పోసింది. ఆ సభతో దేశంలోని వివిధ సాహిత్యజ్ఞులతోను తెలుగువారికి సంబంధం ఏర్పడడంవల్ల డైజెస్ట్ వంటి పత్రికలు అవసరమని పలువురు సాహిత్యప్రియులు భావించారు. ఆ భావన ఫలితమే ఆంధ్ర సర్వస్వము, సారస్వతసర్వము అనే పత్రికలు.

ఆంధ్ర సర్వస్వం ఏడిద వేంకటరావుగారి సంపాదకత్వాన రాజమండ్రి నుంచి 1924 జనవరిలో వెలువడి రెండు సంవత్సరాలపాటు నడిచింది. దీని ముఖపత్రంపై **An Illustrated Monthly Telugu Magazine Published to Depict Andhra Genius** అని ఆంగ్లంలో ఉండేది. "ఆంధ్రుల పూర్వ, ఆధునిక మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సారస్వత కళా పద్ధతులను గూర్చి వ్రాసిన స్వతంత్ర వ్యాసములు సత్కరింపబడును" అని తెలుగులోను, ఆంగ్లంలోను ఉండేది.

సంపాదకులు తమ ఉద్దేశాలను తొలి సంచికలో "ఉపక్రమణిక" అనే శీర్షికలో ఈవిధంగా వివరించారు:

శ్లో॥ విఘ్న ధ్వాంతనివారిణైకతరణి ర్విఘ్నాటవీహవ్యవా
డ్విఘ్న వ్యాళకులోపమర్ధగరుడో విఘ్నేభపంచాననః।
విఘ్నోత్తుంగగిరి ప్రభేదనపవి ర్విఘ్నాబ్ధికుంభోద్భవో
విఘ్నాఘౌఘ ఘన ప్రచండపవనో విఘ్నేశ్వరః పాతునః॥

శ్లో॥ శారదా శారదాంభోజవదనా వదనాంబుజే।
సర్వదా సర్వదా స్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్॥

మ॥ "మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్, సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్"

"రామరాజభూషణకవి"

ఆంధ్రులారా!

భారతదేశ చరిత్రమునందు ఆంధ్రులు చూపిన సామర్థ్యము అద్వితీయము. అదంతయు మరుగుపడి నివురుగప్పిన నిప్పువోలె నున్నది. ఆంధ్రులలో పండితులు, కవులు, గాయకులు, శిల్పులు, రాజనీతి విశారదులు, వారు వీరననేల అందఱును గలరు. వారిని గూర్చి తెలిసికొను భారము మనది.

ఔనిత్యాంగునాటినుండియు ఆంధ్రులు ముందంజవేయు జాతిగనే యున్నారు. గొఱ్ఱెదాటువలె ముందంజయే కాని సింహావలోకనము మాత్రము లేదు. ఒకమూల ఆంధ్రోద్యమము, ఇంకొక మూల గ్రంథాలయోద్యమము, వేరొక మూల స్వరాజ్యోద్యమము. రాష్ట్రీయ సభలను సమావేశము చేయుటకు తొలుదొలుత మొదలిడినది ఆంధ్రులే. గ్రంథాలయోద్యమములో బరోడా రాజ్యము తరువాత ఆంధ్రదేశమును చెప్పవలసియున్నది. స్వరాజ్యోద్యమములో నిఁక చెప్పవలసినదేమున్నది. కేవలము ఆంధ్రాబార్డోలీ అనిపించికొనినది. ఆంధ్రవాఙ్మయమొక అంటు మామిడిపండు. ఉత్పత్తి సంకరమైనను, దాని మాధుర్యమును ఘనతయు నిరుపమానములు. కావుననే త్యాగరాజు ఇతర భాషలయందు కూడ నంత సాహిత్యముండియు ఆంధ్రముననే తన కృతులను రచించెను.

ప్రస్తుతము సంకురుమయ్య ఆంధ్ర పరిశోధనముపైనుండి పోవుచుండెనని ఆనాడు లక్ష్మణరావు చిత్రాడయందు నుడివిన నుడువూరకపోవునే? రుధిరోద్గారి అతనిని లచ్చరాయని, సుబ్బరాయని కూడ తన పాపపుఁబొట్టను పెట్టికొనినది. రక్తాక్షి కడు దవ్వున నుండఁగనే తన తీక్ష్ణదృష్టులచే నీముమ్మర భస్మము చేసినది.

తక్కిన ఉద్యమముల మాట యెట్లుండినను ఆంధ్ర దేశమున పత్రికా ప్రకటనోద్యమము మాత్ర మంత తృప్తికరముగ లేదు. దీనికి కారణం

బూహ్యంబు. ప్రజాపోషణమును ముద్రణ సౌకర్యములును కొంతవఱకు కారణ భూతము అని మా మతము.

ఇవన్నియు పర్యాలోచించి మా మిత్రులుఁ ప్రబుద్ధాంధ్ర పత్రికా సంపాదకులు, పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రోత్సాహమువలన కుతూహలాయత్తచిత్తులమై మేమీ కార్యమునకుఁ గండంగితిమి. దీనిని పోషించు భారము ఆంధ్ర విద్వన్మహామండలిదై యున్నది.

మా రాజమహేంద్రవరము రాజరాజు నాటి నుండియు విద్యాపీఠమై యొప్పుచున్నది. విజయనగరము పిఠాపురము లోనగు పట్టణములలోవలె పండిత మండలిని పోషించుటకు ఈ తావున ఱేడు లేరును లేకుండినను పది మంది ఱేడుల పెట్టగు గౌతమి కలదు. గోదావరి ప్రవహించు తావు లన్నియు వాణీ స్థానములై విజృంభించుచుండ రాజమహేంద్రవరము విద్యాస్థానమగుటలో నక్కఱ మేమి? వాసుదేవశాస్త్రి రత్నకవి, వ్యాసమూర్తిశాస్త్రి, శివశంకర కవి, వీరేశలింగము ఈ పురముననే తమ జీవితముల గడపిరి. వసురాయడు, వేంకటరామశాస్త్రి, కవిరాజు కృష్ణమూర్తిశాస్త్రి, సింహకవి ఈ పురము నలంక రించి నన్నెయు వాసియు దెచ్చుచున్నవారు.

తుద నొక మాట. భారత భూమి పుణ్యవశమున గాంధీ మహాత్మునకు స్వస్థతగనున్నది. త్వరలో జయలు నుండి విడుదల చేయఁబడు ననుటకు సూచనలు గాన్పించుచున్నవి.

అనేకులు అనేక విధముల పరిశోధనము చేసి మన పూర్వుల ప్రతిభను ప్రకాశపఱుచుచున్నారు. వారు చేపట్టిన కార్యమునకు ఈ మా ఆంధ్రసర్వస్వము చాల తోడ్పడగలదు. ఈ సంచికకు వ్యాసములను బంపిన వారికి మా కృతజ్ఞతా పూర్వకవందనములు. ముందు కూడ ఆంధ్ర దేశాత్మకములగు విషయములను గూర్చిన వ్యాసములను తరుచు వ్రాసి పంపి పత్రికను పోషింపఁ గోరెదను.

ఇట్లు

పత్రికాధిపతి

దీని విశిష్టతలు చాల ఉన్నాయి. వాటిలో ఒకటి: పూర్వపు సర్వేయర్ జనరల్ కర్నల్ కాలిన్ మెకంజీ సేకరించిన స్థానిక వృత్తాంతాల నుంచి కైఫీయత్‌లను ప్రచురించడం. విఖ్యాత విద్వాంసులు కస్తూరి శివశంకరశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారల స్వీయచరిత్రలు కూడా ఈ పత్రిక ప్రకటించింది. ఆంధ్ర సారస్వత నిర్మాతలు పేరుతో ఇంగ్లీషులో **Men of letters series** మాదిరిగానే తెలుగులో తెలుగు కవుల గురించి గ్రంథ పరంపర

వెలువరించాలని ఈ పత్రిక తలపోసింది. ప్రతి సంచిక వెనుక అట్టమీద యీ కోరికను ప్రకటన రూపంగా వెల్లడిస్తూ వచ్చింది ఈ పత్రిక.

ఆ ప్రకటన ఈ విధంగా ఉంది :

"ఆంధ్ర వాఙ్మయమిప్పుడు నవీనాలంకారములు ధరించుచున్నది. నిశిత ప్రతిభులగు ఆంధ్ర యువకులనేకులు స్వకీయ వాఙ్మయ పోషణమున చూపు చున్న పరమోత్సాహము ప్రబోధము పుట్టించునదిగా నున్నది. అనేకులు అనేక విధముల పాటుపడుచున్నారు. అయితే ఇటీవల కాలధర్మమునొందిన మహా కవులందరి జీవితములను ఇంగ్లీషునందలి Men of letters series పద్ధతిని ప్రకటింప దలంపుగలదు. సమర్థులగు లేఖకులు పూనుకొన్నచో సొమ్ము యిచ్చి పుచ్చుకొని ప్రకటించెదము. ఇది పోటీ పరీక్ష కాదు. ఇంటింటికొక పూవు ఈశ్వరునికొకమాల. ప్రతి గ్రంథము క్రౌన్ సైజున చిన్న అచ్చుతో రమారమి 250 పుటలు ఉండవలెను. అందు నూరు పుటలు కవియొక్క జీవితమును 150 పుటలు కవికృత గ్రంథవిమర్శనమును నుండవలెను. వ్రాయదలంపుగలవారు మాతో ఉత్తర ప్రత్యుత్తరములు నడుపగోరెదము. వివరములు జాబుల ద్వారా తెలిసికొనవచ్చును. ఎడిటర్, ఏడిద వెంకటరామ."

సంపాదకుల ఉపక్రమణి, ప్రకటనలకు అనుగుణంగానే ఈ పత్రిక కొనసాగింది. మొదటి సంపుటి మొదటి సంచికలోనే కాకినాడ కాంగ్రెస్ మహా సభల విశేషాలను ప్రచురించింది. మల్లాది సూర్యనారాయణశాస్త్రి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, న్యాపతి సుబ్బారావు పంతులు, పులుగుర్త లక్ష్మినరసమాంబ, ఆకుండి వేంకటశాస్త్రి, మహాభాష్యం సుబ్బారాయుడు, వడ్డాది సుబ్బారాయకవి, మహావిద్వాన్ చావలి యజ్ఞేశ్వర సోమయాజిశర్మ, చిలుకూరి నారాయణరావు, అయ్యల సోమయాజులు, వేంకట సుబ్బారావు మున్నగు తత్కాల ప్రముఖులు వ్యాసాలు వ్రాసేవారు. మహాభాష్యం సుబ్బారాయుడుగారు దేశభాషలు శీర్షిక కింద మనదేశంలోని వివిధ భాషలను గురించి వ్రాసిన వ్యాసాలు శాస్త్రీయంగా నేటికీ ప్రామాణికంగా కనిపిస్తాయి. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు నిడుదవోలు వెంకటరమణ అనే పేరుతో వ్యాసాలు వ్రాశారు. తమ తొలి వ్యాసం శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులను గురించి అని, అదే తమ తొలి విమర్శనాత్మక వ్యాసమని ఆయన నాతో ఒకమారు ప్రసంగవశాత్తు అన్నారు. దీనిలోని మొదటి పుటను ఇక్కడ ఉదాహరిస్తున్నాను:-

**శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యుల వారి జీవితము**

[నిడుదవోలు వేంకటరమణగారు బి.యే.]

శబ్దరత్నాకరమను నాంధ్ర నిఘంటువును రచించి, యాంధ్ర భాషకు

ములువరాని సహోపకారముఁ గావించి. యశఃకాయులైన శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులుగారి నామమును విననివా రాంధ్రులలో నరుదు. ఆంధ్ర పాణిని నాఁబరఁగిన చిన్నయసూరి వెనుక దాక్షిణాత్య పండితులలోఁ జిరస్మర ణీయుఁడగు నీ పండితుని చరిత్ర మింతదనుక నెవ్వరునుఁ దెల్పినట్లు కాన రాదు ముప్పది నలువది యేండ్ల క్రిందట గతించిన మన కాలపుఁ బండితుల చరిత్రములే మనకు తెలియకయుండ నెన్నియో వందల యేండ్ల క్రింద జీవించి యున్న పండిత కవుల చరిత్రములు మనకు గగనారవిందములగుచున్నవని చెప్పుటలో నాశ్చర్యమేమి గలదు? కావున నాకుఁ దెలిసినంతవరకు నీ చరిత్ర మును వ్రాసి ప్రకటించుచున్నాఁడను. విజ్ఞులు క్షమించెదరుగావుత!

సీతారామాచార్యులుగారు నాగపట్టణమున క్రీ.శ. 1827 సంవత్సరమున జన్మించిరి. వీరు ద్రవిడదేశ వైష్ణవులు. వీరు జననమాదిగ నాగపట్టణముననే నివసించుచుఁ బండితోత్తముఁడగు తమ తండ్రిగారికడ విద్యాభ్యాసము గావించిరి. అంతఁ గొంత కాలమునకు బాల్యావస్థ వీడి వయః కాలము ప్రారంభమైన తరువాత యథోచితముగఁ గవితాధార యొకింత గలుగఁ తమ స్వస్థలమున నన్వర్థాభిధానుఁడై యెసఁగుచున్న శ్రీ సౌందర్యరాజ స్వామిని నుతింపఁ దలంపుఁగొని యేతన్నామాంకితంబుగ నొక కంద పద్య శతకము రచించిరి. ఈ శతకము శతక కవి చరిత్రకారులకుఁ జిక్కుటచే దాని యందుండి యాచార్యులవారి ప్రథమకవనశైలినిఁ దెల్పుటకై [1] మూఁడు పద్యము లుదహరించుచున్నాఁడను.

క. హరశూల నామశరదా
శరదాసితగాత్ర భక్తజనహిత వరదా!
వరదా మరుచిర సురదా
సురదాస్య మహిత సురాజ సుందర రాజా! 88

క. అగణితచరిత! గదాగ్రజ!
జగదీశ! జగన్నిదాన! శాంతాకారా!
ఖగరాజ ఘనస్యందన!
నగధర! హరితేజ! నాగనగరీరాజా! 80[2]

---

1. శతక కవుల చరిత్రము, నూతనముగఁ బ్రకటితము.
2. ఆంధ్ర సర్వస్వం - సంపుటి 2, సంచిక 3.

కళింగసీమలోని శ్రీకాకుళంజిల్లా ఆనందపురంలో జన్మించి, చాళుక్య సీమలోని రాజమహేంద్రవరంలో జీవిక ప్రారంభించి, రాయలసీమలోని అనంతపురంలో మనుగడ చెల్లించి ఆంధ్రదేశ సమైక్యానికి ప్రతిరూపమైన డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు, మద్రాసు జనరల్ ఆస్పత్రిలో (1942 జులై 22న) మరణశయ్యపై "ఆంధ్రరాష్ట్రం రావాలి, వస్తుంది; విశాలాంధ్రభాషకు వ్యాకరణం వ్రాయాలి; విశాలాంధ్రభాషకు నిఘంటువు సిద్ధపరచాలి" అని సన్నిపాతావస్థలోనూ కలవరించిన నారాయణరావుగారు, ఆర్యద్రావిడ భేదాలు శ్వేతజాతి పరిపాలకులు తెచ్చిపెట్టిన చిచ్చని హృదయపూర్వకంగా విశ్వసించిన నారాయణరావుగారు ఆంధ్ర సర్వస్వంలో పెక్కు వ్యాసాలు, కవితలు ప్రచురించారు. ఆయన ఉపనిషత్తులను గీతాలలో అనువదించారు; అధర్వణ వేదం అనువదించారు. జీవితమంతా - కొనఊపిరి వరకు తెలుగుభాషా వాఙ్మయాలకే అంకితం చేశారు. ఆయన ఈ పత్రికకు వ్రాసిన ఈశావాస్యోపనిషత్తు అనువాదంలోని కొన్ని పద్యాలు ఉదాహరిస్తాను:-

## ఈశావాస్యోపనిషత్తు

(చిలుకూరి నారాయణరావుపంతులు బి.ఏ.యల్.టి.గారు)

తేటగీతలు

జగతియం దెచటఁజూచిన-సర్వదేశ
వర్తియై యీసఁడుండుట-నలవఁ,గర్మ
ములను విడచి యాత్మనుపట్ట-వలయు, నెపని
ధనము నైనను గోర.గఁ- దగదయెపుడు॥

ఆత్మతత్త్వంబుఁ దెలియ నీ-కలచి కాక
యున్నఁ గర్మలఁ జేయుచు-నుంట లెస్స;
కాన, కర్మ బంధనకారి-కానియట్లు
కోరి భువి నూఱువర్షముల్-గడుపవలయు॥

ఆత్మహంతలౌ నజ్ఞాను-లాసురంబు
లను తమోవృత లోకంబు-లందు, మృత్యు
కాలమునఁ గోరికొాను జన్మ-కారణముగ
దేహములఁ దాల్చుచుందురు-తెరపిలేక॥

అచలమై యద్వితీయమై-నట్టియాత్మ
మనసుకంటె జవయమై-ఘనుట, నింద్రి
యముల కందకదాఁటు; న-య్యాత్మ యందు
ప్రాణ మింద్రియంబుల నేఱు-పఱచుచుండు॥

అచలమయ్యును చలమౌచు-నలరుచుండు
దూరమైయుండి దగ్గఱఁ-దోఁచుచుండు
నన్నిటికిలోన వెలయున-దయ్యు నాత్మ
వరలుచుండు వానికి బాహ్య-వర్తియగుచు॥

అన్ని భూతంబులను దన-యందుఁజూచి
యన్ని భూతంబులందుఁ ద-న్నరసికొనుచు
జ్ఞానియగునట్టి వాఁడాత్మ-సర్వగతుఁ డ
టంచుఁ దెలిపి యెవ్వనిని నిం-దింపఁబోఁడు॥

జ్ఞాని యగువాని కెప్పుడు-సర్వభూత
ములును దనయందె కాన్పించి-ముదముఁగూర్చు
నిట్టి యేకత్వమునె యెల్ల-యెడలఁ గాంచు
జ్ఞానికిని మోహమేమి శో-కంబు నేమి॥

ఆత్మ తేజస్వి యశరీర-మవ్రణంబు
శుద్ధమును భావరహితమౌ-చొప్పుఁదాల్చి
యంతటను వ్యాపనముఁ బొంది-యలరుచుండు;
కవియును, మనీషియును బరి-భువు, స్వయంభు
వైన యీశుండు సర్వజ్ఞుఁ-డగుటఁజేసి
శాశ్వత బ్రహ్మకల్పముల్-జరుగుకొఱకు
నర్థముల వేఱుపఱచె య-దార్థముగను॥

జ్ఞానమును వీడి కర్మంబు-సలుపు వార
లంధకారంబునంబడి-యందె యుందు;
రంతకంటెఁ జీఁకటిఁ బ్రవే-శింతు రెపుడు
దేవతల నుపాసించెడి-ధీ రహితులు॥

జ్ఞాన కర్మల భేదంబు-సరిగ మాకు
నెఱుకచేసిన యాచార్య-లిట్టివిద్య
యొక్క-ఫలము నవిద్య వే-ఱొకటి, యిచ్చు
ఫలమనఁగ విందు మా ధీర-వరుల నుడుల॥

దేవతాజ్ఞాన మనుదానిఁ-దెలిసి కొనుచు
కర్మ విజ్ఞానమును గూడఁ-గలుగువాఁడు
కర్మచేతను మృత్యువుఁ-గడచిపోయి
యమృత రూపంబు విద్యచే-నందుచుండు॥

ప్రకృతి మాయాస్వరూపమై-వరలు కతనఁ
జీఁకటినిఁ జొత్తు రద్దాని-సేవఁజేసి
మాయవలనను బుట్టు బ్ర-హ్మంబుఁగొలిచి
యంతకంటెఁ జీఁకటిఁ బ్రవే-శింతు రెపుడు॥

సంభవముఁదాల్చు బ్రహ్మ యొ-సంగు నొక్క-
ఫలము, సంభవరహితమ-వ్యాకృతంబు
నిచ్చు వేఱె ఫలంబని-యెఱుఁగఁబడియె
ధీరు లాచార్యు లెప్పుడు-తెలియఁ జేయ॥

కార్య రూపుఁడౌ బ్రహ్మను-గలయఁ గొలిచి
మఱియు నవ్యాకృతంబును-మదిని నిలిపి....

## సారస్వత సర్వస్వం

సరిగా ఇదే కాలంలో - అంటే 1924 లో ఏలూరిపాటి రామభద్ర చయనులుగారి సంపాదకత్వాన సారస్వత సర్వస్వం అనే సాహిత్య పత్రిక వెలువడింది. చిలుకూరి నారాయణరావుగారు, జనమంచి శేషాద్రి శర్మగారు వంటి ప్రముఖులు దీనిలో వ్రాసేవారు. ఇది కూడ రెండేళ్ళు మించి రాలేదు.

మిథ్యాపవాదం అనే గిడుగురామమూర్తిగారి రచన ఈ పత్రికలో వచ్చింది. ఇది వేదం వెంకటరామశాస్త్రిగారిపై విమర్శ.

## ప్రబుద్ధాంధ్ర (1924 - 36)

కథక చక్రవర్తి, విమర్శక శిరోమణి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వంలో రాజమండ్రి నుంచి వెలువడిన ప్రబుద్ధాంధ్ర గిడుగు

రామమూర్తి పంతులు గారి వ్యవహార భాషావాదాన్ని సమర్థించింది. శ్రీపాద వారి అపూర్వమైన కథలెన్నో ఇందులో వెలువడ్డాయి. శాస్త్రిగారికి హిందీ అన్నా, కాంగ్రెసన్నా, ఖద్దరన్నా కూడా గిట్టేదికాదు. 'హిందీవల్ల తెలుగుకు జరుగుతున్న అపకారం' అని ఒక శీర్షిక కూడా ఈ పత్రికలో శాస్త్రిగారు నిర్వహించేవారు. హిందీ వ్యతిరేకోద్యమానికి ఆ రోజుల్లో ఈ పత్రిక నాయకత్వం వహించిందని చెప్పవచ్చు. 1920 నాటికే అభ్యుదయ అనే పత్రికను కూడా శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రారంభించారు కాని అది ఎక్కువనాళ్ళు రాలేదు.

శాస్త్రిగారు వేమన జయంతిని గురించి చేసిన సూచన చాల ప్రశంసనీయమైంది. దానిని ఇక్కడ ఉదాహరిస్తున్నాను :-

## వేమన జయంతి

(పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు)

గోదావరి జిల్లాలో నాలుగు సంవత్సరములనుండి మహోత్సాహముతోడను అవిచ్ఛిన్నముగను జరుపఁబడుచుండిన వేమన జయంతి యేలనో యీ సంవత్సరము విస్మృతమైనందున రెడ్డిరాణి పత్రికయొక్క ఫిబ్రవరి సంచికయందలి శ్రీయుతులు కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డిగారి లేఖ చూచునంతవఱకును మా కా విషయమును గుఱించి యేమియు కల్పనలే తోఁచలేదు. వేమన మహాకవి. జీవన్ముక్తుఁడైన కవి. నిరుపహతమైన తన కవితాధారను ప్రత్యేకమార్గమున బఱపి "న భూతో న భవిష్యతి" యన్న మాట కుదాహరణమైన కవి. వాస్తవముగా ఆంధ్రదేశమున ఒక్క వేమన్నకు మాత్రమే సర్వతోముఖమయిన ప్రజాదరము గలదు. అక్ష్యరాస్యులైనవా రెల్లరు నాంధ్రులు జాతిమత భేదములు లేక అతని నాదరించుచున్నారు.

వేమన జయంతిని చేయవలసినదని రెడ్డి సంఘమునందలి ప్రముఖులు ఆజ్ఞాపించిరి. ప్రతి సభయందును ఈ విషయమును వారు తీర్మానించుచున్నారు. అనపర్తిలో జరిగిన అయిదవ రెడ్డిమహాజనసభలో ఈ తీర్మానము చేయఁబడినప్పుడు దానిని గుఱించి మా పత్రికలో (౧౬-౧౧-౧౯౨౦) ఇట్లు వ్రాయఁబడియున్నది.

"........ఒక సంస్కృత శ్లోకము దొరికినదనియు, దానినిబట్టి వేమన వర్ధంతి దినము జనవరి ౧౯ వ తేదీగా ఏర్పడినదనియు, అధ్యక్షులు తెలిపిరి. ఇది యింకను నిశ్చయము గాలేదనియు త్వరలో నిశ్చయించి తెలిపెదమనియుఁగూడ వారు చెప్పిరి; గాని ఆదినమును ఇంగ్లీషుమాసములలో చేర్చక

మన చైత్రాదిమాసములలో ప్రతిపదాది తిథులయందే నిశ్చయించుట శ్రేయస్కరము."

ఈ మాటలు వ్రాసినపుడే ఈ సలహా యంగీకరింపఁబడునను నాశ మాకు లేదు. రెడ్డిసభను ఏర్పఱచినవారికి కులాభిమానము ఉన్నది; గాని జాతీయ సంప్రదాయములయెడల అదరము ఉన్నట్లు చెప్పలేము. ఉన్నచో సంస్కృత శ్లోకమునందు ఉన్న తిథినే చెప్పెదరు గాని దానిని ఇంగ్లీషులోనికి మార్చి యిట్లు రసాభాసము చేసియుండరు. మన తిథులు ఇంగ్లీషు తేదీలతో మార్చినచో అసందర్భములు తటస్థించును.

"అపారమైన శ్రమపడి వేమన చరిత్రమును వ్రాసినవారికిగూడ వేమన జనన తిథి యిది యని నిశ్చయము గలుగలేదు. ఏమి చెప్పుటకును వారి కాధారబవములు దొరకలేదు. కొందఱు చరిత్రకారులు ఈ విషయమున నిరాశనుజూపి ఈ ప్రయత్నములు మానుకొనుట మంచిదని గూడ చెప్పి యున్నారు. ఈ కారణమువలన ఈ జయంతిని జనవరి ౧౯ వ తేదీని చేయవలసినదని యెట్లు నిర్ధారించుటః" సుబ్బారెడ్డిగారి ప్రశ్న యిది.

దీనిని మేము త్రోసివేయజాలము. జనవరి ౧౯వ తేదీయే గాక ఆ నెలయంతయు కర్షకులకు ఆహారనిద్రల కేని తీరిక యుండని సమయమని వేంకట సుబ్బారెడ్డిగారు చెప్పుచున్నారు. ఈ సంగతి అందఱు నెఱింగినదే. కావున సుబ్బారెడ్డిగారు వ్రాసినట్లు చైత్రశుద్ధ నవమినాఁడును—కాకున్న ఇట్టి మఱియొక శుభదినమునందును ఈ జయంతిని ఏర్పఱుచుట మంచిదని తలచెదము.

(ప్రబుద్ధాంధ్ర)

**సంపాదకులకు గిడుగువారి సలహా**

ప్రబుద్ధాంధ్ర వ్యవహార భాషకు పెట్టని కోట అయి నిలిచింది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారే కాక వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలయిన మహా పండితులూ వ్యవహార భాషావాదాన్ని సమర్థించారు. గిడుగువారు 1934 ఏప్రిల్ ప్రబుద్ధాంధ్ర సంచికలో "తెలుగు పత్రికల సంపాదకులకు" అనే శీర్షికతో ఒక వ్యాసం వ్రాశారు. అది పత్రికలవారిని ఉద్దేశించింది గనుక కొంతభాగం ఇక్కడ పొందుపరుస్తున్నాను :-

"ఇంగ్లీషువారు ఇంగ్లీషు వార్తాపత్రికలను చదివినట్లు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మొదలైన వార్తాపత్రికలలోని సంపాదకీయ వ్యాసములున్ను, గ్రాంథికాంధ్రమున రచించిన ఇతర వ్యాసములున్ను, జాబులున్ను తెలుగువారు చదవలేరు. ఈ విషయము అనేకసార్లు పరీక్షించి చూచినాను. ఇంగ్లీషు నేర్చిన

తెలుగువారయినా ఇంగ్లీషు వార్తాపత్రికలు చదివినట్లు సుళువుగా తెలుగు వార్తా పత్రికలు చదవలేరు. ఇందుకు కారణం తెలుగు అక్షరములు చదవటము వారికి అలవాటు లేకపోవడము కాదు; గ్రాంథికాంధ్రము సుపరిచితము కాక పోవడము. తెలుగు పత్రికలన్నీ తెలుగుదేశమందున్న తెలుగువారందరికీ తెలియవలసిన విషయములు తెలియజేసి, వారిని ఉద్ధరించడమునకు పుట్టినవి; గాని పండితుల కోసము పుట్టలేదు. పత్రికా సంపాదకులు ప్రాచీనాంధ్ర భాషా పాండిత్యము గలవారైనా వారి పాండిత్యము వార్తాపత్రికలలో ప్రకటించడము వ్యర్థ ప్రయాసము. ప్రజాస్వామిక పరిపాలనము ఏర్పడ్డ దేశములలో ప్రఖ్యాతి పొందిన వార్తాపత్రికల సంపాదకులు అట్టి పాండిత్య ప్రకటనము వట్టి వంఛమని నిందించినారు. వాస్తవమయిన పాండిత్యము తక్కువయిన కొలదీ పండిత మానుల వ్రాతలో వంఛము అధికముగా ప్రకటిస్తారని ఆక్షేపించినారు. తెలుగు వారిలో నూటికి పదిమందైనా సంతకము చేయగలవారు లేనప్పుడు వార్తా పత్రికలలోని సంపాదకీయ వ్యాసములు చదవగలవారు ఎందరుంటారు? పత్రికలలోని వార్తలు వినడమునకు తెలుగుదేశమునందు ప్రజలకు అభిలాష ఈ పదియేళ్ళలో ఎక్కువయినది. పట్టణములలోనే కాక, పల్లెలలో కూడా పురాణము చదివించి వినడము నేను స్వయంగా చూచి సంతోషించినాను. అయితే వారి శ్రమకు అనురూపమైన ఫలము కలుగలేదు. భాష సుపరిచితము కానప్పుడు ఉత్సాహభంగము అనివార్యము గదా!

"అఖిలాంధ్ర భారతిని ఆంధ్ర సారస్వత పీఠముమీద కూర్చుండబెట్టి ఆ దేవికి పట్టాభిషేకము చేసే గౌరవము ఆంధ్రపత్రికాధిపతులు పొందుదురు గాక అని కోరుతున్నాను."

ఈ విధంగానే మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు (కవిగారు) కూడ "మన తెలుగు వార్తాపత్రికలలో వాడే భాష" అనే వ్యాసం ప్రబుద్ధాంధ్ర 1935 సెప్టెంబరు సంచికలో వ్రాశారు. దానిలో వ్యవహార భాషా ప్రయోజనాన్ని నొక్కి చెప్పారు.

## వజ్రాయుధం

ప్రబుద్ధాంధ్ర 1935 సెప్టెంబర్ సంచికలో మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు (కవిగారు) "మన తెలుగు వార్తాపత్రికలలో వాడే భాష" అనే వ్యాసం వ్రాసి, వ్యవహారభాషా ప్రయోజనాన్ని ఎలుగెత్తి చాటారని ఇదివరకే అన్నాను.

దీన్ని ఎదుర్కోడానికి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 1925 జనవరి నుంచి గ్రాంథికాంధ్ర వేదికగా "వజ్రాయుధము" అనే పత్రికను వెలువ

రించారు. ఆ పత్రిక రెండో సంచికలో "గ్రామ్యాచార్యులు" అనే పేరుతో గిడుగువారిని నిందిస్తూ వ్యాసం వ్రాశారు. మూడో సంచికలో గిడుగువారు వజ్రాయుధం సంపాదకులను సవాలు చేస్తూ వ్రాసిన లేఖ ప్రచురితమైంది. దానిపై గిడుగువారికి ప్రత్యుత్తరం ప్రచురితమైంది. ఆ ప్రత్యుత్తరం శ్రీపాద వారిది. నాలుగో సంచికలో (1925 ఏప్రిల్) గిడుగువారి బహిరంగలేఖ ఉంది. భాష తగవు పండిత పరిషత్తు తీర్చాలని, కొందరు పండితులతో పరిషత్తు ఏర్పరచాలని గిడుగువారు సవాలు చేశారు. కాని. గిడుగువారు చెప్పినట్లు పరిషత్తులో నలుగురు చాలరని ఇరవై అయిదుమంది ఉండాలని శ్రీపాదవారు ప్రకటించారు. దానిని ఐదో సంచికలో గిడుగువారు ఖండించారు. ....ఈ దిగ్దంతులు నాడు ప్రచురించిన వ్యాస పరంపరలు వాదోపవాద రూపంలో పెల్లుబికిన రసఝురులు, వాటిని ఆస్వాదించిన పాఠక రసజ్ఞుల హృదయాలు తన్మయత్వంతో ఓలలాడాయి.[1]

## రెడ్డిరాణి (1924 - 32)

దీని పేరును బట్టే ఇది రెడ్ల సంగతి తెలిపే పత్రిక అని స్పష్టం. దీనిని మల్లిడి సత్తిరెడ్డిగారు తూర్పుగోదావరి జిల్లా రాయవరం నుంచి ప్రచురించేవారు. రెడ్డిరాజుల చరిత్రకు సంబంధించిన పెక్కు శాసనాలు మొదలయిన వాటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిలో ప్రకటించారు. ప్రసిద్ధ పండితులు శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ పత్రికలో భారతానువాద సమస్యలు చర్చించారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కూడా రెడ్డిరాజుల చరిత్రకు సంబంధించిన రచనలు చేశారు.

దీని తొలి సంచిక 1923 అక్టోబర్‌లో వెలువడింది. దీని పోషకులు, సహాయకులు, అభిమానులు అందరూ రెడ్లే. ఈ పత్రిక 6వ సంచికలో (1924 మార్చి) శ్రీ పూతల పట్టుశ్రీరాములురెడ్డిగారు "భారతాయోధన ప్రథమ దినచర్య" అనే వ్యాసం వ్రాశారు. దానిలో ఆయన పెక్కు సందేహాలు తెలిపారు. "అమావాస్యనాడు యుద్ధ ప్రారంభమని లోకులాడకొను వాక్యంబును, నరవ భారతమున నా విషయమే సహదేవ సంబంధంబగు నొక పెద్దగాథగా జెప్పబడి యుండుటయు, పదునాలవనాటిరాత్రి పాంబాలుర జంపక కవచము విడువనని ద్రోణాచార్యుడు ప్రతిన యొనర్చి కరదీపికా సాహాయ్యంబున ప్రబలయుద్ధ మొనర్చుట, వేకువను జంద్రోదయమగుట యనుకథకు మిక్కిలి విరుద్ధంగా

---

1. మరోసారి గిడుగు రామమూర్తి - శ్రీ వి. లక్ష్మణరెడ్డి వ్యాసం నుంచి.

నుండుటచే నమ్మనర్హముగాదు. ఉద్యోగపర్వంబున శ్రీకృష్ణుడు కర్ణునితో "నేడెనిమిది దినముల కమావాస్య వచ్చునని నాటికి భండనము గావలయు"నని చెప్పియుండుట యాపై విషయమున కాధారము. ఈ యొక చిన్న వాక్యమును బట్టి యమావాస్యయే స్థిరమన్నచో బదునాలవనాటి యుద్ధగాథయంతయు బొల్లగు........ భారత సావిత్రికారుడు "మార్గశిరమాసమున శుక్లపక్ష త్రయోదశీ దినమున భరణి నక్షత్రంబున భారత యుద్ధము ప్రవృత్తంబయ్యె"నని వ్రాకుచ్చి యున్నాడు...."

అమరావతిలోని నాగబు శాసనం, లక్ష్మీపుర శాసనం, అహదనకర శాసనం మొదలయిన శాసనాలు ప్రచురించి ఎన్నో అపూర్వ విషయాలు తెలుగు వారికి తెలిపిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రెడ్డిరాణిలో పెక్కు శాసనాలు - రెడ్డిరాజులకు సంబంధించినవి ప్రచురించి వివరించారు. వాటిలో ఒకటి "మంచాళ్ళ తామ్ర శాసనం." ఇది వేమారెడ్డి శ్రీవల్లభుడనే చతుర్వేదపారగునికి భూమిదానం చేసిన శాసనం. దీని ప్రారంభ భాగాన్ని ఇట పొందుపరుస్తున్నాను:-

### రెడ్డి రాజుల చరిత్ర

[వేటూరి ప్రభాకరశాస్త్రిగారు]

మ. మహనీయంబులుగ నంధ్రభూవలయముం బాలించుచుం బ్రాజ్ఞులై
బహు కావ్యంబులు చెప్పుచున్ మఱియుఁ జెప్పంజేయు చాముష్మిక
స్పృహతో ధర్మము లాచరించుచు జగజ్జేగీయమానంబుగా
నహముల్ పుచ్చిన రెడ్డి రాజుల సముద్యత్కీర్తిఁ గీర్తించెదన్.

శృంగార శ్రీనాథము.

ఇంతవఱకుఁ గొండవీడు రాజమహేంద్రవరము మొదలగు దేశముల రాజ్యమేలిన రెడ్డి రాజుల చరిత్ర కొంత కొంతగా వెల్లడి యగుచు వచ్చినది. కాని యది యింక నెంతో బయల్పడవలసియున్నది. అచ్చుపడకుండ రెడ్డి రాజుల శాసనము లెన్నో యట్టెయున్నవి. అందు గొన్నింటికిఁ బ్రతులే కాని మూలములు కానరాకున్నవి. నూట యిరువది యేండ్లకు ముందు మెకంజీ దొరగారి నాళ్ళలో నంధ్రదేశము నయ్యెయెడల నుండి మూలములను బట్టి వ్రాయించి తెప్పించిన శిలా తామ్రశాసనముల వ్రాఁతప్రతులు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో పెక్కులున్నవి. కాని వానిలో నెన్నింటికో మూలములగు తామ్రశాసనము లిప్పుడు కాగులుగానో చెంబులుగానో మాఱిపోయినవి. పయి పుస్తకశాలలోని వ్రాఁతప్రతులు కూడ శైథిల్యము చెందుచున్నవి. రాగిరేకులే

పోఁగా పీచు కాగితములా నిలుచును? ప్రాచ్యలిఖిత పుస్తకశాల మొదలగుచోట్ల నిప్పుడున్న వానినేని ప్రకటింప కుపేక్షించినచోఁ జరిత్ర మింకను క్షయింపఁ గలదు.

ఈ కారణమున నిప్పటికి నేను జూడఁగలిగిన రెడ్డి రాజుల శాసనముల గొన్నిటిని ప్రకటింపఁ బూనితిని. ఒక్కొక్క శాసనమునకు కడపట నేమేమి విశేషము లందుఁ గలవో సంగ్రహముగాఁ బేర్కొందును. కొన్ని శాసనములకు మూలము లిప్పుడు దొరకవు గనుక, ప్రతివిలేఖకాదుల మూలమున నిప్పటి వ్రాఁత ప్రతులలో దొరలిన తప్పులను సనిపఱుప సాధ్యములేదు. ఉన్నవి యున్నట్లే ప్రకటింతును. స్పష్టములయిన తప్పులనే సంస్కరింతును.

## మంచాళ్ళ తామ్ర శాసనము

శ్లో॥ వరాహవదనో హరి
ర్వరవసుంధరాకన్యకాం
కళాధరకళోల్లస
ద్విమల దంష్ట్రికాగ్రే వహన్,
జగంతి పరిపాలయ
న్నలఘు విక్రమప్రక్రమ
స్తనూరుహబిలభ్రమ
జ్జలలవాయితాంభోనధి॥

శ్లో॥ భ్రమద్భ్రమరసుందరీ
సరసదుంబనోచ్చుంబన
స్రవన్మదకపోలయు
క్ప్రసృతకర్ణతాళద్యుతిః
సముద్యదరుణ ప్రభా
లలితవామ భాగస్ఫుర
చ్ఛవి ర్గణపతి ర్ముహుః
స్ఫురతు విఘ్నవిధ్వంసనే॥

శ్లో॥ వాణీవామకుచాగ్రకోణనినద
త్బాలేందురేఖోల్లస
ద్వీణా వాద వినోదమోదితశుకత
స్ఫూర్జత్కరాగ్ర ప్రభా,

అత్యుత్తుంగనితంబబింబయుగళీ
　　శ్రీమద్విశుద్ధాంబరా
రాజీవాయతలోచనావతు సదా
　　రారానిశేశాననా॥

## కళ

ప్రముఖ న్యాయవాది (తర్వాత మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి( శ్రీ పాకాల రాజమన్నారుగారు కళకు సేవ చేయాలనే ఉద్దేశంతో 'కళ' అనే పత్రికను మద్రాసు నుంచి ప్రచురించారు. ఇది 1924 నుంచి 1927 వరకు నడిచింది. ఇది ఉదాత్తమయిన సాహిత్యస్థాయిలో సేవ చేసింది. దీనిలో మానవల్లి రామకృష్ణకవి, కొమఱ్ఱాజు లక్ష్మణరావు వంటి పండిత పరిశోధకులు వ్రాసేవారు. దీనికి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరోక్షంగా సంపాదకులు. ఆయన దీనిలో నాటకకళ మొదలైన వ్యాసాలు వ్రాయడమేకాక నాటక ప్రదర్శనల సమీక్షలు కూడ వ్రాశారు. 'కళ'కు ప్రభాకరశాస్త్రిగారు చేసిన సాహాయ్యాన్ని రాజమన్నారుగారు పుస్తక ప్రపంచంలో 'నా కొత్త పంథా' అనే వ్యాసంలో ఇలా ప్రశంసించారు:-

"కళపత్రిక ద్వారా నాకు పరిచితులైన మహనీయులలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారొక. అతని పరిశోధన సామర్థ్యం, అతని సాహిత్య విమర్శ ప్రావీణ్యం అసమానం. అతడు విద్వాంసుడు మాత్రమేకాదు - రసికుడు సహృదయుడు కూడ. అతని ప్రతిభను కొత్తమార్గంలో వినియోగించడానికి నేను పూనుకున్నాను. అదృష్టవశాత్తు నాయత్నం సఫలమైంది. నాటక ప్రదర్శనం గురించి వారిచే వ్యాసాలు వ్రాయించాను. అప్పుడు ఏలూరు నాటక సమాజంవారు మద్రాసులో నాటకాలు ప్రదర్శించారు. సావిత్రి, శకుంతల, రాధాకృష్ణ (పానుగంటి వారిది), కృష్ణతులాభారం మొదలైనవి. ఆ నాటకాల్లో పాల్గొన్న నటవర్గంలో చేరిన ప్రఖ్యాత నటులు యడవల్లి సూర్యనారాయణ. అద్దంకి శ్రీరామమూర్తి, ఉప్పులూరు సంజీవరావు, పారుపల్లి సుబ్బారావు మొదలైనవారు. వీరి అభినయాన్ని విమర్శిస్తూ వ్యాసం వ్రాశారు 'కళ' కోసం ప్రభాకరశాస్త్రిగారు. నా ప్రార్థన పాటించి నిష్పాక్షికంగా, నిర్భయంగా, నిశితంగా రచించిన వీరి విమర్శ ఒక చిన్న తుఫాను లేవదీసింది. వీరి అభిప్రాయాన్ని కొందరు ప్రశంసిస్తూ, కొందరు ఖండిస్తూ వ్యాసాలు వ్రాశారు. ఒకటి రెండు అట్టివి 'కళ'లో ప్రకటించాను. కొన్ని ఇతర పత్రికల్లో పడ్డవి. ఇటువంటి నాటక ప్రదర్శన విమర్శములు పాశ్చాత్యదేశాల్లో సామాన్యంగా పత్రికల్లో ప్రచురించడం

సువిదితం. అయితే తెలుగు పత్రికల్లో 'కళ' దారి చూపిందని నా నమ్మకం. శాస్త్రిగారివంటి విమర్శకాగ్రేసరుల సాహాయ్యం లేకపోతే నేనీ కొత్తపంథా తొక్కడానికి సాహసించేవాణ్ణికాను. ఈ విషయంలో శాస్త్రిగారు చేసిన ఉపకారం మరచిపోలేను...."

ఈ కాలంలోనే మద్రాసు నుంచి విశ్వనాథ సత్యనారాయణ, బాపిరాజు, కోలవెన్ను రామకోటీశ్వరరావు ప్రభృతుల నిర్వహణలో జయంతి పత్రిక వెలువడింది. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి వంటి ప్రముఖ పండితులు ఈ పత్రికలో నిఘంటు రచనా పరామర్శలు వంటి ప్రసిద్ధ వ్యాసాలెన్నో ప్రచురించారు.

నవ్య సాహిత్య పరిషత్తు వారి సఖి పత్రిక కూడా ఈ శతాబ్ది మూడో దశకంలో రెండేళ్ళు వచ్చి ఆగిపోయింది. 1920 నాటికే నవ్య సాహిత్య ప్రచారం కోసం తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, కొడాలి ఆంజనేయులు ప్రభృతులు సాహితి పత్రికను ప్రారంభించారు కాని అది ఒక సంవత్సరం మాత్రమే వచ్చినట్లు కనపడుతుంది. విశ్వనాథ, మునిమాణిక్యం, చింతా, నాయని, చలం రచనలు సాహితిలో చోటు చేసుకున్నాయి.

## శ్రీ సాధన

దీని సంపాదకులు పప్పూరు రామాచార్యులుగారు వక్త, రచయిత. అవి సహాయ నిరాకరణోద్యమం తీవ్రతర మవుతున్న రోజులు. గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారత దేశానికి వచ్చి, పర్యటన జరుపుతూ 1920 లో కాబోలు ఆంధ్ర ప్రాంతానికి వచ్చారు. పలుచోట్ల ప్రసంగించారు. గాంధీజీ తాడిపత్రికి వచ్చి ప్రసంగించినప్పుడు పప్పూరు రామాచార్యులుగారు విన్నారు. గాంధీజీ ప్రభావానికి లోనయ్యారు. అప్పుడాయన వయస్సు 23 సంవత్సరాలు. ఆయనకు ప్రముఖ స్వాతంత్ర్యయోధుడు, మహా వక్త, గాంధీ అనుయాయి గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారితో పరిచయం కలిగింది. తత్ఫలితంగా రామాచార్యులు రెవెన్యూ శాఖలో చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా యిచ్చి సహాయ నిరాకరణోద్యమంలోకి దూకి సభలూ, పికెటింగులూ, విదేశ వస్త్ర దహనాలు నిత్య కృత్యంగా చేయసాగారు.

స్వాతంత్ర్యోద్యమ ప్రచారానికి పరమ సాధనం పత్రిక అని గుర్తించిన రామాచార్యులు కొందరు భాగస్వాములతో కలిసి 'పినాకిని' అనే పత్రికను 1922 లో స్థాపించారు. కాని, భాగస్వాములతో అభిప్రాయ భేదాలు రావడంవల్ల దానిని వదలి 'శ్రీ సాధన' అనే వార పత్రికను 1923 లో స్థాపించారు.

ఆయన అమృత హస్త మహిమ ఈ పత్రిక వజ్రోత్సవం చేసుకుని ఆయన కుమారులు శేషాచార్యులుగారి సంపాదకత్వంలో నిరాఘాటంగా ప్రజా సేవ చేస్తున్నది. ఇది రామాచార్యులుగారు క్విట్ ఇండియా ఉద్యమంలో కారాగారంలో ఉన్నప్పుడు కొన్నాళ్ళు ఆగిపోవడం తప్ప మరొక విఘ్నం ఎరుగదు. అరవై సంవత్సరాలకు పైగా మనుగడ సాగిస్తున్న పత్రిక తెలుగునాట మరొకటి లేదు.

శ్రీ సాధన పత్రిక సాధించిన విజయాలు ఘనమైనవి. సంఘంలోని కుళ్ళును, ప్రభుత్వోద్యోగులలోని అవినీతిని శ్రీ సాధన తీవ్రంగా విమర్శించేది. ప్రభుత్వోద్యోగులకు శ్రీ సాధన పత్రిక అంటే గుండె గుభేలుమనేది. ఒకప్పటి ఉమ్మడి మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారిగారు సర్కారు జిల్లాలలో కృష్ణా పత్రిక సంపాదకీయాలను, రాయలసీమలో శ్రీ సాధన పత్రిక సంపాదకీయాలను ప్రామాణికంగా పరిగణించేవారు. రామాచార్యులు భయ మెరుగని సంపాదకుడు. నిష్పాక్షిక నిశిత రాజకీయ వ్యాఖ్యలు చేసేవారు. సరస సాహితీ సౌరభాలు వెలార్చే రచయిత, చతురవక్త, ముఖ్యంగా భారతాన్ని రాజకీయాలకు అన్వయించి నవ్వులతో కడుపుబ్బజేసేవారు. తెలుగు వారిలో సమైక్యం సాధించడానికి పాటుపడినవారు.

శ్రీ సాధన పత్రిక రాజకీయాలతో సాహిత్యానికి సమ ప్రాధాన్య మిచ్చింది. సమకాలిక పండితుల సాహిత్య వ్యాసాలు దానిలో ప్రచురిత మయ్యేవి. నేటికీ వ్యాకరణ వేదాంతాలంకార శాస్త్రాలలో మహా విద్వాంసు లయిన కుంటిమద్ది శేషశర్మ మొదలయిన వారు తమ భావాలను దీనిలో ప్రచురిస్తున్నారు. శ్రీ సాధన బెళ్ళూరి శ్రీనివాసమూర్తి వంటి కవి పుంగవులను తీర్చిదిద్దింది.

వప్పూరు రామాచార్యులుగారు అనంతపురం కళాశాలలో బి. ఎ. చదువు తున్న నాళ్ళలోనే మరొక దేశ సేవకుడు కలచవీడు వెంకటరమణాచార్యులతో కలిసి 'హాస్య మంజూష' అనే గ్రంథం ప్రచురించారు. తర్వాత శ్రీ సాధన పత్రికలో వదరుబోతు వ్యాసాలు, 'విశ్వ వినుత నామ వినుర రామ' అనే మకుటంతో పద్యాలు ప్రచురించారు. వదరుబోతు వ్యాసాలు ఆంగ్ల రచయిత స్టీల్ రచించిన టాట్లర్ వ్యాసాలు వరవడిగా రచితమైనట్టివి. పానుగంటి నరసింహా రావుగారి సాక్షి వ్యాసాలకు స్పెక్టేటర్ వరవడి కాగా, వదరుబోతు వ్యాసాలకు టాట్లర్ వరవడి అయింది. వదరుబోతు వ్యాసాలు వ్రాయడంలో పలువురు రచయితలు సహకరించారు. సంధ్యావందనం ఆత్మకూరు అవధాని, కల్లూరు వెంకనారాయణ భార్గవ, సీరిపి ఆంజనేయులు, రావ్ సాహెబ్ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులుగార్లు. వదరుబోతు వ్యాసాల శైలికి ఒక ఉదాహరణ.

నాగరకత పెరిగిన కొద్దీ రమణీమణుల సొగసులు మార్పు చెంద సాగాయని అంటూ ఒక వ్యాసంలో కురులు ఇట్లు విన్నవిస్తాయి:

"వారికి కొప్పులిప్పుడు మెప్పులు కావు. తొల్లిటి కాలమున నెందులకును గొలుమాలిన జడలని వీరి యాశయము. కొన్ని నాళ్ళు మమ్ములను గట్టిగా బిగియబట్టి లాగిలాగి పురివెట్టిరి. కొంతకాలము చిత్ర విచిత్రముగా విరిచికట్టి బాధించిరి, మొగ్గలతో నలంకరించెదమన్న నెపమున నిలువెల్ల సూదులతోగుట్టి సూత్రములతో బిగియగట్టిరి. అలంకార వ్యాజమున మోయలేని భారమును మోయించిరి. తాము మునిగినదే గంగ కాకున్న నిట్టివా యలంకరములు? మా సహజ సౌందర్యపు తత్త్వమెరిగి ప్రపంచమున నది మాసిపోకుండ చిత్ర పట ములలోనైన నిలిపినందులకై రాజా రవి వర్మ మా కెంతయు వందనీయుడు. ఇవన్నియు నెటులో ఓర్చికొని యిన్నినాళ్ళు గడిపితిమి. కాని ముందున్నది ముసళ్ళ పండుగ. నవ నాగరకత స్త్రీలలో వ్యాపించు కొలది మాకు గష్టములు రెట్టింపగుచువచ్చినవి. సువాసన పేరున సారాయములతో మమ్ము ముంచు చున్నారు. ఇంతియ కాదు. స్వేచ్ఛగ బెరుగ నీక మమ్మపుడపుడు కత్తరించు నాచారము ప్రారంభమయ్యె. ఆర్యా! మాకేమో భయమగుచున్నది. ఇక గొన్ని నాళ్ళలో యీ నాగరకత సబ్బు రథముపై నెక్కి సీమకత్తులు నూరుచు మాపై నిరర్గళముగ దండయాత్ర వెడలగలదనియు అప్పుడు స్త్రీ పురుషులలో నెవరు గాని మా కభయ మిచ్చి మమ్ము పోషించువారే యుండరనియు మాకు సూచనలు స్పష్టముగ గానవచ్చుచున్నవి. మునుపటి కవులు స్త్రీలను మాత్రమే వర్ణనలకై పూబోడులనిరిగాని యిక మీద పూలు లేకున్న పీడ వదలినది - స్త్రీలను పురుషులను గూడ నా పేరున బిలుచు కాలము రానున్నది కాబోలు! మహాశయా! మా గతి యెవరు విచారించువారు? మీరు మాపై గరుణించి సంఘ మునకు హితము చెప్పరాదా?....ఇట్లు విన్నవించు - కురులు."

రామాచార్యులు వేమన పద్యాల లాగ 'విశ్వ వినుత నామ వినుర రామ' అనే మకుటంతో, రామయ్య పద్యాలు అనే పేరుతో చాల పద్యాలు రచించారు. తెలివికి తిండి ప్రధానం కాదని తెలిపే ఒక పద్యం మచ్చుకు :

"గడ్డి మేసి గోవు ఘనమైన పాలిచ్చు
గాలి మేసి తపసి జ్ఞానమిచ్చు
తిన్న తిండి కాదు తెలివి కాధారంబు
విశ్వ వినుత నామ వినురరామ"

ఒకమారు ఆయన సత్యాగ్రహ ప్రచారంలో ఒక ఊరుకు వెళ్ళారు.

అక్కడ కనీసం కాఫీ అయినా దొరకలేదు. అప్పుడాయన సహజ హాస్య ధోరణిలో

"ఎప్పుడు అడిగిన అప్పుడు
కప్పెడు కాఫీని ఈయ గలిగిన మిత్రుల్
చొప్పడిన యూర నుండుము
చొప్పడ కున్నట్టియూరు చొరకుము సుమతీ!"

అని ఆశువుగా పద్యం చెప్పారు.

రాయలసీమ మహానాయకులు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు తాడిపత్రి నుండి వెలువరించిన మాతృసేవ, జంగమ జీవద్గ్రంథం లేచి వచ్చి నోరువిప్పి మాట్లాడుతున్నట్టు నుడికారపు ఒంపుసొంపులు తామరతంపరలై తీరుతీయములై తేనెసోనలై మధ్య మధ్య యతిప్రాసల యమక గమకాల జలతరంగిణులు మ్రోగుతున్నట్టు సెలయేటి మలపులవలె వాక్యాలు దొరలింప గలిగిన వక్తృవాచస్పతి, వందేమాతరం ఉద్యమం నుండి తుదిశ్వాస వరకు దేశం దేశం, సంస్కృతి సంస్కృతి అంటూ జపించిన మహా రాజకీయయోగి కల్లూరు సుబ్బారావుగారు అనంతపురం నుంచి కొంతకాలం వెలయించిన లోకమాన్య, వెరపెరుగని వీరుడు వనం శంకరశర్మ నడిపిన ఇంద్రావతి హితవాది మొదలయిన పత్రికలన్నీ ఎంతో కొంత సాహిత్యసేవ చేసినవే.

## శారద

ఇతర రాష్ట్రాలలో, ముఖ్యంగా వంగ రాష్ట్రంలో, మాడర్న్ రివ్యూ వంటి తివర్ణచిత్ర మాసపత్రికలు వెలువడుతుండేవి. వీటిలో సాహిత్య విషయాలే కాక రాజకీయ విషయాలూ, ముఖ్యంగా దైనందిన ప్రపంచ విషయాలూ చర్చించబడేవి. అట్టి పత్రిక తెలుగులో అప్పటికి లేదు. దేశంలోని మాసపత్రికలకు అందచందాలతోను, ముచ్చటయిన ముద్రణతోను, చక్కని రంగుల చిత్తరువులతోను ఆంగ్లంలో వెలువడే మాడర్న్ రివ్యూ ఆదర్శప్రాయంగా ఉండేది. వానిలోని వ్యాసాలు కూడ కొత్త పద్ధతిలో వుండేవి. ఆ పద్ధతిలో తొలిసారిగా వెలువడిన ఉత్తమ మాసపత్రిక శారద. దీని సంపాదకులు శ్రీ కౌతా శ్రీరామశాస్త్రిగారు. ఇది బందరు నుంచి 1922 సెప్టెంబర్ నుంచి రెండున్నర సంవత్సరంపాటు వెలువడింది.

ఈ శారద పత్రిక తెలుగు సాహిత్య లోకంలో విప్లవం తెచ్చింది. ఈ పత్రిక వందపుటలతో, నెలలో ముప్పైదినాలూ చదువుకొనడానికి తగినన్ని విషయాలతో, రంగురంగు చిత్రాలతో రమణీయంగా వుండేది. సంపాదకులు

శ్రీరామశాస్త్రిగారు రచయిత, స్వాతంత్ర్య సమరయోధుడు గనుక ఈ పత్రిక తెలుగు సాహిత్య పత్రికల రూపాన్నే మార్చివేసింది; ప్రమాణాన్ని, స్థాయిని పెంచింది. ఇది మనింది రెండున్నర ఏడే అయినా, అన్ని సంచికలూ విజ్ఞాన సర్వస్వాలు. దీనిలో అప్పటి విద్వాంసు లందరూ, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వంటి పరిశోధక ప్రముఖులందరూ వ్రాసేవారు. బాపిరాజు గారి హిమబిందు నవల శారదలోనే మొదట వచ్చింది. అప్పటి ప్రముఖ రాజకీయ నాయకులు శ్రీ నడింపల్లి నరసింహారావు, శీలం జగన్నాధరావుగార్లు తర్వాత సంపాదకవర్గంలో ఉన్నారు.

ఈ పత్రిక ముఖచిత్రం విషయమై ఆ రోజుల్లో కొంత వివాదం నడిచింది. వాగ్దేవి చిత్రాన్ని స్తనవస్త్ర రహితంగా చిత్రించడం గుర్చి కొందరు ఆక్షే పించగా, ప్రముఖ లలిత కళావేత్త జేమ్సు హెచ్. కజిన్స్ అభిప్రాయం కోరటం జరిగింది. ఆయన సమాధానాన్ని కృష్ణాపత్రిక చొరవతో ప్రచురించింది. శారద పత్రిక ముఖచిత్రం గీచిన వారు అప్పట్లో ఆంధ్ర జాతీయ కళాశాల చిత్రకళాచార్యులు, సుప్రసిద్ధ చిత్రకారులు ప్రమోదకుమా చటర్జీ. 1923 సెప్టెంబర్ 1, శనివారం సంచికలో కృష్ణా పత్రిక కజిన్సుగారి అభిప్రాయాన్ని లేఖా రూపకంగా ఇలా ప్రకటించింది:-

"ఈ చిత్తరువు యొక్క పై భాగము వస్త్ర విహీనముగా నున్న మాట వాస్తవమే. కాని యాశరీరము యొక్క నీల కాంతి భారతీయుని బుద్ధికి రక్త మాంసాన్వితమగు సామాన్య మానవ దేహమును స్ఫురింపజేయక దివ్య స్వరూప మునే గోచరింప జేయుచుండును. ఒక వేళ దేహకాంతి రక్త వర్ణముగా జేసి నప్పటికిని మైకేల్ ఆంజిలో (పాశ్చాత్య చిత్రకళా విశారదుడు) రచించిన ఆది స్త్రీ పురుషుల యొక్క కామోదయ చిత్తరువు వంటి అత్యుత్తమమైన పూర్వ పాశ్చాత్య చిత్రరాజముల కంటె నిది అసభ్యతకు దూరముగనే యుండును, వేయేల జుగుప్సా దోషమునకు ఎన్విధమునను పాత్రముగాని మీ కృతి నిందల పాలై నందుకు నేను గూడ నా యాగ్రహమును వెలిబుచ్చుచున్నాను.

చిత్తగింపుడు<br>ఇట్లు మిత్రుడు<br>జేమ్సు హెచ్. కజిన్సు.

## భారతి (1924)

1984 లో వజ్రోత్సవం జరుపుకొన్నది భారతి మాస పత్రిక. కాశీనాథుని నాగేశ్వరరావుగారి యాజమాన్యాన, గన్నవరపు సుబ్బరామయ్యగారి సంపాద

కత్వంలో, ఆటుతర్వాత శివలెంక శంభుప్రసాద్‌గారి సంపాదకత్వంలో వచ్చి ప్రస్తుతం శివలెంక రాధాకృష్ణగారి సంపాదకత్వంలోనూ వస్తున్న భారతి దాదాపు పుట్టినప్పటి నుంచి చదివే భాగ్యం, కొన్నేళ్ళు దానిని నిర్వహించే భాగ్యం నాకు కలిగాయి. ఇది పుట్టినప్పటి నుంచి నేటి వరకు దీని విశిష్టత ఎంత మాత్రమూ కొరవడలేదు. నిర్వహణలో పరిమాణంలో మార్పులు జరిగివుండ వచ్చు. ఆంధ్రావళికి ఆరు దశాబ్దులుగా నవరసోపేతమైన సాహిత్యపు విందులు అందిస్తూనేవుంది భారతి. తెలుగు సాహిత్యానికే కాక సంస్కృత సాహిత్యానికి, చరిత్రకు, పురాతత్త్వానికి, శాసన పరిశోధనకు, విజ్ఞానశాస్త్రానికి, సంఘ పురోగతికి మహిళాభ్యుదయానికి వేయేల-రాష్ట్ర దేశ పురోభివృద్ధికి సంబంధించిన సకల కార్యకలాపాలకు ఈ పత్రిక దోహదం చేసింది. నిడుదవోలు వెంకటరావు గారన్నట్లు ఆంధ్ర పత్రిక దిన పత్రిక, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, భారతి, ఉగాది సంచికలపై ప్రత్యేక పరిశోధనలుచేసి సిద్ధాంత గ్రంథాలు వ్రాయవచ్చు.[1]

భారతి రంగు రంగుల అపూర్వ చిత్రాలతో వేళ తప్పక ప్రతి చాంద్ర మాసాదిని వస్తూ పాఠకులను అలరించేది. దాని దెబ్బకు సామాన్య మాసపత్రిక లేవీ నిలవలేకపోయాయి. అన్ని విధాల భారతి శారద పత్రికను మించిపోయింది. నేడు కీర్తితో తలపండిన ప్రతి కవి రచయిత పరిశోధకుడు కథానికా రచయిత నవలాకారుడు చరిత్రకారుడు లిపివేత్త ఖగోళజ్ఞుడు పరమాణు శాస్త్రజ్ఞుడు భారతి మన్నన పొందినవారే. భారతి అన్ని వర్గాల సాహిత్యవేత్తలను, అన్ని సిద్ధాంతాల రచనలనూ ప్రోత్సహించింది. చివరకు తనను దూషించే వారి రచనలను కూడా ప్రచురించింది. రచనకు సాహిత్యస్థాయి ఉండాలి. సిద్ధాంతం ఏదైనా సరే. ఇతరులపై ఈసడింపుగా ఉండరాదు. తమ కుళ్ళును మనపత్రిక ద్వారా వెళ్ళబోసుకుందామంటే మాత్రం అవకాశం ఇవ్వరాదు - అని శంభు ప్రసాద్‌గారు నాతో అనేవారు.

భారతి ప్రారంభ పూర్వగాథ కొంత ఆసక్తికరమైంది. శారదపత్రికను కాశీనాథుని నాగేశ్వరరావుగారు చూచారు. దానితో ప్రోత్సాహితులయ్యారు. మాసపత్రికను ప్రారంభిద్దామనుకున్నారు.

వారు అప్పటికే ఆంధ్రపత్రిక దినపత్రికను, వారపత్రికను, ఉగాది సంచికను నడుపుతున్నారు. సాహిత్య మాసపత్రిక ప్రారంభించాలనుకున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో వారికి పరిచయం అదివరకే పనప్పాకం అనంతా చార్యులు, వేపారామేశం. టంగుటూరు ప్రకాశంగార్ల వంటి ప్రముఖుల గోష్ఠులలో

1. Studies in the History or Telugu Jourlism, పు. 89.

ఉంది. కనుక వారి సలహా అడిగారు. వారు ప్రోత్సహించారు. సమర్థుడైన సంపాదకుని చూడమన్నారు నాగేశ్వరరావుగారు. అప్పుడు గన్నవరపు సుబ్బ రామయ్యగారు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పని చేసేవారు. ఆయనది విచిత్రమైన వ్యక్తిత్వం. చదివింది ఫస్ట్‌ఫారం. నేర్చింది పౌరోహిత్యంతోపాటు స్టెనోగ్రఫీ. విని ఆకళించుకొన్నవి వివిధ భాషలు. ఏపని అప్పగించినా అచ్చుకట్టుగా తీర్చిదిద్దే అద్భుతశక్తి. ఎవరితోనైనా సహకరించి పనిచేయగల సామరస్యబుద్ధి. అలాటి సుబ్బరామయ్యగారిని సంపాదకులుగా నియమించ వలసిందని ప్రభాకరులు సూచించారు. ఇక పరోక్షసేవ ఉండనే ఉన్నది. శ్రీ నాగేశ్వరరావుగారు మొదట జంకినా, ప్రభాకరుల మాటలపై విశ్వాసంతో సుబ్బరామయ్యగారిని సంపాదక వర్గంలో నియమించారు. ప్రభాకరులు ఆ పత్రికలో మీగడతరకలు, కలగూర గంపవంటి శీర్షికలు పెట్టారు, శాసనాలప్రచురణ, చర్చలు జరిపారు. అహద నకర శాసనంపై చర్చ పండితుల కందరికీ తెలుసు. మరచాను. భారతి తొలి సంచిక ప్రభాకరుల 'శివకవులు' అనే తొలి వ్యాసంతో వెలువడింది. భారతి ఆంధ్రసంస్కృత సాహిత్యాలకు, చరిత్ర పురాతత్త్వ విజ్ఞాన శాస్త్రాదులకు చేసిన సేవ అపూర్వం. 1924 నుంచి 1990 వరకు అవిచ్ఛిన్నంగా నడచిన పత్రిక ఇది. తర్వాత కొంతకాలం ఆగిపోయినా, త్వరలో వెలువడుతుందని ఆంధ్ర పత్రికాధిపతులు పదే పదే ప్రచురిస్తున్నారు.

ప్రభాకరులు ఈ పత్రికకు పరోక్షంగా సేవచేస్తూ ప్రత్యక్షంగా అసంఖ్యా కంగా వ్యాసాలు వ్రాశారు; కవితలు వ్రాశారు, కవితలు : దివ్య దర్శనము, కృతార్థుడు. కాళహస్తి - శివరాత్రి, సీతాఫలం; అమరావతీ శిల్పము మొద లయినవి. ప్రతిమా నాటకం మొదలైనవి భారతిలో వెలువడ్డాయి. వ్యాసాలు : ఇక్ష్వాకురాజులు - పుట్టుపూర్వోత్తరాలు, వినోదవిమర్శ, విమర్శ విమర్శము - వినోద విమర్శ, ప్రాచీనాంధ్ర శాసనములు, అహదనకరశాసనము, అహదన కర పునర్విమర్శము, వినుకలి-కనుకలి కృష్ణదేవరాయలు - సకల కథాసార సంగ్రహములు, రేవణ (శబ్దచర్చ) నాగార్జునుని కాలనిర్ణయము, జ్ఞానసంపద, నాగార్జునుడు, ఉపలబ్ధ అముద్రిత ప్రాచీన గ్రంథములు, సజీవరచన, తాళపత్ర గ్రంథములు మొదలయినవి ఎన్నో. భారతిలో పడిన పెక్కు వ్యాసాలు తర్వాత తెలుగు మెఱుగులు, మీగడ తఱకలు, సింహావలోకనము మున్నగు సంపుటాలుగా వెలువడ్డాయి.

శ్రీ నాగేశ్వరరావుగారితో పరిచయం కాలంలోనే ప్రభాకరులు బసవ

పురాణాన్ని ప్రామాణికమైన పీఠికతో ప్రచురించారు. ఇక వారు ఆంధ్రపత్రిక మున్నగు సమకాలిక పత్రికలకు వివిధ విషయాలపై వ్రాసిన వ్యాసాదులు అసంఖ్యాకాలు.

సుబ్బరామయ్యగారిని గురించి ఒక విషయం చెప్పడం మరచాను. శ్రీ నాగేశ్వరరావుగారు సత్యాగ్రహంలో పాల్గొని కారాగారానికి పోవలసి వచ్చింది. అప్పుడువారు సంపాదకత్వపు డిక్లరేషను సుబ్బరామయ్యగారి పేర మార్చారు. అప్పటినుంచి నాగేశ్వరరావుగారు కీర్తిశేషులయ్యేవరకు (1938 వరకు) డిక్లరేషన్ మార్చలేదు. సుబ్బరామయ్యగారు నాగేశ్వరరావుగారి అభిమానాన్ని దుర్వినియోగం చేయలేదు.[1]

డాక్టర్ కె. ఎన్. కేసరి సంపాదకులుగా వెలువడిన గృహలక్ష్మి మహిళాభ్యుదయానికెంతగానో దోహదం చేసిన పత్రిక. దీనితో కనుపర్తి వరలక్ష్మమ్మ మొదలైన ప్రముఖ రచయిత్రులు రూపొందారు. 'గృహలక్ష్మి కంకణం' అనే బహుమానం పెట్టి ఏటా విదుషీమణులను రచయిత్రులను ఈ పత్రిక సువర్ణ కంకణాదులతో గౌరవించింది, గౌరవిస్తున్నది.

సుప్రసిద్ధ సంఘ సేవాపరాయణ, వీరనారి, ఉత్తమ దేశభక్తురాలు గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు స్థాపించి రూపురేఖలు దిద్దిన ఆంధ్ర మహిళాసభ పక్షాన ఆంధ్రమహిళ అనే మాసపత్రిక కొన్నేళ్ళు వచ్చింది; సారస్వత సాంఘికాది రంగాలలో విశిష్టమైన సేవ చేసింది.

స్వాతంత్ర్యం రాక పూర్వం వెలువడ్డ సాహిత్య పత్రికలలో ముఖ్యంగా పేర్కొన్నవలసినవి ప్రతిభ, ఉదయిని, వీణ, జ్వాల, ఆంధ్రి, ఆంధ్రభూమి మొదలైన పత్రికలు.

## ఆనందవాహిని

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చైతన్య సంప్రదాయానుయాయుల భేదాభేద వాదంలాగా పరోక్ష - ప్రత్యక్ష సంపాదకత్వం నిర్వహించిన పత్రిక ఆనంద వాహిని. ఈ పత్రికలలో వారు సకలం పేరుతో కొన్ని, పేరులేక కొన్ని, కలం పేరుతోకొన్ని వ్రాసేవారు. తమిళానువాదాలూ చేసేవారు. వారు మద్రాసులో వున్నప్పుడు 20 వ శతాబ్దం మూడవ దశకంలో తమిళ సాహిత్యజ్ఞులతోను పరిచయం చేసుకొన్నారు. అప్పుడు ఎస్. ఎస్. వాసన్ అనే ప్రముఖ పత్రికా సంపాదకులు ఆనందవికటన్ అనే తమిళ హాస్య మాసపత్రిక నడిపేవారు.

---

1. ప్రభాకర స్మారికలోని నా వ్యాసం నుంచి.

తెలుగులోనూ అలాటి పత్రికను నెలకొల్పదలచారు. ప్రభాకరులను కోరారు. వారు అంగీకరించారు. దాని మొదటి సంచిక 1930 జనవరి 1వ తేదీన వెలువడింది. దీని భాష శిష్ట వ్యవహారికం. తొలి సంచికలోని 'స్వవిషయము' అని సంపాదకీయంలో వారు ఇలా పత్రిక ఆశయాలు తెలిపారు:-

స్వవిషయము పత్రికారంభము - "ఆనందము, జ్ఞానము, సత్యము పొంద వలెననే ఆశతో జీవలోకమంతా ముందుకు ముందుకు అడుగులు వేస్తున్నది. జీవసృష్టిలో ఉత్తమ సృష్టి అయిన నరజాతికి ఈ తృష్ణ అనాది కాలమునుండి అత్యధికముగా ఉన్నది. సత్యజ్ఞానానందముల పరమావధియే ఈశ్వరుడు. ఈశ్వరుని పొందడమే ఈ తృష్ణ తీరడమని బహుకాలమునకు ముందే మహాపురుషులు గుర్తించినారు. ఈశ్వర స్థానమును కనుక్కోవడముకు అనేకులు అనేకమార్గములు తొక్కినారు, తొక్కుతున్నారు. అనేక విధముల జ్ఞానములు అందినారు, అందుతున్నారు. అనేకానందములను పొందినారు, పొందుతున్నారు. అనేకులు అనేక విధములుగా చేస్తున్న యీ ప్రయత్నముల సంఘర్షణములవల్ల ఆనందముతోపాటు కష్టము, జ్ఞానముతోపాటు అజ్ఞానము, సత్యముతోపాటు అసత్యము కూడ చెలరేగుతున్నవి.

"నిర్మలమైన ఆనందముగాని, నిర్మలమైన జ్ఞానముగాని, నిర్మలమైన సత్యముగాని ఈ లోకములో దొరకనే దొరకవేమో అని అధైర్య పడదగినంత అలజడి వీటివల్ల ఏర్పడి ఉన్నది. ఈ అలజడిలో, ఈ మథనములో అమృతమూ పుట్టుతున్నది, హాలాహలమూ పుట్టుతున్నది. మంచి ఉన్నది. చెడుగూ ఉన్నది. ప్రతి మానవుడు ఈ ద్వంద్వయుద్ధములో నలిగిపోతున్నాడు. తెప్ప రించుకోవలెననే కోరికతోనే కొట్టుకాడుతున్నాడు. కాని, వెన్ను చూడలేని కన్ను, కన్ను చూడగలిగినంత దూరంలో ఉన్నవాని మాటనైనా వినలేని చెవి, మరునిమిషంలో రానున్నదానిని గుర్తించలేని మనస్సు, వీటితో మానవ మాత్రుడేమి శాంతి పొందగలడు! ఒక విధముగా ప్రత్యేకముగా చూస్తే అధమ గతిలోనే ఉన్నట్టు తోచునుగాని, మానవసృష్టి సమష్టిమీద చూడగా సర్వేశ్వరుని సత్యజ్ఞానానంద స్వరూపములకు చాలచాల చేరువవుతున్నట్టుగా కూడ కాన వస్తున్నది.

"ప్రజాబలమును గుర్తించి సంఘశక్తిని సంధానించి కార్యనిర్వాహమును పురికొల్పడముకుగాను సంఘోద్యోగి వర్గమున్నట్టు ప్రపంచమంతటా ఇప్పుడు పత్రికలు పనిచేస్తున్నవి. ప్రపంచ వ్యవహారతంత్రమంతా ఇప్పుడు పత్రికల మూలమున జరుగుతున్నది. జ్ఞానామృతమంతా పత్రికల మూలమున ప్రవహిస్తు న్నది. వర్తమానకాలమున పత్రికా ప్రచారము నిలిపితే, ప్రపంచ వ్యవహారము

సాగడం కష్టమౌతుంది. ఒక్కొక్క దేశములోను ఒక్కొక్క భాషలోను అనేక పత్రికలు దినదినము ప్రకటితమౌతున్నవి. జ్ఞానమును పెరజిమ్ముతున్నవి.

"అట్టివి తెలుగుదేశంలోనూ అనేక పత్రికలున్నవి. వానివల్ల దేశమునకు మహోపకారము జరుగుతున్నది. కాని, చదువు నేర్చుకొన్న జనులందరు చదువుకొనేటందుకు, బీదజనులందరు, చదువుకొనేందుకు, పెద్ద పెద్ద తెలివితేటలులేని సామాన్యజనులందరు చదువుకొనేటందుకూ, ఆనందముగా చదువుకొనేటందుకూ, చదివి పారవేయకుండ దాచుకొని మళ్ళీ మళ్ళీ చదువుకొంటూ సంతోషిస్తూ ఉండేందుకూ వీలుగా మామూలు వాడుకభాషతో, కారుచౌక చందాసొమ్ముతో, చిన్న చిన్న విషయాలతో, అందరికి తెలిసే విషయాలతో, హాస్యసంతోష ప్రసంగాలతో, అందమైన బొమ్మల అలంకరింపులతో, పుస్తకములుగా వచ్చే నెలపత్రికలు తెలుగుదేశమున తక్కువగానే ఉన్నవి. మలయదీవులలో, బర్మాలో, ఇంకా ఇతర దేశాలలో కొంచెము కొంచెము చదువు నేర్చుకొన్న తెలుగువారెందరో ఉన్నారు. వారికి కూడా, తెలుగుదేశములోని కూలినాలి, వ్యవసాయం మొదలయినపనిపాట్లు జరుపుకొనేవారికీ (పెద్దలకే కాదు) కూడా ఉపయోగపడవలెననే తలపుతో మేమిప్పడీ 'ఆనందవాహిని'ని ఆరంభించాము.

"హాస్యప్రధానంగా ఈ పత్రిక ఉంటుంది. ఇందులో ఎవరినీ నిందించడము ఉండదు. ఎప్పటికప్పుడు లోకములో, స్వదేశములో, జరుగుతూ ఉండే అపూర్వ విషయములే యిందులో నవ్వుటాలతో వెల్లడించడమౌను. చిన్న చిన్న కథలు, కబుర్లు, మంచిమాటలు, పాటలు, పదాలు, పద్యాలు ప్రకటిస్తాము. ఇది కాంగ్రెస్ పత్రికకాదు, జస్టిస్ పత్రికకాదు, బ్రాహ్మణ పత్రిక కాదు, అది మాంధ్రపత్రిక కాదు, ఏదీ కాదుగాని అన్నీ ఔను. అందరి పత్రికా ఔను. అందరికీ అందుబాటులో ఉండడంకోసం చందా సం॥ ఒకటికి రూ॥ 1-0-0. (ఒకరూపాయ) పెట్టినాము. ఆంధ్ర మహాజనులందరు చందాదారులుగా తోడుపడవలసిందని, ఆనందమును కలిగించే విషయములు వ్రాసి ప్రకటనకు కూడా పంపి సహాయపడవలసినదని వేడుకొంటున్నాము."

ఆనందవాహిని తొలి సంచిక ఈ క్రింది ప్రార్థనతో ప్రారంభమయింది:-

"ఉప్పతిలెన్ జగమ్మున కె
దో యొకవేదన దుర్నివారమై
యిప్పుడు; దాని మేలనుచు
నెంతయు గీడనికూడ నెంతు; మి
ట్లొప్పును దప్పునుం దెలియ
కూగిసలాడెడు మాకు నెమ్మదుల్

చొప్పడజేసి తత్త్వగతి
 జూపి విచారము బాపు మీశ్వరా॥"

పైన పేర్కొన్న ఈ సంపాదకీయ భాష, విషయ వివరణ సంపాదకుని భావాలను స్పష్టపరుస్తున్నవి కదా! దీనిలో ప్రభాకరులు మొదటి ర్యాపర్‌నుంచి చివరి ర్యాపర్ వరకు వాణిజ్య ప్రకటనలతో సహా వ్రాశారు! ఇదివరకు చెప్పినట్లు పేరుతో, పేరులేక, పెక్కు మారుపేర్లతో, చందా సంవత్సరానికి రూపాయ, అంటె పత్రిక ప్రతి పాతదమ్మిడీలలో 16 దమ్మిడీలు - అణాకాని అంటారే, ఆ అణా కాని కంటే దమ్మిడీ ఎక్కువ. ఎవరైనా సంతోషంగా కొంటారు.

ప్రభాకరులు దీనిలో పెక్కు శీర్షికలు నడిపారు. హాస్యం, విజ్ఞానంవీ, పిల్లలకూ, పెద్దలకూ. హాస్యానికి ఒక ఉదాహరణ:

**ఆలు-మగలు**

భర్త :- ఇంకా వంట కాలేదూ! కాకుంటే నేను హోటలుకైనా వెళ్తా.

భార్య :- పదినిమిషాలోర్చుకోరూ!

భర్త :- అయితే పదినిమిషాల్లో వంట ఔతుందా ఏమిటి?

భార్య :- కాదండీ! కాదు! నేనూ తమతో కూడ హోటలుకే వచ్చేస్తా.

పిల్లల శీర్షికలో ఒకటి బాలశిక్ష. దీనిలో ఒకటి ఉదాహరిస్తాను:

**బాలశిక్ష**

బాలుడా! నీవు తెలుగువాడవు. అనగా ఆంధ్రుడవు. తెలుగునకే ఆంధ్రము అని మారుపేరు తెలుగుభాష మంచి రుచిగల భాష. తెనుగుతేట - అన్నవాడుక విన్నావా!

తెనుగు వాడవైనందుకు నీవు ముఖ్యముగా ఈ క్రిందివి నేర్చుకోవలెను సుమా!

సుమతి శతకము పద్యాలు, వేమన్న పద్యాలు, దాశరథి శతకము పద్యాలు, వేణుగోపాల శతకము పద్యాలు,

భాగవతములో ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షము, త్యాగరాయ కీర్తనలు కొన్ని, రామదాసు కీర్తనలు కొన్ని,

చక్కని గుండ్రని దస్తూరీ.

ఈ మాత్రమైనా నేర్చుకొనకపోతే నీవు తెలుగుభాష రుచిని తెలుసుకో జాలవు.

గీ॥ ఆంధ్రభాష అమృత, మాంధ్రాక్షరంబులు
 ముద్దులొలుకు గుండ్ర ముత్తియములు

ఆంధ్రదేశ మాయురారోగ్యవర్ధక
మాంధ్రజాతి నీతి ననుసరించు.

అప్పుడే శారదాచట్టం వస్తూంది దాన్ని సమర్థించారు సంపాదకీయ వ్యాఖ్యలో.

ఒక చందా ప్రకటన కూడా రసవత్తరంగా ఉంది:- దానిని బాక్సు చేశారు.

"ఆనందవాహిని, మీ దగ్గరకు వస్తే దానిని చూచి ఇదేదో మాదిరి ప్రతి, ఎవరో పంపగా మన దగ్గరికి వచ్చిందని తలచకండి సుమా! మీ కుటుంబ మంతా ఎప్పుడూ ఆనందంతో ఉండవాల్ననే తలంపుతో ఈ 'ఆనందవాహిని' మిమ్మల్ని వెతుక్కుంటూ మీ దగ్గరికి వొస్తూ ఉంటుంది. కాబట్టి వృధాగా మన దగ్గర వస్తుందని మాత్రం అనుకోవద్దు. అది మీ దగ్గర వచ్చి అడగడమేమంటే సంవత్సరానికి ఒక రూపాయ మాత్రం చెల్లించమని అడుగుతుంది."

ఈ ప్రకటనలోని 'దగ్గిరికి, ఉండవాల్ననే, వొస్తూ, అనుకోవద్దు, అడ గడమేమంటే' - వంటి వ్యవహార పదాలు చూడండి. ఒక మండలంవి కాకుండా సకలాంధ్రంవి వాడడానికి ప్రయత్నం జరిగింది.

దీనిలో 'వర్తమానములు' అనే శీర్షికలో నెల్లూరి సభ, గోరక్షణము కాంగ్రెస్ కప్పలతక్కెడ, ప్రహ్లాదమతము మొదలయిన వార్తలు ప్రచురించారు. దీనిలో ప్రభాకరులు 'కొత్తచిక్కు' అనే పేర శ్లిష్టాక్షర పద బంధం నిర్వహించారు. ఒక దానిని వివరిస్తాను. దీనిలో మొదటి ఆరుగళ్ళు అడ్డంగా, క్రమంగా ఒకటికి తగ్గుతాయి. నిలువున మొదటి వరుసలో అర్థవంతమైన పదం వస్తుంది. మరొకటి మరొక విధంగా.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | వి | ప్ర | వి | **నో** | దు | లు |
| 2. | వే | ంట | ప్ర | గ | డ | |
| 3. | **కా** | దం | బ | రి | | |
| 4. | నం | ద | నం | | | |
| 5. | దు | ర్గ | | | | |
| 6. | డు | | | | | |

దీనిలో అడ్డం మొదటి వరుసలో నాలుగవగడిలో నో అక్షరం అడ్డం, మూడవ వరుస మొదటి గడిలో కా అక్షరం ఇచ్చారు. దీనికి వారు ఈవిధంగా సూచనలిచ్చారు.

"కాళీగా ఉండే ఇండ్లలో అక్షరములు వ్రాసి అడ్డముగా చదివితే, 1. ఒక జాతి బిచ్చగాళ్ళ పేరు, 2. ఒక తెలుగు జమీందారీ పేరు, 3. ఒక సంస్కృత గ్రంథం పేరు, 4. ఒక సంవత్సరము పేరు, 5. ఒక దేవత పేరు, 6. ఒక తెలుగు ప్రత్యయము అగును. ఒకటి నుండి ఆరుదాక వ్రాసిన పేర్ల మొదటి అక్షరములను నిలువుకు చదువుతే సర్వదేశములందు పొగడబడే ఒక హిందూ దేశపు మహనీయుని పేరు అవుతుంది."

ఈ చిక్కులకు జవాబు వ్రాసే గడువు, బహుమానాలు ఉన్నాయి.

ప్రతి సంచిక సంపాదకీయానికి ముందు ఆనందవాహిని వల్ల కలిగే ఫలితాలు తెలిపే పద్యం ఉండేది - ఇది ఒక విధమైన గీతం.

"ఉత్తమ జ్ఞానంబు నొదవించుకొనగలము
చిత్తమీశ్వరునందు చెలగించుకొనగలము
సౌందర్య సంపదలు సాధించుకొనగలము
ఇందె యానందవాహిని మునుకలిడి మనము."

1930 లో ప్రెస్ ఆర్డినెన్సు వచ్చి కొన్ని పత్రికలు దెబ్బతిన్నాయి. ఆనందవాహిని కూడా కొన్ని నెలలు - 1930 జులై, ఆగస్టు, సెప్టెంబరునెలల్లో ఆగింది. అక్టోబరులో ఏడు నుంచి 10 వరకు సంచికలుగా ఒక సంచిక ఎక్కువ పుటలతో ప్రచురించారు. దాని సంపాదకీయంలో ఆర్డినెన్సు విషయం ప్రస్తావించారు.

స్వవిషయము : "ఈ నడుమ విసరి విసరి వీస్తూ ఉన్న ప్రస్సు ఆర్డినెన్సు అనే వడగాడ్పు తాకి మా ఆనందవాహిని కూడ ఇంతకాలం వరకు ఇంకిపో వలసినదైనది....."

ఆ సంచికలోనే మరొకచోట 'సంపాదకీయ ప్రకటన' అనే శీర్షిక క్రింద ఇలా ప్రకటించారు:

"1930 సం॥ మేనెల ఆనందవాహిని సంచికలో పొలిటికల్ విషయములు వెలువరించినందులకై తత్పత్రికాధిపతులైన తన్ముద్రణాధికారులు పశ్చాత్తప్తులగుచు 1930 సంవత్సరపు ఇండియన్ ప్రెస్సార్డినెన్సు సెక్షన్ 4 (1)కు లోబడిన విషయములను ఆనందవాహినిలో ప్రచురించడమును, తమ అచ్చాఫీసులో ముద్రించడమున్ను మానుకొన్నారు."

ఈ నిషిద్ధ విషయాలు మే సంచికలో సాత్త్వికోద్యమము అనే సంపాదకీయం, వేలాల సుబ్బారావుగారి గాంధిమహాత్ముని సత్యాగ్రహము అనే వ్యాసం,

వర్తమానములు అనే శీర్షికలో గాంధీ ఉద్యమం, మద్రాసు ప్రభుత్వంపై విసుర్లు కావచ్చు.

ప్రభాకరులు ఆనందవాహినిలో తక్రానందస్వామి, పుణ్యవతి-భాగ్యవతి, శరణార్థి, మా మేనత్త, మా మామ అనేవి 'గౌతముడు' అనే పేరుతో రచించారు. దీనిలో పేరు లేనివన్నీ వారివే.

ఈ ఆనందవాహిని "ఒక సంవత్సరం పాటు బాగా సాగింది. ఆనంద వికటన్‌తోపాటు బాగా వృద్ధిలోకి రావలసింది. ఈ ముద్రణ కొనసాగుతున్న సమయంలో నాయనగారు కార్యాంతరాలవల్ల కొన్నాళ్ళు మద్రాసులో లేకపోవడం తటస్థించింది. పత్రికకు కావలసిన విషయాలన్నీ సమకూర్చి ఊరికివెడుతూ పత్రికాముద్రణ సరిగా జరిగేట్టు చూడమని ఆ కాలంలో వీరితో ఓరియంటల్ మాన్యుస్క్రిప్టులైబ్రరీలో పనిచేస్తున్న పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిని కోరారు. సివిల్ డిసొబీడియన్స్ మూవ్‌మెంటు ముమ్మరంగా ఉన్న రోజులవి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏ పత్రికయినా, ఏమైనా ప్రచురిస్తే, వారిమీద బ్రిటిష్ ప్రభుత్వం చర్య తీసుకొనేది. అటువంటి సమయంలో నాయనగారి ఎరుక లేకుండా ప్రభుత్వానికి వ్యతిరేకమైన ఒక వ్యాసం ఆనందవాహినిలో ప్రచురితమైంది. ఆ వ్యాస ప్రచురణ నాయనగారి ఎరుకలో జరుగకపోయినా, ఆనంద వాహిని పరోక్ష సంపాదకత్వ బాధ్యత వారికి చాలా చికాకు కలిగించింది. ఈ ఉదంతాన్ని పురస్కరించుకొని ఆ బాధ్యత నుండి నాయనగారు తప్పుకొన్నారు. ఆ తర్వాత ఆ పత్రిక ఎంతోకాలం సాగలేదు".... అని మణిమంజరి 9వ సంపుటంలో శాస్త్రిగారి కుమారులు డాక్టర్ ఆనందమూర్తి వ్రాశారు.[1]

## ఆంధ్ర భూమి

ఆంధ్ర శేషగిరిరావుగారి సంపాదకత్వంలో ఈ సాహిత్య పత్రిక వెలువడింది. 1931 లో ప్రారంభమైంది; సుమారు 1940 వరకు వచ్చింది. "సర్వవిషయముల చర్చించు సచిత్రాంధ్ర మాసపత్రిక" అని తనను గూర్చి అభివర్ణించు కొనేది ఈ పత్రిక.

ప్రతినెల ఆంధ్రుని డైరీ అని ఆ నెలలో జరిగిన ప్రధాన సంఘటనలను చివరి పుటలో ఈ పత్రిక వెలువరించేది. ఉదాహరణకు: 1934 ఏప్రిల్ ఆంధ్రుని డైరీలో 18, విజయనగరము మీమాంసా భూషణులు గంటి సూర్యనారాయణశాస్త్రి గారి మరణము.

---

1. ప్రభాకర స్మారిక 4వ సంపుటంలోని నా వ్యాసం నుంచి.

22, నిడుబ్రోలు, ఆంధ్ర రైతాంగ విద్యాలయము శ్రీ సంతానము గారిచే తెరువబడెను.

ఆంధ్ర శేషగిరిరావుగారు వీరాంధ్రులు. ఆంధ్రరాష్ట్రం వచ్చేవరకు సిగముడి వేయనని చాణక్యులాగ ప్రతినపూని శిరోజాలు, శ్మశ్రువులు పెంచిన దీక్షితులు. ఈ పత్రికలో ఆంధ్ర జాతికి సంబంధించిన వివిధ విషయాలను ప్రామాణికంగా, పరిశోధన దృష్టితో ప్రచురించేవారు. ఈయన స్వయంగా సరళ గ్రాంధికవాది అయినా, గిడుగు రామమూర్తిగారి వ్యవహార భాషోద్యమాన్ని సమర్థించారు. 1933 లో రామమూర్తిగారి సప్తతితమ మహోత్సవం గురించి ఈ విధంగా సంపాదకీయం వ్రాశారు:

"రావు సాహెబ్ శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు నేటి ఆంధ్ర దేశపు మేధావులలో నొకరు. సుప్రసిద్ధ శాస్త్రవేత్తయగు థామస్ ఆల్వా ఎడిసన్ గారితో శ్రీ రామమూర్తిపంతులు గారికి ఒక్క బధిరత్వ విషయము ననే గాక దీక్ష, ప్రజ్ఞ విషయమున గూడ సాదృశ్యము గలదు. భాషా సౌలభ్యమునకై శ్రీవారు గావించిన కృషి అనంతము. జాతీయమైన భాష కొరకు వారు శోధించిన గ్రంథములకు, అవలోకించిన శాసనములకు లెక్క లేదు. తెనుగు సవరభాషల నిఘంటువు వారి దీక్షా పరత్వమునకు అక్షర రూపము. అట్టి వారి డెబ్బదవ జన్మదినోత్సవము ఈ సంవత్సరము నవంబరు మాసమున రాజమహేంద్రవరమునందు జరుపుటకు ఏర్పాట్లు గావింపబడు చున్నవి. ఈ ఉత్సవము రాజమహేంద్రవరమున జరుపుటలో నొక విశేషము గలదని మాకు దోచుచున్నది. రాజమహేంద్రవరము (తూర్పు గోదావరి జిల్లా యనుట బాగు) సాంఘిక విషయములందు ముందడుగును, భాషా విషయమున వెనుకడుగును వైచుటకు పేరు కెక్కియున్నది. తూర్పు గోదావరి మండలమున గ్రాంధిక భాషకు ప్రాపగు నొక మహారాజావారి మండలముయొక్క తిలకనగరమగు కాకినాడయందు ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి పీఠము గలదు. ఆ మండలమునందు రెండవ నగరమగు రాజమహేంద్రవరమునుండియే శ్రీ రామమూర్తిపంతులు గారి యుద్యమముపై వజ్రాయుధము లేచినది. అట్టి మండలమున ఇపుడు శ్రీ రామమూర్తి పంతులు గారి డెబ్బదవ దినోత్సవము జరుపబడనున్నదనుట శ్రీవారి యుద్యమ విజయమును సూచించుచున్నది. ఈ ఉత్సవదినము నాటికి శ్రీ పంతులు గారి వ్యాసములు, ఉపన్యాసములు చేర్చి ఒక సంపుటమును, ఆంధ్ర భిషక్కుల భాషా భేషజము, బాలకవి శరణ్యము, గద్య చింతామణి అను వారి గ్రంథములను అచ్చు వేయించుటకు జన్మ దినోత్సవ నిర్వాహక సంఘమువారు తలపెట్టియున్నారు. ఈ తలపు

పచేశిమమగుటకు రెండువేల అయిదువందల రూప్యములు కావలెను. భాషా పోషకులు ఉదారులు అగు ఆంధ్ర ధనికులు విరాళములిచ్చి శ్రీ రామమూర్తి పంతులు గారి భాషా సేవకు కృతజ్ఞత చూపగలరని నమ్ముచున్నాము."

## ఉదయిని

కొంపెల్ల జనార్దనరావుగారి సంపాదకత్వంలో మద్రాసునుండి 1935 జనవరిలో వెలువడిన ద్విమాసపత్రిక ఉదయిని. ఇది రెండు సంవత్సరాల పాటు వచ్చింది. ఇది నవ్యసాహిత్యానికి అండగా నిలిచిన గొప్ప పత్రిక. సమకాలిక కవి పండిత పరిశోధకులందరూ దీనిలో తమ రచనలు ప్రచురించారు.

జనార్దనరావుగారు 'కిరణాలు' అనే శీర్షికకింద సంపాదకీయాలు వ్రాసేవారు. వాటిలో ఆయా సమకాలీన సాహిత్యాంశాలపై పత్రికాభిప్రాయా లను వెల్లడించేవారు. మొదటి సంచిక సుదీర్ఘ సంపాదకీయంలో ఆయన "రసాస్వాదనమునుబట్టి మనస్సుకు సంస్కృతి ప్రసాదించే ఉత్కృష్ట సాహితీ కళాభ్యుదయానికి ఉదయిని సతతము తూర్పు దిక్కయి ద్వారము తెరుస్తుంది" అని ఉద్ఘోషించారు. దీనిలో శృంగాటకం, గ్రంథ పరిచయాలు, వాఙ్మయవీథి, తలపోతల కలపోతలు (లేఖావళి), వ్యాసాలు, నాటకాలు, కవితలు అనే శీర్షికలుండేవి.

ఉదయిని తొలి సంచిక వచ్చినపుడు ఆంధ్రదేశంలోని ప్రముఖు లందరూ హర్షిస్తూ స్వాగతం చెప్పారు. పత్రికలన్నీ హర్షించాయి. ఉదాహర ణకు భారతి మాసపత్రిక చేసిన సమీక్షను పేర్కొంటాను :-

**ఉదయిని** *

'నేటివరకూ సాహిత్యము గతులు నిరూపిస్తూ తత్పరిణామమునకు తోడ్పడుతూ దానికోసమై ప్రత్యేకము నిలిచి బ్రతికిన పత్రిక లేకపోయినా తెలుగునాట ఆలేమిని పోగొట్టుటకయి నేడు పుట్టిన 'సాహిత్య పత్రిక' 'ఉదయిని'. "'చదువుకున్నవారు' చదివే పత్రిక" ఈ 'ఉదయిని'. సామాన్య దృష్టికి తేరిచూడరాని తన 'కిరణాల'తో నవ్యసారస్వత ప్రపంచము నుద్దీపింప చేయుచు నిది యుదయించినది.

---

* ఉదయిని (సాహిత్యపత్రిక). రెండు నెలల కొకసంచికవంతున వెలు వడును. ౧౯౩౪ డిసంబరున ప్రారంభము. సాలుసరి చందా: రు ౪. విడిప్రతి అ ౧-౨, సంపాదకుడు. ప్రకాశకుడు : శ్రీ కొంపెల్ల జనార్దన రావు, ౧౩, ఆదెప్ప మొదలివీథి, వేపేరి, మద్రాసు.

'నవ్యసాహిత్య మహోదయమున వెలువడ్డ కావ్యధోరణుల అనుకరణములూ ప్రతిధ్వనులూసహా మ్రోయకమానని యీ గడియలలో నవ్యరీతుల ఒరళ్ళుచూపే పాశ్చాత్త్య సాహిత్యపీఠిని పదనుపడ్డ ఆశయములూ, ఆదర్శములూ, సాంప్రదాయకములైన ప్రాచ్యులకలాస్వప్నాలతో బాంధవించి అదనైన మెరుగులు దిద్దుతూ, ప్రతిభా వికాసక్రమమును పరిశీలించి వివరించగల విమర్శమూ, నలిగిన దారులనూ, తప్పక కొత్తదారులనూ చింపుకపడే స్రదచనలూ ఏకత్రపరుస్తూ సర్వవిధాల 'ఉత్తేజనం సంపాదించడంకోసమై' యీ పత్రిక 'చేయిచేసుకున్నది.' కావున 'రసాస్వాదనముబట్టి మనస్సుకు సంస్కృతి ప్రసాదించే ఉత్కృష్ట సాహితీకలాభ్యుదయానికి, ఈ 'ఉదయిని' సంతతము తూర్పుదిక్కయి ద్వారము తెరుస్తుంది. 'మొదటి తరగతుల వారి కౌశలాలు సేకరించుకొన్న మాత్రాన మురిసి ఆగక, పెరుగుదలచూపే చక్కని చేతుల విన్యాసాలకు తగినంతగా ఆహ్వానమీయడం' 'కర్తవ్యేతరము కాదనేసంగతి' మరువదు.'

సంపాదకుడు 'చదువుకున్న'వాడు; ఆరేడేండ్లపాటు భారతిపంచను నలిగి వెలికురికిన 'సాహిత్య వీరుడు': భావగతిలోను, రచనలోను 'నవ్యత మెరుగులు దిద్ద'గల 'సిద్ధహస్తుడు.' అతని 'సహజమయిన ప్రతిభ. ఉత్కటమయిన ఆశా, తొలిప్రాయము తొనికించు ఉత్సాహమూ' కట్టుకొన్న రూపు ఈ 'ఉదయిని.'

ఈ తొలి సంచిక నింపుకొన్న గద్యపద్య ఖండ కావ్యములను రచియించిన వారు నవ్యసాహిత్య ప్రియులగు భావుకులు; ఆంగ్ల సాహిత్యాధ్యయనమువలన హృదయము పొంగినవారు. ఆ పొంగు వారి రచనములయం దొలికియున్నది. అన్ని రచనములు 'నవ్యసాహిత్య' మనుపేరును చెల్లించుకొనునవి. రచనములయం దచ్చటచ్చట భావములకుగల ప్రాధాన్యము భాషకు లేకుండుట కనుపట్టుచున్నది. ఇది 'నవ్యసాహిత్యము'న కుపలక్షణము.

పద్యరచనము లన్నింటిలో శ్రీవేమల సత్యనారాయణశాస్త్రి రచనము లగ్రస్థానము నలంకరించినవి. ఆయన ప్రాచీన సాహిత్యపారమును తెలిసినవాడు; నవీనసాహిత్యము సౌందర్యమును గుర్తించినవాడు. రెండింటి మిశ్రణమున హృద్యములయిన రచనలయం దాయనచేయి బాగుగా తిరిగినది. ఆయన రచనములయందు పలుకులచేతను, భావములచేతను మదికి చల్లదనమును గూర్చు హాయి గలదు.

గద్యరచనములలో శ్రీ కవికొండల వెంకటరావుగారి 'ప్రేమతత్వం' అను కథ అగ్రస్థానమున నిలిచినది. అది ప్రేమతత్త్వమును సొగసుగ పట్టియిచ్చుచున్నది,

ఈ రెండింటికి తగినస్థాము నిచ్చి సంపాదకుడు సవిమర్శకమగు గుణ గ్రహణశక్తిని ప్రకటించుకొనినాడు.

'వాఙ్మయవీథి' యందు సాహిత్య విమర్శ సరసముగ నడచినది.

'శృంగాటకము' సంపాదకుని వివిధ నిపుణ సమాలోచనములకు నెలవు.

సంచిక స్వరూపము లోపల, వెలుపల కూడ రమణీయమయి నవ్యవాస నల నీనుచున్నది.

'లోక ప్రవృత్తినంతనూ కలవరపరిచే ఆర్థిక మాంద్యముకోజులలో' 'సద్గ్రంథము'తో పత్రికను 'నింపుకొనడమే చేయినిండిన పని' అయియున్నను నవ్యసాహిత్యాభ్యుదయము నాశించి యిట్లుత్తమపథమున నీపత్రికను ప్రకటించు టకు దొరకొనిన ఈ సాహసిక సంపాదకునికి భావుకులగు 'చదువుకున్న వారు', ఆ 'చదువుకున్న వారి'యెడ, 'చదువు'నెడ నభిమానము గలవారు సాయము 'నందిచ్చి బుజాలుకలిపినచో వారికి అబ్బుర పాటుతో కృతజ్ఞత వందించడం కంటె మించి, వారిమనస్సులో కబలించిన సౌందర్యము చూచి ముగ్ధమాంగల్యా ములు' ఏరుకొనును 'ఉదయిని.'

(భారతి 1935 సంపుటి 12 సంచిక 1)

జనార్ధనరావుగారు క్షయవ్యాధి పీడితులై అకాలంలో, 25 సంవత్సరా లకే మృత్యువువాత పడ్డారు. ఆంధ్ర రచయితలు, కవులు, పండితులు, పరిశోధకులు, పత్రికా రచయితలు—అందరూ దుఃఖించారు, భారతి పత్రిక సంపాదకులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు భారతిలో వ్రాసిన 'కన్నీరు' పండితలోకం ఆవేదనను ఎలా తెలుపుతున్నదో పరికించండి:-

## కన్నీరు

### శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య

ఇంచుమించు ఇరవయి అయిదేండ్ల లేప్రాయంలో జీవిత సౌఖ్యాన్ని ఏమాత్రమూ అనుభవించడానికి నోచుకోకుండానే ఏడెనిమిది నెలలపాటు క్షయతో నవిసి నవిసి కృశించి, అసలే దుర్బలమూ, కృశమూ అయిన శరీరం శిథిలం కాగా సహృదయుడు జనార్ధనరావు అపమృత్యువు పాలయి పోయినాడు. కొని తెచ్చుకున్నాడు ప్రాణాంతకమయిన పాడు జాడ్యాన్ని ఆలోచనలేకుండా. తన పనే అది అన్నట్లుగా ఆ జాడ్యం జనార్ధనరావును మింగివేసింది.

జనార్ధనరావు వయసులోనూ, అనుభవంలోనూ చిన్నవాడే కాని వ్యక్తి గత గుణాల్లో ఎంతో పెద్దవాడు. ఆంధ్ర సాహిత్య సంస్కార విషయంలో

అతనికి ఎన్నో భావాలు! ఎన్నో ఊహలు! కొన్నయినా రూపు కట్టుకుంటేనా? ఏవేవో ఆశలు! కొన్నయినా తీరడమంటూ ఉంటేనా? ఎంతో విజ్ఞానం! అది బయట పడడానికి తగిన అవకాశం లభిస్తేనా? ఏమిటేమిటో ప్రయత్నాలు! సాయందొరికి ఏపాటయినా సఫలం అయితేనా అవి? ఏదీ లేదు. అన్నీ అరకొరలే. అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా శ్రమపడ్డాడు. అంతా నిష్ప్రయోజనమే. అంతటా ఆశాభంగమే. ఆ పాట్లన్నీ ప్రాణానికే ఎసరుపెట్టినవి. అతని జీవన జ్యోతి కాస్తా ఆరిపోయింది. ఇంక జనార్దనరావు లోకం కండ్లకు కనుపడడు. మనస్సులో మాత్రం పరిచితులకు అతని చిన్నినవ్వుముఖమూ, మెరుగులు చిమ్మే కండ్లూ, అమాయకతను ప్రకటించే పొందికా, వీటితో అతని ఆకృతి పొడగట్టుతూ ఉంటుంది ఎల్లప్పుడున్నూ.

ఎనిమిదేండ్లకు పూర్వం 'భారతి' సంపాదకవర్గంలో ఒకడుగా ప్రవేశించాడు. ఐదారేండ్లపాటు తనకని ఏర్పడిన, ఏర్పరిచిన పనులను జవాబు దారితో నిపుణతతో నిర్వహించాడు. అతని ప్రవర్తనలో కలుపుగోలుతనం ఉంది. కానీ ఆత్మగౌరవానికి ముందు దానికి చోటులేదు. అలాటిదే యుక్తమయిన ప్రవర్తన; మిక్కిలి మెప్పునుపొందే ప్రవర్తన.

జనార్దనరావు పాండిత్యంలో అంత పెద్దకాదు; కాని సంస్కారంలో పెద్ద. అందులో పెద్దపండితులనబడే పలువురెంతో చిన్న లతనికి. ఇటీవల అతడు, పాపం, పెద్దపాండిత్యంకోసం ప్రాచీ ప్రతీచీ సాహిత్యక్షేత్రాల్లో నిరంతరం కృషి చేయడానికి పూనుకున్నాడు. బతికే ఉంటేనా, కొలదికాలంలోనే ఉభయక్షేత్రాల్లోనూ గొప్ప పాండిత్యాన్ని పండించుకోగలిగేవాడే. ప్రాచీన నవీన విజ్ఞానాలు రెంటిలోనూ మేలువాటిని ఏరుకోగల శక్తి అతనికుంది; వాటిని ఉపయోగించుకొనే శక్తికూడ ఉంది. అన్నింటికి కొత్తదనాన్ని తేవాలనేది అతని సంకల్పం. అందుకనే కొత్తపక్కి రచనలో తనభావాలను కొత్త మార్గంలో వ్యక్తీకరించేవాడు. అందులో ప్రత్యేక వ్యక్తిత్వం ఆయనదే.

అతని హృదయంలోవలెనే అతని రచనల్లో భావాలు చాలా లోతులో ఉంటవి. రచనలోబరువు ఆ భావాలని పైకి తేలనీయకుండా తొక్కిపెడుతూ ఉంటుంది. అందుచేతనే ఆ లోతుల్లో ఉండే భావ విశేషాలు సామాన్యంగా అందవు. అందజేసుకోడానికి ప్రయత్నం చేద్దామన్న బుద్ధికూడ పుట్టదు ఆ రచనను చూస్తే చాలామందికి.

జనార్దనరావు బుద్ధి చాలా చురుకయింది; స్వభావం స్వతంత్రమయింది. మోమోటం అంటే ఏమాత్రమూ గిట్టదు; చెప్పవలసింది చెప్పేటప్పుడు వెనక ముందులు చూడడమనేది లేదు. కాని సౌహార్దానికి మాత్రం భంగం కలగదు.

అతను విమర్శనలు చాల సున్నితంగాను ఉదారంగాను నడిపిస్తాడు. అందులో పక్షపాతం ఉండదు. గుణదోషపరిశీలనం సప్రమాణంగా, తిరుగు లేకుండా ఉంటుంది.

అతని రచనలన్నింటిలోనూ అతని భావి ప్రయోజకత్వాన్ని స్ఫురింప జేసే ఒక విలక్షణత ఉంది. కాని అతనే లేకుండా పోయినాడు.

అతనిలో చిరకాలాన్నుండి ననలు సాగుతూ ఉండిన ఊహలు పండి ఉదయిని పుట్టుటకు బీజాన్ని తయారుచేశాయి. దానికోసమని మూడేండ్లనాడు భారతిని వదలుకున్నాడు. ఒక్క ఏడాదిపాటు దానిని ఎలాగో సాగించాడు. అవతల సాగుదలకు ధనాభావం అడ్డుతగిలింది. పెట్టుబడికి తనవద్ద పైసా లేదు. పైవాళ్ళ దయాదాక్షిణ్యాలమీద ఆశపెట్టుకొని ఎంతకాలం సాగించవచ్చు 'ఉదయిని' లాంటి పత్రికను? వెనుకకు పడిపోయింది పత్రిక. ఎట్లా దాన్ని ముందుకు తేవడం అనే బెంగ పట్టుకుంది అతణ్ణి. ఉపాయాలు ఆలోచించ డంలో, ప్రయత్నాలు చేయడంలో ఎంతో శ్రమపడి క్షీణిస్తూ ఉండే అతణ్ణి సులువుగా క్షయ ఆక్రమించింది. దాంతో క్షయించి రూపుమాసిపోయినాడు తాహత్తు తెలియని జనార్దనరావు. ఉదయిని, దాని గొప్పతనం ఏమయిన నగుగాక, సహృదయుణ్ణి జనార్దనరావును తుదముట్టించడానికి ఉదయించింది. లేకుంటే ఎంతకాలం బతికేవాడో, ఎంత ప్రయోజకుడయ్యేవాడో, స్వస్థంగా జీవితం గడుపుకుంటూ ఉంటే. అంతా మూణ్ణాళ్ళ ముచ్చటయిపోయింది. నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలో అతని చరిత్ర ఒక పెద్ద అధ్యాయం కావల సింది. ఆ అధ్యాయం ఈవిధంగా, ఇంతలోనే, ఇట్టే ముగిసిపోయింది.

(భారతి 1937 జులై)

"భారతి ఆఫీసులో గన్నవరపువారేగాక ఇతరులు ఉండేవారు. కొంపెల్ల జనార్దన్‌రావుగారనే యువకుడు పనిచేసేవాడు. సంస్కృతం కూడా ఎరిగిన వాడు. హరనాథ్‌బాబా భక్తుడు. భగవంతుడు చిన్నచూపు చూసేడు. చిన్నతనం లోనే పరమాత్మను చేరుకొన్నాడు. టి. వి. రంగాచార్యులుగారు కొత్తగా చేరేరు."

**వేకుమళ్ళ కామేశ్వరరావు**
నా వాఙ్మయ మిత్రులు
1966, పే. 22

మా "జన్ని" మమ్ములని దుఃఖ సముద్రంలో ముంచి ఇహయాత్ర ముగించాడు. తన నిష్కళంకమైన ప్రవర్తనతో మాకు ఆదర్శం చూపించాడు.

తన అపారమైన ప్రేమతో మమ్మల్ని బంధించాడు. స్నేహితుల ప్రేమతో తన ఆత్మకి శాంతి నెలకొల్పుకొన్నాడు.

మమ్ములను దుఃఖ సముద్రంలో ముంచి యీ యాత్ర చాలించాడు మాజన్ని.[1]

తె. రత్నాజీరావు
28. 6. 1937

## నవ్య సాహిత్య పరిషత్తు

విద్యావ్యాప్తి చురుకుగా, వేగంగా జరగాలంటే భాషకు ప్రాధాన్యంకాక విషయానికి ప్రాధాన్యం ఉండాలి. కేవలం భాషాభ్యాసం కోసమే జీవితమంతా వ్యయమైతే ఇక విషయ పరిజ్ఞానం ఎప్పుడు? విషయ పరిజ్ఞానం దైనందిన వ్యవహృతభాషలో సులభంగా త్వరగా కలుగుతుంది. అప్పుడు దేశంలో విద్యావ్యాప్తి వేగం పుంజుకుంటుంది. ఈ దృష్టితో నలుగురు విద్యావేత్తలు జె.ఎ. ఏట్స్, పి.టి.శ్రీనివాస అయ్యంగార్, గురజాడఅప్పారావు, గిడుగురామమూర్తి గార్లు దైనందిన వ్యవహారభాషలో బోధనను పాఠశాలలలోను, కళాశాలలలోను ప్రవేశపెట్టాలని 1910 లో ప్రయత్నించినప్పుడు ఆంధ్రదేశమంతటా పండితులు భాష పాడయిపోతుందని, విద్యావిధానం నాశమైపోతుందని పెద్ద ఆందోళన చేశారు. వ్యవహార భాషోద్యమాన్ని ఎదుర్కొనడానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు అనే సంస్థను స్థాపించారు గ్రాంథిక భాషావాదులు. దానికి పెద్ద అంగబలమే సమకూరింది. ఈ పరిషత్తు 1913 లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక అనే పేరుతో ఒక పత్రికను వెలువరించింది. ఈ పత్రిక ముఖపత్రంపై "దేశభాషలందు తెలుగు లెస్స" అనే వాక్యాన్ని పరిషమ్ముద్రగా ప్రచురించారు. ఇది మొదట మాసపత్రికగాను, పిదప త్రైమాసికంగాను మారి నేటి వరకూ వెలువడుతూంది. ఈ పత్రిక, ఈ పరిషత్తు తెలుగుభాషా సాహిత్యాలకు అపారమైన సేవ చేశాయనడంలో సందేహంలేదు. వివిధ వర్గాలకు చెందిన పండితులు, కవులు దీనిలో వ్రాసేవారు. (ఈ విషయం కొంత ఇదివరకే చెప్పాను.)

ఈ పరిషత్తు గ్రాంథిక భాషారక్షణమే ధ్యేయంగా పనిచేస్తున్నందున గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలయిన వ్యవహార భాషావాదులు వ్యవహార భాషావ్యాప్తి కోసం అభినవాంధ్ర పండితసభ పేరుతో 1933 మార్చిలో

---

1. కొంపెల్ల జనార్దనరావు జీవితం - సాహిత్యం : డాక్టర్ ఏటుకూరి ప్రసాద్.

బరంపురంలో సమావేశమయ్యారు. దీనికి డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు అధ్యక్షత వహించారు. ఈ సభ రెండవ సమావేశం 1933 డిసెంబర్‌లో రాజమండ్రిలో జరిగింది. దీనికి రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. ఆ సమావేశంలో ఈ అభినవాంధ్ర పండిత సభ నవ్యసాహిత్య పరిషత్తుగా మారింది. కాని కేంద్ర కార్యస్థానం గుంటూరని నిర్ణయమైంది. ఆంధ్ర సాహిత్య పరిషత్తులాగే నవ్యసాహిత్య పరిషత్తు కూడ కొన్ని కార్యక్రమాలు చేపట్టి, లక్ష్యాలు ఏర్పరచుకొని ఆ లక్ష్యసాధన కోసం కృషి చేసింది. వివిధ ప్రదేశాలలోని కవులను, రచయితలను ఒకచోట చేర్చడం, సభలూ సమావేశాలూ జరుపడం, వార్షికోత్సవాలు జరుపడం, ప్రచారంకోసం ఒక పత్రికను ప్రచురించడం మొదలయినది ఈ కార్యక్రమం.

## ప్రతిభ

నవ్యసాహిత్య పరిషత్కార్య క్రమాలలో భాగమైన పత్రికగా ప్రతిభ 1936 లో వెలువడింది. దీని సంపాదకులు తెలికచర్ల వెంకట రత్నంగారు. ఇది నవ్యసాహిత్యానికి మహావేదికగా వినియోగపడింది. ఇది గిడుగురామమూర్తి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, చింతా దీక్షితులు, నోరి నరసింహశాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావు, పాలగుమ్మి పద్మరాజు మున్నగు వారి రచనలను ప్రచురించేది. ఇది గుంటూరు నుంచి వెలువడేది.

దీని తొలిసంచికను 'ఉదయిని' సంపుటి 1 సంచికలలో సమీక్షించింది. ఆ సమీక్ష ప్రతిభ ఉద్దేశాలను, స్వరూప స్వభావాలను వివరిస్తుంది గనుక దానిలోని కొంతభాగాన్ని ఇక్కడ ఉట్టంకిస్తున్నాను:-

**ప్రతిభ**

నవ్యసాహిత్య పరిషత్పత్రిక. మొట్టమొదటి సంచిక. సంపాదకుడు తెలికిచర్ల వెంకటరత్నం. నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు. వెల ౮ అణాలు. సంవత్సరపు చందా ౨ రూపాయలు. త్రైమాసికి.

నవ్యసాహిత్య పరిషత్కార్యాలలో ఒకటైన పత్రికా నిర్వహణము ప్రారంభమైనది. 'ప్రతిభ' తొలి సంచికలో సంపాదకులు నవ్యసాహిత్య పరిషత్తు చరిత్రము ౧౯౩౩ లో అది యేర్పడ్డది మొదలు వివరించి దాని లక్ష్యాలను, కార్యవిధానమును వివరించినారు. మరిన్ని వివిధ సారస్వత, విద్యావిషయాల పైని అభిప్రాయాలు వెల్లడించి పత్రికకు గొంతు ఉన్నదని చూపినారు. ఇందలి వివిధ వ్యాసాలున్ను నవ్యసాహిత్యపరములై పరిషత్కార్య పరాయణతకు అత్తి ఉన్నవి. కాకినాడలో జరిగిన నాలుగవ పరిషత్సమావేశానికి అధ్యక్షులైన కావ్య

వ్యాకరణ తీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అధ్యక్షోపన్యాసము, 'ఆంధ్రవాఙ్మయం: పుట్టుపూర్వోత్తరాలు' అన్నది, పేరుకు తగి ముఖ్యంగా సాహిత్యచరిత్రాన్ని అంతను సంగ్రహముగా పరామర్శిస్తున్నది. '....పురాణాలు తెలుగులోనికి తర్జుమాలు చేసినా, లేక పురాణాల ఆధారాలమీద పెంచి ప్రబంధాలుగా మూటకట్టినా, ఫలితం ఒక్కవిధంగానే ఉంది కాబట్టి........... క్రీస్తుశకం 19వ శతాబ్ది ఆఖరుదాకా ఉన్నసాహిత్యం పురాణసాహిత్యం అన్నమాట' అని వీరు ఆ సాహిత్యమునంతనూ ఒక్కమూటకట్టి, 'పరిశేష న్యాయం చేత....పురాణసాహిత్యం కానిదంతాగాని, లేక, ఈ నవయుగంలో [పరిశేష న్యాయంచేత 19వ శతాబ్దికి ఇటీవల] ప్రాదుర్భవిస్తూ ఉన్న సాహిత్యం గాని, నవ్యసాహిత్యంగా మనం అనుకోవచ్చు' అని నవ్యసాహిత్యాన్ని విడదీసినారు. ప్రబంధవాఙ్మయముపై వీరుపోసిన విమర్శనమును బట్టి సహా పురాణాలకంటె భిన్నమైన 'ఫలితం' వాటివల్ల కనబడుతున్నప్పటికీ అవి పురాణయుగములోనే అణపబడ్డవి. 'ఫలితము'ను బట్టియే సాహితీలక్షణ నిరూపణము కాని, ఈ యుగవిభజనము కాని చేయుట ఒప్పిదమే అని వీరి అభిప్రాయముగా కన్పడుతున్నది. నవ్యసాహిత్యమునందు విశిష్టత వివరించ పూనుకొన్న వీరు దానిని ఆ విశిష్టతను బట్టి విడగొట్టితే బాగుండేది. కాని, ఆంధ్రసాహిత్యమున్నూ, సంస్కృత ప్రాకృతాది సాహిత్యములున్నూ విరివిగా తరిచిన శ్రీ శాస్త్రిలుగారు నవ్యసాహిత్యమును గర్హించేవారిని తీవ్రముగా విమర్శించి నవ్య సాహిత్యాన్ని సమర్థించడానికి తొలినుండీ పూనుకొన్న ప్రఖ్యాతి సామర్థ్యాలకు వీరి అధ్యక్షోపన్యాసం తగియే ఉన్నది. కుందూరి ఈశ్వర దత్తుగారు 'శాసనములలోని తెలుగు భాష' అనే వ్యాసమునందు ఆ భాష నుండి మచ్చుకి కొన్ని విశేషాలను చూసి అవి వైయాకరణులకూ నిఘంటు నిర్మాతలకూ ఉపయోగకరములని చెప్పినారు. ఇందు "అందు" కళ అని వీరు చూపిన ఉదాహరణాలు తమ పని తాము చేయవు. కాని యిందు కొన్ని విశేషాలు (విరివిగా లేకపోయినా,) లేకపోలేదు. ఛందశ్శాస్త్రరహస్యాన్ని గాలించిన శ్రీ గిడుగు సీతాపతిగారు 'పద్యరచన' అనే ముచ్చటైన వ్యాసం వ్రాసినారు. వృత్తాదులలో సహా పాటలలోవలె 'తాళము' గుప్తముగా, ఉంటుందనీ, కేవలము మూడక్షరముల గణము ఏర్పరచుకొని వాటి లెక్కతో కట్టిన పద్యలక్షణము లయగతులకు అనుకూలపడక వికటగతులు కూడా బోధించేది కావడానికి వీలుండడంచేత పద్యలక్షణం లయ ప్రధానంగా అవగాహన చేసుకోదగుననీ, మరిన్నీ అక్షరాల ఊతను (accent) బట్టి నడక మారుతూ

ఉంటుంది కాబట్టి, కేవలం గణ ప్రాధాన్యమును పాటించక నడకను పాటిస్తూ నడకలు ఎన్ని రకాలుగానో నడిపించుకోడానికి వీలుండగా, సంప్రదాయ విరుద్ధ మని జంకక ఆంగ్లకవులవలె వివిధ చ్ఛందోగతులు సృష్టించుకొని నవ్యకవులు రచన సాగించవలెననీ, కృతకభాషను వదలి వ్యావహారికము పాటలకూ పద్యాలకూ ఉపయోగపరుచుకో చెల్లుననీ, వాడుకభాషకు సహా ఛందస్సు ప్రతికూలమని యెంచనక్కరలేదనీ వీరు ఇంపుగా తెలిపినారు. ఆంగ్లమున మిస్ కాథరీన్ విల్సన్‌వలె వీరు మన ఛందస్సును సంగీతశాస్త్ర దృష్ట్యా పరిశీలించడానికి పూనుకొన్నారు. సంగీతశాస్త్ర జ్ఞానము కవికి ఉపయోగపడే పరికరాలలో ఒకటి అన్నది నిజమే కాని, దానికి అమిత ప్రాముఖ్యము నిచ్చిన ప్రమాదమునకు పాల్పడకపోతే వీరి భావాలు ఛందస్సంస్కారానికీ, తదవగాహనానికీ చాలా మార్గదర్శకములు. మండపాక పార్వతీశ్వరశాస్త్రిలుగారు 'రాష్ట్రేతరాంధ్రులు-నవ్యసాహిత్యము' అనే వ్యాసం వ్రాసినారు. సంపాదకులు తెలికిచర్ల వెంకటరత్నంగారు 'భాషా సంస్కరణము' అనే వ్యాసంలో మనభాషకు గల సంస్కరణావశ్యకతనుగురించి చర్చించినారు. చింతా దీక్షితులుగారి 'సూపరెంటుకూతురు' అనే కథ, శ్రీరంగం శ్రీనివాసరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, నోరి నరసింహశాస్త్రి ప్రభృతుల పద్యాలు మంచి సాహిత్య రచనములు. నవ్య సాహిత్యములో నవ్యతరగతులు చూపే శ్రీనివాసరావుగారి రచనలు మరికొన్ని రచనలతోపాటు ఈ సంచికకు తగిఉన్నవి. బ్రహ్మశ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారున్ను, డాక్టరు బుర్రా శేషగిరిరావుగారున్ను వ్రాసినజాబులు నవ్య సాహిత్యము గురించి ఉద్బోధము ఇస్తున్నవి. గ్రంథ సమీక్షలతో, సంపాదకుల విజ్ఞాపనములతో, అందమైన తీర్పుతో ఇది మంచి పత్రికలలో ఒకటై ప్రవేశిస్తున్నది.

(ఉదయిని సంపుటి 1. సంచిక 6)[1]

## వీణ

కృష్ణాజిల్లా తెలప్రోలు నుంచి పాటిబండ మాధవశర్మ, రాజగోపాల్‌గార్లు 1936 నుంచి నడిపిన వీణ వ్యావహారికభాషావాదానికేగాక, నవ్య సాహిత్యానికి కూడ పట్టుగొమ్మయింది. 1935 జనవరి నుంచి వెలువడుతున్న ఉదయిని వీణను ఇలా సమీక్షించింది:-

---

1. కొంపెల్ల జనార్దనరావు జీవితం - సాహిత్యం : డాక్టర్ ఏటుకూరి ప్రసాద్.

సర్వవిషయాలూ ప్రసంగించే మాసపత్రిక. కాని, లలితకళా విమర్శకు, సాహిత్య రచనములకూ ప్రాధాన్యమిచ్చి చక్కని రచనములు వెలువరుస్తున్నది. దీనికి మంచి రచయితల తోడ్పాటు కలదనుటకు పెక్కుశాఖల కృషిచేస్తున్న సారస్వతులు దీని సంపాదకవర్గము నలంకరించడమే తార్కాణం. ముఖ్యంగా యువజనుల ఉత్సాహానికి ముఖపత్రం కాగల సూచనలు దీనిలో కనబడు తుండడం ప్రశంసార్హము. అనేక విధాల పత్రికా నిర్వహణం, కష్టసాధ్యమైన ఈ దేశాన, ఈ రోజులలో తక్కిన అన్ని పత్రికల కంటె ఖరీదైన కాగితముతో, మంచితీర్పుతో, ఏబదిపుటల గ్రంథం ఇంత తక్కువ చందాకు అందజేయ పూనుకొన్న యువజనుల పూనిక మిక్కిలి కొనియాడ దగ్గది.

(ఉదయిని సం. 1, సంచిక 6.)

వీణ 36 జులై సంచికలో గిడుగు వారిని గురించి ఈ విధంగా సంపాద కీయం వ్రాసింది:-

**గౌరవాచార్య పదవి**

అసలు పంతులుగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రత్యేక పీఠం ఏర్పడందే తెనుగుశాఖకి పూర్ణత్వం లేదు. రామమూర్తి పంతులుగారు నవ్యాం ధ్రానికి చేసిన సంస్కారాలను యూనివర్శిటీ స్వీకరించి అమలు జరపడం పవిత్రమైన ధర్మమై వున్నది. ఆంధ్ర యూనివర్శిటీలో తెనుక్కి రీడరేనా లేదు. పంతులుగారి విజ్ఞానాన్ని యూనివర్శిటీ వారు దేశాభ్యుదయానికి వినియోగించ దలిస్తే వారిని వెంటనే ఏ రీడరుగానో నియమించాలి. అంతేగాని గౌరవా చార్యుడుగా కాదు, ఎంత వ్యయం, ఎంత ప్రయాస సహించి ఇంత విజ్ఞానాన్ని కూడబెట్టారో పంతులుగారు! ఇంతా తెలిసిన యూనివర్శిటీ ఆ విజ్ఞానరాశి అంతా ఉచితంగా వినియోగించుకుంటుందా? పంతులుగారిని ప్రొఫెసరుగా, కనీసం రీడరుగానయినా నియమించాలి. వారి వృద్ధాప్యం శిష్యకోటిమధ్య నిశ్చితంగా, ప్రశాంతంగా ప్రవర్తిల్లాలి. ఈ గౌరవం యూనివర్శిటీ దక్కించుకోవడం ఉచితం. యూనివర్శిటీలో ప్రొఫెసరై పంతులుగారు, వృద్ధసింహం, వ్యావహారిక భాషావాదం గర్జిస్తుంటే, విద్యార్థులు ఆంధ్రభాషని ఉద్ధరించబోతున్న బాలవీరులు వింటూ తన్మయులవుతుంటే అది దివ్యదర్శనం. అది నిజంగా యూనివర్శిటీకి చరితార్థత!

'వీణ' 1937 ఫిబ్రవరి (సం. 2. సం. 1, 2) సంచికలో గిడుగువారు సందేశం ప్రచురించారు. అది పఠనీయంగా వుంది.

**సందేశము**

మహాశయా! వాడుకభాష, శిష్ట వ్యవహారములో ఉన్నదైనా, కావ్య రచనకు పనికిరాదనీ, అట్టి భాషలో కావ్యములు ఎప్పుడూ ఎవ్వరూ రచించ లేదనీ ఇరవయి అయిదు సంవత్సరాలయి ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పట్టుదలతో ప్రకటిస్తూ, నవ్య సాహిత్యము తలయెత్తకుండా అణగద్రొక్కడానికి యథాశక్తి పాటుపడుతున్నారు; గాని వారి ఉద్యమము నిష్ఫలమయినది. నవ్య సాహిత్యమందు అభిరుచి దేశములో వ్యాపిస్తూ ఉన్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ఆదరిస్తూ ఉన్న కవులకూ పండితులకూ ఎంత మాత్రమూ తక్కువకాని కవులూ పండితులూ కలిసి నవ్యసాహిత్యము నిర్మిస్తున్నారు. శిష్టులు వాడుకొనేదే దేశభాష: దేశస్థులకు అందరికీ ఉపకరించే గ్రంథాలు ఆ భాషలోనే రచించడము సదాచారముగా ఇంగ్లండు మొదలయిన దేశములలో భావిస్తారు.

పత్రికా సంపాదకులందరూ నవ్య సాహిత్య నిర్మాణ కార్యమందు దీక్ష వహించి ఆసక్తితో పనిచేస్తే అన్నివిధములా దేశము వృద్ధి పొందుతుంది. భాషాభిమానముతోటిదే దేశాభిమానము.

వాడుకభాష కావ్యమందు నిషిద్ధముకాదు. అది ప్రయోగించడంవల్ల "రసము" చెడదు. అర్థము శబ్దమును విడిచి వుండదు. వినగానే అర్థమును స్ఫురింపజేసే శబ్దాలుకూర్చి పద్యముగానీ, పాటగానీ రచిస్తే, వికసించిన పువ్వుల దండవలెను, సుగంధద్రవ్యములతో చేసిన కలపము వలెను, హైయంగవీనముతో చేసిన వంటకము వలెను ఇంపుగా ఉంటుంది. కేవలమూ కళా కౌశలము మెచ్చుకోగలవారు ఎవరో ఉంటారు శాస్త్రజ్ఞులు.

గుంటూరు — ఇట్లు విన్నవించే

1937 సం. జనవరి 24. — గిడుగు వేంకటరామమూర్తి

కొంపెల్ల జనార్దనరావుగారు కీర్తిశేషులయినప్పుడు వీణలో శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ఈవిధంగా ఆవేదన వ్యక్తపరచారు:-

ఉదయిని ప్రారంభించినప్పటినుంచీ ఆయనతో నాకు లేఖల ద్వారా పరిచయమున్నా, ఆయనతో ముఖ పరిచయం కలిగింది ప్రథమములో ౧౯౩౬ ఫిబ్రవరిలోనే, అయితే మాకు శీఘ్రంగా మైత్రి ఏర్పడ్డది. అందువల్ల అతని అకాల మృత్యువుకు నాకు కలిగిన విచారము వేరే చెప్పనక్కరలేదు.

అతనికి సంస్కృతాంధ్రములలో చక్కని వ్యుత్పత్తి ఉన్నది. ఆంగ్లభాషా జ్ఞానమువల్ల దానికి మెరుగు వచ్చి అతను చక్కని రసజ్ఞతను అలవరుచు

కున్నాడు. మితభాషి. అన్ని అర్థములలోనూ అతనొక మౌని. సారస్వత సేవకు మహా తపస్సు చేస్తూ ఈ జన్మలో సిద్ధిపొందకుండా గతించినాడు. మన సంప్రదాయ ప్రకారము తపస్సు వృధాపోదు. అతని వ్రాతలన్నిటిలో ఆ తపస్సే ప్రతిఫలిస్తున్నది.

రేపల్లె
౧౬-౨-౩౨

**నోరి నరసింహశాస్త్రి**

[వీణ, సంపుటి 3 సంచిక 2]

## ఆంధ్రి

1946 లో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రి సుమారొక సంవత్సరం వెలువడింది. శాస్త్రిగారు కళా ప్రపూర్ణులు. ఆంధ్ర పురాణం, ఆంధ్ర రచయితలు మున్నగు బహు గ్రంథాలు రచించినవారు.

వేంకట రామకృష్ణ కవులు, వేలూరి శివరామశాస్త్రి వంటి దిగ్దంతులు ఇందులో రచనలు చేశారు. కుందూరి ఈశ్వరదత్తుగారు ఆంధ్రిలో "ఆంధ్రి" అనే శీర్షిక కింద అంధ్ర మహిళల కుచసౌష్ఠవం గురించి వ్యాసం వ్రాశారు. "ప్రౌఢాంధ్రీ స్తనపీడితం" అని రాజశేఖరకవి వర్ణించుకున్నాడని, ఒక కర్నాట శాసనంలో రాజు "ఆంధ్రీ నీరంధ్ర బంధుర స్తనహర" అని వర్ణితుడయ్యాడని, మరొక శాసనంలో మారాంబిక అనే రాణిని "ఇభ కుంభ తుంగ ఘన స్తవ ద్వంద్వ భరానతాంగీ" అని శాసనకవి వర్ణించాడని, "ఇవన్నీ ఆంధ్రమహిళల శరీరావయవ శోభా సౌభాగ్య గరిమమును సూచించునవియే" అని అన్నారు.

"ఆంధ్రస్త్రీలు ప్రాచీన కాలమందు రవికయు బయ్యెదయు ధరించు టెరుంగరు. అమరావతి స్తూపము మొదలయిన ప్రాచీనాంధ్ర శిల్ప స్థానములను జూచినచో నీ విషయము విశదముకాగలదు. ఈ ఆచారమింకను ద్రవిడ మలయాళ దేశములందున్నది. ఆంధ్రదేశమునకు మహారాష్ట్ర ఘూర్జరదేశ సంపర్కము గలిగిన తరువాత మనదేశస్త్రీలు రవికెలు ధరించుట కలవాటు పడిరి. దానితో బైటయు నలవాటయినది. మొదట గటి ప్రదేశమునకు పైభాగమున కంచెలయు, నదివిడిచి రైకయు, దరువాత రవికయు బైటయు ధరించుట యాచారమైనదని తలంచుచున్నాను. ఈ కాలమున గంచెలయు రవికయు, బైటయు గూడ నాంధ్ర యువతులు ధరించుచున్నను రవిక యుత్తర దేశాచారము, దాక్షిణాత్య నాగరకత మాత్రము గాదు." అని వారు సిద్ధాంతీకరించారు.

(ఆంధ్రి, జూన్ 1940)

శతావధాని శివరామశాస్త్రిగారు దీనిలో గారు శబ్ద విచారం జరిపారు. ఇది రసవత్తరంగా, హాస్యగర్భంగా ఉంది:

"కవులు పొగడువేళ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణము సేయువేళ రాకొట్టి పిలుతురు"

అనే ప్రాచీన పద్యం ఉదాహరిస్తూ, "ఆయా స్థలములలో రాకుండు గౌరవము గారుకు లేదు. ఇన్ని వేదములలో, ఇన్ని దర్శనములలో దేవుని చివర నెవరేని గారును చూచియున్నారా?" అని శాస్త్రిగారు ప్రశ్నించారు.

వాస్తవంలో గారు బహువచన ప్రత్యయమైన కళ్ కాళ్ వికృతి. మనకు లభించిన తొలి తెలుగు శాసనమైన ఎరుకల్ ముత్తరాజు శాసనంలో సిద్దనకాళు, పుద్దనకాళు (సిద్దనగారు, పుద్దనగారు) ఉన్నారు. బహువచన ప్రత్యయాన్ని గౌరవవాచకంగా వాడడం అప్పటినుంచే ఉంది.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారత సంగీత సంప్రదాయంలోని "ఆంధ్రీ" రాగాన్ని గురించి చర్చించారు. మతంగుడు తన బృహద్దేశిలో

విలాసినీతు పౌరాలీ వేగవంతీ తు పంచమా
ఆంధ్రీ గాంధారికా చైవ సత్స్యుః మాళవ పంచమమ్.

అని చెప్పిన మాళవ పంచమరాగంలో ఆంధ్రీరాగం ఉందని, కాని ఆ గ్రంథంలోనే ఆంధ్రీ రాగాన్ని వర్ణించిన శ్లోకం దోషభూయిష్ఠంగా ఉండడంవల్ల "ఆంధ్రులకు ఆంధ్రియను నొక విశిష్టరాగముండెనని తెలియుటయే మన కానందము. ఇట్టి కొండ గుర్తు లింకను దొరకుచో ఆంధ్రుల తొలుతటి సభ్యతను నిరూపింప గుదురును గదా!" అన్నారు.

(ఆంధ్రి, అక్టోబరు 1941)

జటావల్లభుల పురుషోత్తముగారి వాఙ్మయము-దేశాభ్యుదయము అనే వ్యాసం రచయితలకు, కవులకు కనువిప్పు కలిగించేది, దానిలో ఆయన ఇలా అన్నారు:-

"ఆర్థిక సాంఘిక నైతిక రాజకీయ వైజ్ఞానిక విషయముల నికృష్ట స్థితిలోనున్న ప్రజలను కవులు రచయితలు నుద్ధరింపవలసిన మార్గము లెన్నియో కలవు. ఇట్టి విషయముల గవు లెట్లు తోడ్పడగలరో తెల్పుటకు నొక యుదాహరణము నిచ్చెదను. గత శతాబ్దములో ఇంగ్లండులో ఫ్యాక్టరీలలో బనిచేయు బాలురు చాల కష్టములపాలు చేయబడుచుండిరి. మిసెస్ బ్రౌనింగ్ అను

కవయిత్రి బాలుర యీ బాధను హృదయ విదారకముగ వర్ణించుచు గొన్ని పద్యములను వ్రాసెను. అవి ప్రతి పార్లమెంటు మెంబరు హృదయమునకు దగిలినవి. కొలది దినములలో పార్లమెంటులో బిల్లు ప్రవేశ పెట్టబడి శాసన రూపము దాల్చినది. దానివలన నా బాలుర కష్టములు దొలగినవి.

* * *

"దేశము సర్వతోముఖ వైభవోపేతమై యలరారు కృష్ణదేవరాయల కాలమునగాని, భోజుని కాలమునగాని యెట్టి వాఙ్మయము బయలుదేరవలెనను ప్రశ్నకంత యావశ్యకత లేదు. కాని, జాతి సర్వవిధముల నూతన జీవము నొందవలసియున్న యీ దినములలో నదియే ముఖ్య సమస్య. రోము మండు చుండుగా బర్వతముపై గూర్చుండి సంగీతము బాడుకొనుచుండిన నీరో చక్రవర్తివలెగాక మన రచయితలు, కవులు దేశస్థితిని గూడ గొంత దృష్టిలో నిడుకొనవలెనని నా అభిప్రాయము."

(మే 1941-ఆంధ్రి)

నిడుదవోలు వెంకటరావుగారు గోపాలలీలా సుధాలహరి అనే కావ్యంపై వ్యాసం వ్రాశారు. ఇది వేంకటాద్రి కవికృత గోపికాంశుకాపహారమనే ద్విపద కావ్యానికి పద్యానువాదం. ఈ పద్ధతిని నిడుదవోలు వారు ప్రశంసిస్తూ "ఇదియును నొక మంచి పద్ధతియే. మూలగ్రంథములోని పాఠములుగాని, గ్రంథములో గొంత భాగము ఖిలమైనచో నా కొరవడిన విషయములనుగాని తెలిసికొనుట కీ పద్ధతి మిగుల దోడ్పడును." అన్నారు.

జయపురం సంస్థానాధీశులు విక్రమదేవ వర్మ కవులుగా, కవిపోషకులుగా, దాతలుగా ప్రసిద్ధులు, కథకులుగా కాదు. వారు ఒక ఫ్యాక్టరీలో జరిగిన దురంతాన్ని ఇతివృత్తం చేసి కథగా వ్రాయడం గొప్ప సహృదయతే. ఆ కథ చిన్నది గనుక ఇక్కడ ఉదాహరిస్తున్నాను:-

**అభాగిని - శ్రీ శ్రీ విక్రమదేవ వర్మ**

జయపుర రాజ్యాంతర్గత రాయగఢయందు శక్త్యుపకరణ కర్మాగారము గలదు. దానికి గొంత దవ్వు నందు రంగపల్లియను నొక చిన్నపల్లె యున్నది. అందు నా కర్మాగారమునందుఁ బాటుపడువారె నివసింతురు. ఆ పల్లె నడుమఁ గల బాట గులకఱాలతోడ నున్నగాఁ గావింపబడియున్నను. గొంపలు బిరుసు గల మట్టిగోడలతోడనె కట్టబడి వాని పెణకలు దబ్బగడ్డితోడ గప్పఁబడి యుండును. లోపల మట్టినూనె గల బుడ్లయందు వెలుఁగు దివ్వెలవలనఁగలుగు కఱదూపమును సాలెపట్లును నిండియుండును. ఆ కొంపలు మానిసులకె కాక

యెలుకలకును బొద్దింకలకును డెంకులు. ఆ పల్లెయందు నున్నవారు రోజునందు నెనిమిది గంటలు పాటుపడుటవలనఁ గలుగు కష్టమును బాపికొనుటకు సంజతఱిఁ గొంచెము కల్లుఁద్రాగి యించుక సుఖియింతురు. అప్పుడప్పుడు వారినడుమఁ గలుగు జగడములవలన వారి గొంతుకల నుండు తెమడ సమయు చుండును.

ఆ కర్మాగారమునందుఁ బాటుపడుటకై కమల యమ లలన యా పల్లెకు వచ్చి యొక గది యద్దెకుఁ గైకొనెను. అది తప్ప నందు నద్దెనిచ్చి కాఁపురము సేయువారు మఱేరును లేకుండిరి. అదియె యద్దెనిచ్చునది యగుటవలనఁ దాను లజ్జించుచుండెనో లేక గర్వించుచుండెనో యవ్విషయము దానిమదికె యెఱుక, దాని ప్రాయము రమారమి యిరువదియేండ్లు, శరీరము నాతి దీర్ఘము నాతి హ్రస్వమును; మఱి నాతిపీనమును; నాతిక్షీణమును; ఛాయ పదిరెండు వన్నెల బంగారు, అరాళ నీలాలకలు దాని శారదపూర్ణేందు వదనమున కొకింత యావరించి స్వల్పగ్రపిత గ్రహణాకారమును సూచించుచుండెను. కనులు గండుతుమ్మెదలను గలిగిన తెల్లతామరఱేకులను గేలిసేయుచుండెను. దాని యంగప్రత్యంగములు కవికల్పనాతీతములు, దానిని జూదు మగవారి చూపులె కాక, యాడువారి చూపులు గూడ సూదంటురాతికి సూదియంటుకొనునట్లు దానిమేని కంటుకొని కొంతసేపు నిలచుచుండెను. అది యొక్కతియెయైన నొరుల సాయమును గోరక మఱి యెరు జోలిని గలుగఁజేసికొనక తాను మేనుపంచి పాటుపడి గడియించు కూలివలనఁ గాలమును గడుపుచుండెను.

ఆ కర్మాగారముయొక్క కర్మపరీక్షకుని పేరు సూర్యమూర్తి. వాఁడవి వాహితుఁడు. వాని వయస్సించుమించిరువదియేండ్లు. వాని ముఖము ప్రసన్నము; నయనయుగము విశాలము, వక్షము విస్తృతము, వర్ణము కేతకీ కుసుమ సదృశము. వానిమనము కమలయందు లగ్నమయ్యెను. దానం జేసి వాఁడు పనిని బరీక్షించు నెపమునఁ గమలకడకుఁ దఱచుగా వెళ్ళుచుండెను. వాఁడు దానికడకు వెళ్ళునపుడది వానిని గ్రేకంటఁగని తనతలను వంచుకొని భయభక్తులతోడఁ దన పనిని జేసికొనుచుండెను. తనకడకె వాఁడు దఱచుగా వచ్చుచుండుట వలన వాని మనోభావము నది గ్రహించినను, దాని మనమునకు నూఱుపాటు గలుగకుండెను. ఇట్లు గొంతకాలము గడచెను.

వసంతఋతువు ప్రవేశించి జగమునకు నాతిశీతమును నాత్యుష్ణమును గలిగించెను. నవమాలిక పుష్పవతియై మధుపపాళి నాకర్షింపఁదొడగెను. ఫల భరిత రసాల సాలములపైఁ గూరుచుండి పికములు పంచమస్వరమును

జెల్లగించి విరహుల యుల్లములను దల్లడింప జేయసాగెను. ఆరామములు కిసల కుసుమ ఫలభరితములయి జననయనానందకరము లగుచు నొప్పెను.

నాఁడు పూర్ణిమా సాయంకాలము. ఆవులు మేఁత మేసి మఱలుచుండెను. ఖగములు నిజనీడములకు జేరుకొనుచుండెను. చంద్రుఁ డైంద్రిదిశిరముపైని, సూర్యుఁడు వారుణి శిరముపైని నిలిచి మారుఁడేయు హీరకమాణిక్య చక్రముల వలె విరాజిల్లుచుండిరి. అప్పటికే కర్మాగార కర్మకరులు దమపనులను ముగించి నిజనివాసముల కేగిరి. కాని - కమల మాత్రము తనపని ముగియ కుండుటవలను దానిని ముగింపఁ బని సేయుచుండెను. అవ్విషయమును సూర్యమూర్తి దెలిసికొని కమలకడ కేగి దానిమూఁపుపైఁ దనచేతి నిడి "కమలా! నిన్నును నీ పనుల నేర్పును గన నా డెందమున కెంతయో నానందము కలుగును. నీ తోడఁ గొన్ని మాటలాడవలెను. ఇక్కడ మాటలాడ వలనుపడదు, కనుక నీవు సందేహింపక యిప్పుడె నా మందిర మునకు ర"మ్మనెను. యువతీ యువకుల యేకాంత మేళన ముపద్రవకర మగును గదా! కమల వానికోర్కి కియ్యకొని వాని యింటి కేగెను. అది వాని గదియందుఁ బ్రవేశించినంతనె యా ధూర్తుఁడు దానిని గౌఁగిలించెను. వేఁడి తాఁకుడువలన వెన్న గరఁగకుండునా? అంతనుండి ప్రత్యేక నిశియందు నెవ్వరు నెఱుంగ కుండునట్లు కమల సూర్యమూర్తి మందిరమునకు వెళ్ళుచు వచ్చు చుండెను. కొంతకాలమున కది గర్భవతి యగుట దెలిసినంతనె వాని మదికి దిగులు కలిగెను. అంత వాఁడు దానిని బుజ్జగించి గర్భవిచ్ఛేదమును జేసికొన వలెననియు నట్లు చేసికొననిచో భరింపశక్యముగాని నింద గలుగుననియును దానికి బోధించెను. అది సమ్మతింపమి నా పాపి బెదరించెను. కాని - కలుగఁబోవు నిందకు నప్పటి బెదిరింపున కది సరకుసేయక "నేనా పనిని జేయ"నని దృఢముగాఁ జెప్పెను. మాతృవాత్సల్య మధికతమము కదా! అవిశ్వాసఘాతుకుడు దానియందులేని దోషము నారోపించి దానిని గర్మాగారము నుండి తొలఁగించెను. అది మఱుమాటాడక విదేశమున కేగెను. ఆ యభాగిని యెట్టి శిశువును గనెనో యేమయ్యెనో తెలియదు. (1941 మే "ఆంధ్ర")

## కృష్ణా పత్రిక

కృష్ణా పత్రిక అనగానే దానితో విడదీయరాని ముట్నూరి కృష్ణారావుగారి వ్యక్తిత్వంవల్ల రాజకీయ చైతన్యమే ముందుగా స్ఫురిస్తుంది. కాని సాహిత్యానికి యీ పత్రిక చేసిన సేవ నిరుపమానం. ఆధునిక సాహిత్యంలోని ప్రక్రియా వైవిధ్యాని కెంతగానో తోడ్పడింది యీ పత్రిక. విశ్వనాథవంటి

గొప్ప రచయితలు ఈ పత్రికలో తమ నవలలు ప్రకటించారు. సుమారు ఆరు దశాబ్దాలు ఈ పత్రిక తెలుగు వారికెంతో స్ఫూర్తి నిచ్చింది.

ఇది అప్పుడప్పుడు ఆగి పెక్కు చేతులు మారి ప్రస్తుతం పిరాట్ల వెంకటేశ్వర్లుగారి సంపాదకత్వంలో దిన పత్రికగా ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్‌నుంచి వెలువడుతున్నది.

## తెలంగాణా సాహిత్య పత్రికలు

తెలంగాణాలో ఆ కాలంలో పత్రికా నిర్వహణం చాలాకష్టాలతో కూడిన పని.[1] దానికెంతో సాహసం అవసరమై ఉండేది. తెలంగాణాలో అచ్చు యంత్రాలే లేవు. నూరేళ్ళ క్రిందట గద్వాల వనపర్తి సంస్థానాలవారు మాత్రమే మొదట అచ్చు యంత్రాలు నెలకొల్పారు. అంతేకాక తపాలా సౌకర్యాలు కూడా లేవు. 1935 లో వెలువడిన నీలగిరి పత్రికలో దాని సంపాదకులు హైద్రాబాదులో తెలుగు ప్రెస్సులేదని వగచినారు. అందువల్ల అక్కడ పత్రికా ప్రచారం చాల వెనుకబడింది. అలాంటి వాతావరణంలో కొన్ని పత్రికలు వెలువడినవంటే ఆశ్చర్య పడవలసిందే.

తెలంగాణాలో మొట్టమొదట 1915 లోనే హితబోధిని అనే తెలుగు పత్రిక ప్రారంభమైందిగాని ఒక సంవత్సరం కూడా వచ్చినట్లు తోచదు. సంపాదకుడు శ్రీనివాస శర్మ.

## తెలుగు పత్రిక (1920-25)

వరంగల్లు జిల్లా ఇనుగుర్తి అనే గ్రామంనుంచి ఒద్దిరాజు సీతారామచంద్ర రావు, రాఘవ రంగారావు అనే సోదరుల సంపాదకత్వంలో తెలుగు పత్రిక వచ్చింది. రాఘవ రంగారావుగారు సంప్రదాయ శుద్ధంగా సంస్కృతాంధ్రాలలో కృషి చేసిన విద్వద్వరేణ్యుడు. ఈ పత్రిక అనేక విజ్ఞానదాయక వ్యాసాలు ప్రకటించి అష్టకష్టాలతో అయిదేళ్ళు సేవ చేసింది.

## గోలుకొండ పత్రిక (1925-66)

కవులు కథకులు పండితులు పరిశోధకులు పత్రికా రచయితలు అయిన సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రికను 1926 లో స్థాపించారు. ఇది మొదట్లో వారానికి రెండుమార్లు వచ్చి, తర్వాత దినపత్రికగా మారింది. ప్రతాపరెడ్డి గారు 1947 వరకు - 21 సంవత్సరాలు దీనికి సంపాదకులుగా

---

1. సురవరం ప్రతాపరెడ్డిగారి వ్యాసం :
తెలంగాణము - తెలుగు పత్రికలు : సుజాత సంచిక.

వున్నారు. తర్వాత నూకల నరోత్తమరెడ్డి గారు సంపాదకులయ్యారు. గోలకొండ కేవలం రాజకీయ వార్తా పత్రిక అయినా సాహిత్యానికి, ముఖ్యంగా తెలంగాణా అజ్ఞాత కవుల రచనల ప్రచురణకు, సమకాలికులకు ప్రాధాన్య మిచ్చింది. ప్రతాపరెడ్డి గారు ముక్కుసూటిగా పోయేవారు. నిర్భీకులు. నిజాం ప్రభుత్వానికి పక్కలో బల్లెంగా నిజాం నవాబు కోఠికి దగ్గర్లో ట్రూప్ బజారులో పత్రికా కార్యాలయం స్థాపించారు. గోలకొండ నుంచి విడిపోయిన తర్వాత ప్రతాపరెడ్డిగారు 'ప్రజావాణి' అనే వారపత్రిక (1951-52) ప్రారంభించారు. అది ఉన్న కొద్ది కాలంలోనే గోలకొండ లాగ ఎంతో సేవచేసింది. గోలకొండ కన్నా ముందే నీలగిరి, ఆంధ్రాభ్యుదయము అనే పత్రికలు ముందుగా కొంత సేవ చేశాయి.

**స్మారక నామధేయాలు :**

స్వాతంత్ర్యం అనే మాట ఉచ్చరించడమే పాపమయిన కాలంలో, తెలుగంటేనే తలవంపులయ్యేకాలంలో నిజాందేవిడీ పరిసరాలలోనే గోలకొండ పత్రిక స్థాపించి, నిజాం ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించే గుండెలు తీసిన బంటు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారిని తలుచుకొంటేనే నాకు ఒళ్ళు పొంగి పోతుంది. పేరుకు తగిన ప్రతాపం అన్నిటా ఆయనది.

నేను ఆయనకు వృత్తి దృష్ట్యా ప్రతిపక్షంలోని వాడిని - ఆ రోజులలో మీజాన్ పత్రికలో పనిచేస్తున్నాను. కాని, మా యిద్దరికీ అనుబంధం భాషా శాస్త్రం. వివేకవర్ధినీ పరిషత్తులో పరిశోధన వ్యాసాలు చదివేవాళ్ళం. ఒకమారు ఆయన నంగనాచి పదానికి నంగానాచ్ - సిగ్గు లేకుండా దిసమొలతో నటించేది అనే అర్థమిచ్చే పదం - మూలమయి వుంటుందన్నారు. కాని, నేనది నంగనాచి అంటే, చేసేదంతాచేసి ఏమీ తెలియనట్టు ఉండేదని అర్థం కనుక వంగై - అమాకురాలుగా - కనిపించే నాచ్చి - నాతి, గరిత - అనే ద్రవిడ పదాలు మూలమయి వుంటాయని నా సహజ కర్కశధోరణిలో విమర్శించాను. ఆయన సహృదయంతో తీసుకున్నారు.

మీజాన్ పత్రిక ఒక సందర్భంలో ప్రత్యేక సంచిక ప్రకటించింది. దానికి నేను కోరగా, "కుతుబ్‌షాహీల సాహిత్య పోషణ" అనే వ్యాసం వ్రాసి యిచ్చారు, ఏమైనా రాజకీయంగాను, ఇతరత్రాను అభిప్రాయభేదాలు మానవత్వాన్ని తగ్గించరాదనే విశ్వాసం గలవారు ఆయన. కనుకనే అన్నిరంగాల లోను అంతగా పెరిగారు ఆయన.

ఆయన 1952 లో శాసనసభకు ఎన్నికయిన తర్వాత, ఒకమారు కలుసుకొన్నారు. "ఏమిసార్, ఏ రంగంలో చూచినా మీ ప్రతాపమే కానవస్తుందే.

నిజాం రాష్ట్రంలో 1924 లో న్యాయవాది చట్టం పుచ్చుకుని, ఆరేళ్ళు న్యాయ వాదిగా వున్నారు. 1925 లో గోలకొండ పత్రిక స్థాపించి 1949 వరకు శత్రుగర్భ నిర్భేదంగా నిర్వహించారు. రెడ్డి విద్యార్థి వసతి గృహానికి ఏడు సంవత్సరాలు కార్యదర్శిగా వున్నారు. అన్నిటికన్నా మిన్నగా, 1927 జరిగిన ప్రథమ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు అధ్యక్షత వహించే భాగ్యం పొందారు. 1942 లో 23వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులయి అప్పటి నుంచి ఉపాధ్యక్షులుగా వున్నారు. మీ తెలుగేమి తెలుగు అని ఎవ్వరో ఆక్షేపిస్తే, అచ్చ తెనుంగు కట్టమునకాది పదంబయి పొల్చు భాగ్యమున్ హెచ్చుగగన్న దేశమని ఘంటాపథంగా చెప్పి గోలకొండ కవుల సంచిక ప్రకటించి గర్వాంధుల కన్ను విప్పారు. తెలుగు వారికి తొలిసారిగా ఆంధ్రుల సాంఘిక చరిత్రను, హిందువుల పండుగలు ప్రసాదించారు. ప్రాథమిక స్వత్వములు, గ్రంథా లయోద్యమము, గోలకొండడైరీ, నైజాం రాష్ట్ర పరిపాలన, రామాయణ విశేషాలు, ఉచ్చల విషాద, తుకారాం, హైందవ ధర్మవీరులు , మొగలాయి కథలు, ప్రజాధికారములు, వెంకటరామారెడ్డి జీవితం, మున్నగు అపూర్వ రచనలు చేశారు. పరిశోధకులతో గొప్ప పరిశోధకులు పత్రికా రచయితలలో గొప్పవారు. మరి మీరు విద్యామంత్రి కాకపోవడం ఆశ్చర్యంగా వుందేః" అన్నాను.

ఆయన ఒక్క మందహాసం చేసి "మీకు రాజకీయాలు, అందులోను, సంస్థాన రాజకీయాలు - ప్యాలెస్‌కూప్స్ తెలీవు" అన్నారు.

గోలకొండ వదలిన తర్వాత "ప్రజావాణి" వారపత్రిక ప్రారంభించు నప్పుడు నన్ను పిలిచారు. నేను సన్నద్ధుణ్ణయ్యాను. కాని దురదృష్టవశాత్తు ఆయన 1953 ఆగస్టు 25న అకాల కాలధర్మం చెందడంతో నాకు ఆయనతోపాటు పనిచేసే భాగ్యం కలుగలేదు. ఆయనకు అప్పటికి 57 సంవత్సరాలు మాత్రమే. ఆయన జన్మించినది 1896 లో రాయచూరుజిల్లా అలంపురం తాలూకా ఇటికేల పాడులో. ఏళ్ళులేని ఇటికలపాడు అనేవారు తమాషాగా.

సంభాషణతో, చర్చలలో, రచనలో చతురులు ఆయన. సౌమ్యగంభీర మూర్తి (ఆయన బదికి వుంటే, విశాలాంధ్ర విచ్ఛిన్నోద్యమాలు వచ్చేవా అని నాకు అనిపిస్తుంది. అప్పుడప్పుడు) ఆయన, తెలుగుజాతి సాంస్కృతిక సమైక్యానికి ఎంతో సేవచేసిన ధన్యాత్ముడు.

**సుజాత** (1927-40, 50-53) : ఈ పత్రిక హైదరాబాద్ నుంచి ఉన్నత ప్రమాణాలతో తెలంగాణా ప్రాంత సంస్కృతి సర్వస్వంగా వసుమాల నరసింహ శర్మగారి సంపాదకత్వాన వెలువడింది. ఇందులో సురవరంవారు, మాడపాటి

వారు, రాయప్రోలువారు, శేషాద్రిరమణకవులు, ఆదిరాజు వీరభద్రరావుగారు మొదలయిన ప్రసిద్ధ రచయితల వ్యాసాలు ప్రచురింపబడేవి.

1940 లో ఈ పత్రిక ఆగిపోగా మళ్ళీ 1950 లో గడియారం రామకృష్ణ శర్మగారు సంపాదకులుగా వెలువడి 1953 లో ఆగిపోయింది. దీనిలో వ్యాసాలు, ఇతర భాషావాఙ్మయాల విమర్శలు, శబ్దచర్చలు, గ్రంథ సమీక్షలు ప్రచురితమయ్యాయి. ఈ పత్రిక ప్రచురించిన తెలంగాణా సంచిక, సారస్వత పరిషత్తు సప్తమ వార్షికోత్సవ సంచిక పేర్కొనదగినట్టివి.

**దివ్యవాణి** (1937) : సికిందరాబాదు నుండి చివుకుల అప్పయ్యశాస్త్రి గారి సంపాదకత్వంలో దివ్యవాణి పత్రిక వెలువడింది. ఇది వారపత్రిక. ఈ పత్రిక దసరా సంచికలలో విలువగల వ్యాసాలు ప్రచురించేవారు.

**విభూతి** (1940 - 43) : ఉద్దండ పండితులు బహుభాషావేత్తలు అయిన చిదిరెమఠం వీరభద్ర శర్మగారి సంపాదకత్వాన సికిందరాబాద్ నుంచి విభూతి పత్రిక వెలువడింది. ఈ పత్రిక మూడు నాలుగేళ్ళు మాత్రమే వచ్చినా అమూల్య వ్యాసాలతో, విమర్శ ప్రతి విమర్శలతో సాగింది. సురవరంవారి రామాయణ విశేషాలు, శ్రీపతి పండితుని శ్రీకర భాష్యభాగాలు దీనిలో ధారావాహికంగా వెలువడ్డాయి. వీరభద్రశర్మగారు నిర్బంధంగా కాశీ వీరశైవ పీఠానికి అధిపతిగా వెళ్ళవలసి వచ్చినందున పత్రిక ఆగిపోయింది.

వీరభద్రశర్మగారి మహాప్రతిభను గూర్చి ఒక్కమాట.

ఒకమారు వారు ఒక కన్నడ సభలో ప్రసంగిస్తున్నారు. ఆయనకు కన్నడ భాష కూడ కూలంకషంగా వచ్చు. నన్నెచోడుని కుమార సంభవంలో ఇలా వుంది అని ఒక కన్నడ పద్యం చదివారు. నేను ఆశ్చర్యపడిపోయి "కన్నడ నన్నెచోడ కుమార సంభవం వుందా శివతత్త్వసారం లాగా?" అని అడిగాను. "రామచంద్రగారూ కన్నడమేమిటి? కుమార సంభవమేమిటి?" అన్నారు. "మీరు చదివిందో?" అన్నాను. "చదవాను. ఇదిగో తెలుగు కుమార సంభవం. కన్నడం వినండి. దానిని అనుసరించి కన్నడ పద్యం చదివాను." నేనేకాదు, అక్కడ వున్న వారంతా ఆశ్చర్య సముద్రంలో పడిపోయారంటే పదరూ! ఈ పత్రికలో 'అల్లరి పిల్లలు' అనే పేరుతో పెద్దలలోపాలను తెలిపే శీర్షిక ఒకటి ఉండేది.

**తరణి** (1942) : సికిందరాబాద్ నుంచి చల్లా సుబ్బరాయ సిద్ధాంతిగారి సంపాదకత్వాన 1942 లో మొదలైంది. దీనిలో స్థానిక విద్వాంసులు పలువురు వ్రాసేవారు. ఇది కొద్ది కాలానికే ఆగిపోయింది.

**శోభ** (1947-51) : ఇది రాష్ట్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి సంపాదకత్వాన వరంగల్ నుంచి వెలువడినట్టి మాసపత్రిక. ఇందులో ప్రసిద్ధ రచయితల వ్యాసాలే కాకుండా పాశ్చాత్యకవుల పరామర్శలు, కావ్య లక్షణ సమాలోచనలు, రచయితల సంక్షిప్త చిత్రణలు, గ్రంథ సమీక్షలు ఉన్నాయి.

**స్రవంతి** (1951) : హైదరాబాద్ నుంచి దక్షిణ భారత హిందీ ప్రచార సభ అంగంగా వేమూరి రాధాకృష్ణమూర్తి గారి సంపాదకత్వాన వెలువడుతున్న మాసపత్రిక. దీనిలో హిందీనుంచి అనువాదాలు, మౌలికమైన తెలుగు రచనలు వెలువడుతాయి. చివరన హిందీ ప్రచార సభా కార్యకలాపాల నివేదికలు వుంటాయి. సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణరావు, కాటూరి వేంకటేశ్వరరావు గార్లవంటి పెద్దల స్మారక సంచికలు, రజతోత్సవ సంచిక పేర్కొన దగినట్టివి.

ఇవికాక బండారు చంద్రమౌళీశ్వరరావుగారి సంపాదకత్వాన వెలువడిన ప్రగతి వారపత్రిక, పి. వి. సదాశివరావుగారి సంపాదకత్వాన కాకతీయ వార పత్రిక, బిదురు వెంకట శేషయ్యగారి సంపాదకత్వాన మేధావి మాసపత్రిక, వెల్దండ ప్రభాకరరావుగారి సంపాడకత్వాన జయభారత్ మాసపత్రిక, అడ్లూరి అయోధ్యరామ కవిగారి సంపాదకత్వాన భాగ్యనగర్, తాళ్ళూరి రామానుజ స్వామిగారి నేతృత్వాన సారథి వారపత్రిక వెలువడి ఎంతో సాహిత్యసేవ చేశాయి. ప్రస్తుతం పోతుకూచి సాంబశివరావుగారి సంపాదకత్వాన వెలువడు తున్న విశ్వసాహితి దిన, మాసపత్రికలు విశిష్టంగా సేవ చేస్తున్నాయి. ఈ సంస్థకు చెందిన యూనిలిట్ ఆంగ్ల మాసపత్రిక తెలుగువారి ప్రతిభను ఆంగ్లం ద్వారా ఇతరులకు తెలియజేస్తున్నది.

పూర్వంలాగే తర్వాత కూడ వివిధ కళారీతులను ప్రత్యేకంగా తెలిపే పత్రికలు, వైద్య పత్రికలూ వెలువడ్డాయి.

## నాట్యకళ

నాట్యకళను (1955) ప్రాచ్య పాశ్చాత్య నాట్య రీతులలో నిష్ణాతులైన మిత్రులు శ్రీనివాస చక్రవర్తిగారు రంగస్థల నాటక నాట్యైక ప్రవణమైన మాసపత్రికగా ఈ శతాబ్ది ఐదవదశకంలో ప్రారంభించారు. అది కొంతకాలం నడిచి ఆగిపోయింది. నాట్యకళ రంగస్థల శాస్త్రానికి అభినయ శాస్త్రానికి విశిష్టమైన సేవచేసింది.

తర్వాత దానిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ శ్రీనివాస చక్రవర్తిగారే సంపాదకులుగా కొన్నాళ్ళు నిర్వహించింది.

## ధన్వంతరి

ఇలాగే కొన్ని విశిష్ట శాస్త్రాలను ప్రచారంచేసిన పత్రికలలో ధన్వంతరి ఒకటి. ఇది ముక్త్యాలనుంచి వెలువడుతూ మహోపాధ్యాయ, ఆయుర్వేద భూషణ డాక్టర్ వేటూరి శంకరశాస్త్రిగారి సంపాదకత్వాన మూడు దశాబ్దాలకు పైగా ఆయుర్వేదానికే కాక సాహిత్యంలోని వివిధ శాస్త్రాల పరిశోధనకై కూడా కృషిచేసింది. మొదట్లో కొన్నాళ్ళు దీనిని ఆచంట లక్ష్మీపతిగారు నిర్వహించారు.

ఈ పత్రిక కొన్ని ప్రాచీన వైద్య గ్రంథాలను ధారావాహికంగా ప్రచురించింది. నేను మహా వైయాకరణుడు ఎలకూరి బాలసరస్వతి రచించిన శారీరం అనే సుశ్రుత శారీర ఆంధ్ర పద్యానువాదాన్ని సంస్కరించి దీనిలో ప్రచురించాను.

ఆయావృత్తులకు సంబంధించిన పెక్కు పత్రికలు చేనేత మొదలైనవి కూడా సాధారణ సాహిత్య భాషా విషయిక వ్యాసాలు ప్రచురిస్తూ సాహిత్య సేవ చేశాయి.

## పరిశోధన (1953-56)

ఈ సందర్భంలో పరిశోధన పత్రికను గురించి ప్రత్యేకంగా చెప్పాలి. తెలుగు సాహిత్యంలో ఉన్నత ప్రమాణాలు ఆదర్శంగా, నిష్పక్షపాతం, నిర్భీతి సాధనాలుగా, వాణిజ్య ప్రకటనలు సాహిత్య పత్రికలలో వుండరాదనే నిశ్చయంతో నేను (తిరుమల రామచంద్ర), మిత్రుడు డాక్టర్ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య ఈ పత్రికను అసిధారావ్రతంగా నడిపాము. ఇది ద్వైమాస పత్రిక, మద్రాసునుంచి వెలువడేది. ప్రభాకర సంస్మరణ సంచిక, సోమనాథ సంచిక, ఆంధ్రనాటక పితామహ సంస్మరణ సంచిక, గురజాడ అప్పారావు సంస్మరణ సంచిక, బుద్ధసంచిక అనే అయిదు ప్రత్యేక సంచికలు దేశంలోని ప్రముఖ పరిశోధకుల వ్యాసాలతో వెలువరించాము. కథలూ, కవిత్వమూ ప్రచురించరాదనే నియమం పాటించాము. దేశిరచనలు, సాహిత్యమీమాంస-తెలుగు తోబుట్టువులు, టీక-టిప్పణి, పురాతత్త్వం, కవిహృదయం, ఛందస్సు అలంకారం, అముద్రిత రచనలు, చరిత్రకెక్కని చరితార్థులు అనే శీర్షికలు నిర్వహించాము. చరిత్రకెక్కని చరితార్థులు శీర్షిక విశేషంగా పాఠకులను ఆకర్షించింది. దీనిలో చరిత్రకారులను పరిశోధనార్హమైన అపూర్వ విషయాలు

ప్రచురించాము. సంపాదకుల న్యాయ ప్రవణతకు ఒక సంపాదకీయం పేర్కొంటాను:

"ఇటీవల జరిగిన రెండు సంగతులలో ఒకటి హర్షింపదగినది; మరొకటి హర్షింపదగనిది.

మొదటిది కీర్తిశేషులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర నేటి తెలుగు సారస్వతంతో ఉత్తమమోత్తమంగా పరిగణితమై కేంద్ర సాహిత్య అకాడమీచే బహూకృతం కావడం, ఇది ఆంధ్రులకు గర్వహేతువు.

రెండవది అంతరాంతరాలలో అణగివున్న ఈర్ష్యాద్వేషాలకు సాహిత్య రూపమిచ్చి కింవదంతులు, ఆపవాదులు కల్పించే చిత్తవృత్తి,

ఆదేమి దైవదుర్విలసితమో, కావ్యాల కర్తృత్వాన్ని శంకించడం, కవులపై అపవాదులు మోపడం మనకు శతాబ్దులుగా అలవాటు!! భారతం నన్నయ రచన కాదు. అతని కన్నడమిత్రుడు నారాయణభట్టు రచించినది. కవిజనాశ్రయ కర్త మల్లయ రేచనకాదు, భీమన. భాస్కర రామాయణకర్త హుళక్కి భాస్కరుడా? మంత్రి భాస్కరుడా? రంగనాథరామాయణం రంగనాథునిదే. గోనబుద్ధారెడ్డి ఎలా చెప్పగలడు? క్రీడాభిరామం శ్రీనాథుడు చెప్పి వల్లభార్యుని పేరుపెట్టాడు. వల్లభార్యుడు అంతటి వాడైతే మరొక రచన ఏదీ? బుద్ధి తెలిసి నప్పటినుంచీ యుద్ధాలతో గడపిన కృష్ణరాయలు ఆముక్తమాల్యదను అల్లగలరా? పెద్దన పాండిత్య ప్రకర్షే అది. ఉత్తరరామాయణం చెప్పిన వాడు పుష్పగిరి తిమ్మనార్యుడా? కంకంటి పాపరాజా? చిన్నయసూరి మును మదుపజ్ఞంబు అని బాల వ్యాకరణం స్వోపజ్ఞంగా చెప్పుకొన్నాడు కాని శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి సంస్కృత కారికలను కాపీకొట్టినవాడే. ఆలాటిదే నేడు కన్యాశుల్క కర్తృత్వంపై చెలరేగిన కుశంక. ఇలాటి వదంతులపై కుతూహలం కలవారు ఈ కుశంకలకు హర్షిస్తారేమోగాని సాహిత్య మర్మజ్ఞులైన సహృదయు లెవరూ సంతసించరు; సహించరు.[1]

అగుమంచికథ, బులుసు వెంకటరమణయ్యగారి అలంకార చరిత్ర, కుంటి మద్ది శేషశర్మగారి అలంకార సర్వస్వం మున్నగు గ్రంథాలను ఈ పత్రిక ప్రచురించింది.

## భావ కవిత్వం మలుపు

సాంఖ్యాయనశర్మగారే కల్పలతతోనే భావ కవితకు, నవ్యసాహిత్యానికి

---

1. పరిశోధన, సంచిక 7.

 Lalitha. T

నార్లు పోశారని ఇదివరకే అన్నాను. 20వ శతాబ్దం ప్రథమ పాదంలో భావ కవిత బాగా పూచింది. రాయప్రోలువారి తృణకంకణం 1914 లో వెలువడింది. ప్రథమ పాదం చివరను, ద్వితీయ పాదంలోను భావకవితకు ఆలంబనంగా పెక్కు పత్రికలు వచ్చాయి. సాహితి (1920), సఖి (1924), బులుసు వెంకట రమణయ్యగారి సంపాదకత్వాన మద్రాసు నుంచి చంద్రిక (1935-38), కొంపల్లి జనార్దనరావు నడిపిన ఉదయిని (1936), నవ్య సాహిత్య పరిషత్తు అంగంగాను, వ్యవహారభాషకు, భావకవితకు పట్టుగొమ్మగాను తెలికచర్ల వెంకటరత్నంగారి నిర్వహణలో వచ్చిన త్రైమాసపత్రిక ప్రతిభ (1936-40), విశ్వనాథ సత్యనారాయణగారి సంపాదకత్వంలో ప్రథమంగా 1927 లో కొన్ని సంచికలు మాత్రమే వచ్చి తర్వాత 1960 లో పునరుద్ధారం పొందిన జయంతి పత్రిక, పాటిబండవారి వీణ, విద్వత్కవి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు పల్లిపాలెం నుంచి వెలువరించిన ఆంధ్రి, పందిరి మల్లికార్జునరావుగారి కిన్నెర, రాజమండ్రి నుంచి వెలువడ్డ సంస్కృతి (సరస్వతీ పవర్ ప్రెస్ వారు వెలువరించేవారు), మరీ ఇటీవల 1961-64 లలో సామవేదం జానకిరామశర్మ గారి సంపాదకత్వాన వెలువడిన సాహితి - ఈ విధంగా యెన్నో పత్రికలు భావ కవిత్వానికి, కాల్పనిక కవిత్వానికి, వ్యవహారభాషకు దోహదం చేశాయి.

ఈ పత్రికలలో విశిష్టత ఆధునిక కవితలు, శోకగీతాలు, ఖండికలూ, కథా కావ్యాలూ, భావ గీతాలు, దేశభక్తిగీతాలు వెలువడటం. బడుగు ప్రజల జీవితాలపై కథలూ, గేయాలూ, ఆంగ్ల సంస్కృత హిందీ తమిళ కన్నడ బెంగాలీలలోని ఉత్తమ సాహిత్య రీతుల అనువాదాలు వెలువడటం కూడా జరిగింది.

## కమ్యూనిస్టు పత్రికలు

1933-34 లో ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టుల ఉద్యమం ప్రారంభ మైంది. పుచ్చలపల్లి సుందరయ్యగారు కమ్యూనిస్టు మ్యానిఫెస్టోను కమ్యూనిస్టు కరపత్రం అనే పేరుతో అనువదించి పాఠాలు చెప్పారు. ఆ పాఠాలు విన్న వారిలో నేనూ ఒకణ్ణి. ఈ ఉద్యమం 1937 నాటికి రాష్ట్ర వ్యాప్తంగా వేళ్ళూ నింది. సంపూర్ణ స్వాతంత్ర్య సిద్ధికై తహతహ లాడుతున్న అతివాదశక్తులు కమ్యూనిజంవైపు మొగ్గుతున్నాయి. కాంగ్రెస్‌లోని వామపక్షీయులకు సోషలిస్టు లకు కమ్యూనిస్టులకు ప్రత్యేకంగా ఆ రోజులలో పత్రికలు లేవు. కొన్ని దిన పత్రికలే వీరి వ్యాసాలను, రచనలను ప్రచురిస్తూ వుండేవి. 1935 లో ప్రభ

అనే పక్ష పత్రిక మార్క్సిస్టు భావాల వ్యాప్తికి వెలువడిన తొలి పత్రిక. ఇలా మరికొన్ని పత్రికలు మార్క్సిస్టు భావ ప్రచారానికి తోడ్పడ్డాయి.

## నవశక్తి

ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో అంతర్గతమై వుండేది. ఈపార్టీ 1937 డిసెంబరు 15 న తొలిసారిగా రాజమండ్రి నుంచి 'నవశక్తి' వారపత్రికను ప్రచురించసాగింది. మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకుడు. రాజమండ్రి నుంచి ఇది బెజవాడకు తరలింది. కొత్త సంపాదక వర్గం మద్దుకూరి చంద్రశేఖరరావుగారు ప్రధాన సంపాదకులుగా ఏర్పడింది. కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకటరామయ్య గార్లు సంపాదక వర్గంలో వుండేవారు.

పార్టీ పత్రిక సమష్టి ఉద్యమ నిర్మాతగా వుండాలని లెనిన్ చెప్పిన ధ్యేయంతో ఇది ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభం వరకు పనిచేసింది. ఈ పత్రిక ప్రచురించిన త్రిపురా కాంగ్రెస్ సంచిక, రష్యా సంచిక ప్రజల మన్ననలను పొందాయి. సంపాదకులు మొదలు కార్మికుల వరకూ అందరూ కలిసికట్టుగా అరమరికలు లేక పనిచేసేవారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామారంభంలో దీనిని నిషేధించాలని ఉమ్మడి మద్రాసు కాంగ్రెసు ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు ఆలోచిస్తూ ఉండగా అలాటి అవకాశం ఇవ్వకుండా నిలిపివేశారు. రాజగోపాలచారిగారు "సుందరయ్య నన్ను బోల్తా కొట్టించాడు" అని అన్నారట.

## స్వతంత్ర భారత్

నవశక్తిని ఆపివేసినా దానిలోని వ్యాసాలు రచనలు అభ్యంతరకరమైనవనే సాకుతో సంపాదకులపై వారంట్లు పుట్టాయి. కమ్యూనిస్టు నాయకులు అజ్ఞాతవాసంలో వుండవలసి వచ్చింది. అప్పుడు 1939-42 మధ్య 'స్వతంత్ర భారత్' అనేరహస్య పత్రికను వారు ప్రభుత్వానికి పట్టు బడకుండా ముద్రించి ప్రచారం చేశారు.

ఈ పత్రిక అచూకీకోసం పోలీసులు జిల్లా అంతటా ఏకకాలంలో సోదా జరిపినా ఫలితం శూన్యం. అప్పుడు సి.ఐ.డి. శాఖలో ముఖ్యుడయిన దప్పుల సుబ్బారావు పప్పులేమీ పుడకలేదని అనే వారు. ఈ పత్రిక తమ దగ్గర పెట్టుకున్నారని కొందరిని పోలీసులు బాధించారు.

## ప్రజాశక్తి

కమ్యూనిస్టు నాకుయలు చాలా మంది అజ్ఞాతవాసం నుంచి బయటకు

వచ్చినతర్వాత 1942 జూన్ 17న ప్రజాశక్తి వారపత్రిక ప్రారంభమైంది. కాట్రగడ్డ రాజగోపాలరావు, చలసాని వాసుదేవరావు, తుమ్మలవెంకటరామయ్య, కొండేపూడి లక్ష్మీనారాయణ గారలతో సంపాదకవర్గం ఏర్పడింది. ఇది పూర్తిగా భారత కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రకమిటీ పత్రిక. ఇదే తొలిపార్టీ పత్రిక. ఈ వారపత్రికలోను, దిన పత్రికలోను ప్రముఖ చిత్రకారుడు మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే వ్యంగ్య చిత్రాలు గీశారు, రచనలు కూడా చేశారు.

## ప్రజాశక్తి దిన పత్రిక

ఆ రోజులు కమ్యూనిస్టుపార్టీ ప్రజలపార్టీగా రూపొందుతున్న కాలం. ఈ పత్రిక దానికి అండగా నిలబడింది. 1945 డిసెంబరు 3వ తేదీన ఈవారపత్రిక దినపత్రికగా అవతరించింది. ప్రభుత్వపు దమన నీతిని తట్టుకుంటూ 1948 ఏప్రిల్ 22 వరకు వచ్చింది. అంతకుముందు ఎన్నోసార్లు పోలీసులు దాడి చేశారు. చివరకు పత్రికను నిషేధించింది ప్రభుత్వం. ప్రజాశక్తి ప్రచురణలను, ముద్రణాలయాన్ని, గ్రంథాలయాన్ని మలబారు పోలీసులు ధ్వంసం చేశారు.

ఆ విధ్వంసకాండనాటి చిన్న సంఘటనను ఒక దానిని తెలుపుతాను. నా మిత్రుడు బిట్రగుంట రామచంద్రరావు ప్రజాశక్తిలో సబ్ ఎడిటర్‌గా పని చేసేవారు. ఆయన భోజనం చేస్తుండగా పోలీసులు దాడి జరిపారు; వంటింట్లో పదార్థా లన్నిటినీ బూటు కాళ్ళతో తొక్కి లాఠీలతో కొట్టారు. ఈయన వీపుమీద కూడా ఒక దెబ్బ పడింది.

"ఉండండయ్యా, పెరుగన్నం వదలరాదని పెద్దలంటారు" అంటూ ఈయన విశ్వామిత్రునిలాగ ఎడమచేయి పైకెత్తి భోజనం ముగించాడట. ఎడమ చేతికి లాఠీదెబ్బలు పడ్డాయనడం చెప్పనక్కరలేదు. రాష్ట్రంలో దమనకాండ తగ్గింది. కమ్యూనిస్టు నాయకులంతా కొందరు విడుదలయ్యారు, కొందరు అజ్ఞాతవాసం నుంచీ వెలుపలికి వచ్చారు.

## విశాలాంధ్ర దిన పత్రిక

1952 జూన్ 22న విశాలాంధ్ర దినపత్రికగా అవతరించింది. మద్దుకూరి చంద్రశేఖరరావు, కంభంపాటి సత్యనారాయణ, కాట్రగడ్డ రాజగోపాలరావు గార్లు సంపాదకవర్గం. అప్పటినుంచి అది ప్రజోద్యమాలకు పట్టుగొమ్మై వుంది.

దమనకాలంలో కమ్యూనిస్టు పార్టీ సందేశాన్ని ప్రజలకు పెక్కుపత్రికలు అందించడానికి ప్రయత్నించాయి. వాటిలో కొన్ని ఇవి : వాటి కాలం 1948-52 మధ్య.

## జనత

ఈ పత్రికకు కీ ర్తిశేషుడు వాసిరెడ్డి భాస్కరరావు, బొమ్మారెడ్డి వెంక టేశ్వరరావు గారలు సంపాదకత్వం వహించారు. ఇది రెండేండ్లు వెలువడింది. ఇది పక్ష పత్రిక.

మద్రాసు నుంచి ఎస్. వి. నరసయ్యగారి సంపాదకత్వాన సందేశం వార పత్రిక 1950 చివరి నుంచి వెలువడింది. ఇది దమనకాలానంతరం కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), మహీధర రామమోహనరావుగార్ల కృషితో సిద్ధాంత ప్రచార మాసపత్రికగా రూపొందింది.

## విశాలాంధ్ర

సెట్టి ఈశ్వరరావుగారి సంపాదకత్వాన మద్రాసు నుంచి ఈ పత్రిక 1949-52 వరకు మాస పక్ష పత్రికగా వెలువడి సాహిత్య సాంస్కృతిక రంగాలకు విశిష్టసేవ చేసింది.

తాపీ ధర్మారావుగారి జనవాణి ప్రజాస్వామ్య సూత్రాలకై నిలిచిన స్వతంత్ర అభ్యుదయ పత్రిక.

నవశక్తిలో శ్రీశ్రీ గీతాలు దేశచరిత్రలు, మాయంటావా మిథ్యంటావా మొదలైనగీతాలు, ప్రజాశక్తిలో లేలే రష్యాగేయం ప్రచురితమయ్యాయి.[1]

## మరొక మలుపు : అభ్యుదయవాదం

1933లో జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చాడు. అతడు పెక్కు మంది మేధావులను కళాకారులను శాస్త్రజ్ఞులను నిర్బంధంలో వుంచాడు. ఫ్రాన్సును కబళించడానికి యుద్ధకాహళులు ఊదాడు. పారిస్‌లో సంస్కృతి పరిరక్షణకు ప్రపంచ రచయితలసంఘం ఏర్పడింది. లండన్‌లో ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ ఏర్పడింది.

1936 లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. దీనికి అబ్బూరి రామకృష్ణరావుగారు ఆంధ్ర ప్రతినిధిగా వెళ్ళారు. ఫైజ్‌పూర్ కాంగ్రెస్‌లో శ్రీమతి సరోజినీనాయుడు ఇష్టాగోష్ఠి జరుపుతూ ఆంధ్రలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటు చేయాలని సూచించారు. ఈసభకు తుమ్మల వెంకటరామయ్య, క్రొవ్విడి లింగరాజుగార్లు

---

1. విశాలాంధ్ర ప్రత్యేక సంచికలో శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారి వ్యాసం; 1961-ఏప్రిల్ 7.

హాజరయ్యారు. 1934-43 మధ్య కార్మిక కర్షకులను చైతన్యవంతులను చేసే ప్రబోధ గీతాలు చాలా వెలువడ్డాయి.

అఖిలభారత ప్రొగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ 1942లో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణానికి తుమ్మల వెంకటరామయ్య, తాపీ మోహనరావు, చదలవాడ పిచ్చయ్య, శ్రీరంగం శ్రీనివాసరావుగార్లతో ఒక సంఘం ఏర్పాటుచేసింది. ఈ సంఘం నిర్ణయం ప్రకారం 1943 ఫిబ్రవరి 13,14లలో తెనాలిలో ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. దీనిలో తుమ్మల వెంకటరామయ్యగారు రచించిన 'ఇంగ' అనేనాటకం ప్రదర్శితమైంది,

అభ్యుదయ రచయితల సంఘం పక్షాన ఒక మాసపత్రికను వెలువరించడానికి నిర్ణయం జరిగింది. డిక్లరేషన్‌కు ప్రయత్నిస్తే దొరకలేదు. కనుక ఏదో ఉన్న పత్రికనే తన భావాల ప్రచారానికి వినియోగించుకోవాలనే నిర్ణయం జరిగింది.

## తెలుగు తల్లి (1938-44)

ఈ నిర్ణయం మేరకు పాటిబండ మాధవశర్మగారు సంపాదకులుగా వున్న 'వీణ' మాసపత్రికను నిర్వహించడానికి ప్రయత్నించగా ప్రభుత్వం ఒప్పుకోలేదు. అప్పుడు సికిందరాబాద్ నుంచి వెలువడుతున్న తెలుగుతల్లిని అభ్యుదయ పత్రికగా నిర్వహించారు. దీనికి రాచమళ్ళ సత్యవతీదేవి సంపాదకురాలు. మిత్రులు సెట్టి ఈశ్వరరావు దీనిని నడిపారు కొంతకాలం (1944-46).

## అభ్యుదయ (1946-75)

పిదప అభ్యుదయ పత్రిక 46లో వెలువడి 48 లో ఆగిపోయింది. ఇది మొదట త్రైమాస పత్రికగాను, పిదప మాసపత్రికగానూ వచ్చింది. మొదట దీని సంపాదక వర్గంలో కొమర్రాజు వినాయకరావు, చదలవాడ పిచ్చయ్య, ప్రయాగ కోదండరామశాస్త్రి వున్నారు. మరల 55 నుంచి 59 వరకు మద్రాసు నుంచి వచ్చింది. అప్పుడు తుమ్మల వెంకటరామయ్య, అనిసెట్టి సుబ్బారావు, కొడవటిగంటి కుటుంబరావు, కె. వి. రమణారెడ్డిగార్లు సంపాదకులుగా వున్నారు. మరల యిది 1970 నుంచి 75 వరకు హైదరాబాద్ నుండి వెలువడింది. గిడుగు రామమూర్తి సంచిక, నవలా సంచిక మొదలైన ప్రత్యేక సంచికలు వెలువరించింది.

ప్రస్తుతం డాక్టర్ ఏటుకూరి ప్రసాద్‌గారి సంపాదకత్వంలో హైదరాబాద్ నుంచి వెలువడుతున్నది.

## దినపత్రికలు, సచిత్రవారపత్రికల సేవ

20వ శతాబ్ది రెండవ మూడవ పాదాలలో కేవలం సాహిత్య పత్రికలే గాక రాజకీయాలకు వార్తలకు ప్రాధాన్యమిచ్చిన దినపత్రికలు, వారపత్రికలు కూడా కథలు వ్యాసాలు నాటికలు భాషాతత్త్వ వ్యాసాలు సమీక్షలు విమర్శలు కవితలు ప్రచురించి సాహిత్యాన్ని పెంచాయి.

ఆంధ్రపత్రిక 1908 లో బొంబాయిలో ప్రారంభమైనప్పటి నుంచి మాత్రమే కాక మద్రాసుకు తరలివచ్చి దినపత్రికగా మారిన తర్వాత రోజూ ధారావాహికంగా నవలలను ప్రచురించడమేకాక ఆదివారపు సారస్వతానుబంధంలోను, వారపత్రికలోను, ఏటా ఉగాదికి వచ్చే సంవత్సరాది సంచికలలోను సాహిత్యానికే ప్రాధాన్యమిచ్చింది. మానవల్లి రామకృష్ణకవిగారు సారస్వతానుబంధంలో పుష్పాంజలి శీర్షిక కింద వివిధ సాహిత్య విషయాలు వ్రాసేవారు. విశ్వనాథ సత్యనారాయణగారి నవలలెన్నో ఆ విధంగా దినపత్రికలో వచ్చినట్టివే. సాక్షి వ్యాసాలు వారం వారం వచ్చినట్టివే. అడివి బాపిరాజుగారి నవలలు మీజాన్ దినపత్రికలో రోజూ వెలువడేవి.

ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతిమున్నగు పత్రికలుకూడ దినవార ప్రచురణల ద్వారా సాహిత్యాన్ని పెంచినవే. కృష్ణాపత్రిక కేవలం రాజకీయాలకే పుట్టినా దానివ్యాసాలు, చర్చలు, వడగళ్ళు మున్నగునవన్నీ సాహిత్యమే. ప్రజామిత్ర, చిత్రగుప్త, ఆనందవాణి, జనవాణి, ప్రజావాణి మున్నగు వారపత్రికలు కథలు, నాటికలు ప్రచురించి ఎంతో సాహిత్యసేవ చేశాయి. సాధన పత్రికలో వదరుబోతువంటి గొప్ప గ్రంథాలు వచ్చాయి. విశాలాంధ్రలో మహీధర రామమోహనరావుగారి పెక్కు నవలలు- ఓనమాలు, మృత్యువునీడల్లో, స్వయంవరణం, ఇక యీ కథ యింతే ఆ పత్రిక సారస్వతానుబంధంలో వచ్చాయి. సమకాలిక రాజకీయ పరిస్థితిని సమన్వయ పరచి నవలలు వ్రాసే శక్తి విశాలాంధ్రే ఇచ్చిందని రామమోహనరావుగారన్నారు. మల్లారెడ్డి గేయాలు, రాంభట్ల కృష్ణమూర్తిగారి కార్టూన్‌గేయాలు, కిషన్‌చందర్ నవలల అనువాదాలు, నా చిరస్మరణ అనువాదం విశాలాంధ్ర సారస్వతానుబంధంలో వచ్చినట్టివే.

ఇవన్నీ జాతీయతను, విశ్వమానవ సౌభ్రాత్రాన్ని, అభ్యుదయ భావాలను వివిధ ప్రక్రియల ద్వారా పెంచాయి.

## పత్రికల భాష

తెలుగు పత్రికల భాష మొదట శిష్టవ్యావహారికమే. దీనికి ఉదాహరణగా వృత్తాంతినిలోని లేఖ ఒకటి ఇదివరకే మొదట్లో ఇచ్చాను. వర్తమాన తరంగిణికి

1842 ఆగస్టు 13 లో కడప నుంచి సంపాదకునికి - కాదు ఎడిటరుగారికి - పంపిన వార్తా లేఖ భాష చూడండి :-

కడప షహరులో చేరిన ఖాదరుఖానుపేటలో సుమారు 15 రోజుల కిందట పగలు 2 ఝాముల వేళ అకస్మాత్తుగా నిప్పు అంటుకొని సుమారు 10 - 15 తురకల పూరియిండ్లు కాలిపోయినందున వారి తాలూకు సామాను భద్రపరచడమునకు అవకాశము లేక - కొన్ని వస్తువులు మాత్రం పరశురామా ర్పితము అయినవిగాని ఈశ్వర కటాక్షమువల్ల జనులకు ఖేదం లేకపోయినదని తెలియచేయడమునకు చాలా సంతోషంగా వున్నది.

ఇక్కడ 20 రోజులనుంచి రాత్రి పగలు అవిరామంగా గొప్ప ధ్వనితో పడమటిఘాలి కొట్టుతూవుండి యిప్పటికి సుమారు 4-5 రోజులుగా నిలిచి వున్నది. ఇది చెడ్డఘాలి అని ఇక్కడివారు చెప్పుతూ వున్నందుకు దృష్టాంత ముగా కొందరికి తలనొప్పి చలిజ్వరం వగైరాలు సంభవించివున్నవి. మరిన్ని యిక్కడ వర్షములేక నీలి వగైరా పయిరుకు చెరుపుగా వుండడమే కాకుండా బావులు కాలువలు వగైరాలు ఎండిపోయినందున జనులు నీళ్ళకు యీ షహరులో వుండేవారున్ను చుట్టుపక్కల నుంచి వచ్చే పాంథులున్ను చాల ప్రయాసపడు తున్నారు.

యిందువల్లనున్ను కర్నూలు మొదలయిన ప్రాంతములలో సంభవించి యుండే ప్రకారం యీ జిల్లాలో చేరిన ప్రొద్దుటూరులో నున్న ఉపగ్రామాలలో నున్న మటిడివ్యాధి సంభవించి అనేకమంది నష్టపోయినట్లు వినబడడమువల్ల బహుమంది విచారపడుతూ వున్నారు. అయితే పోరుమామిళ్ళ మొదలు కంభం తాలూకా పర్యంతంవరకు వర్షము కురిసి చెరువులు మొదలయిన వాటికి నీళ్ళు వచ్చినది చిత్తగించవలెను. ఇక్కడ జరిగే యింకా కొన్ని సంగతులున్ను తమ యెడిటోరియా గురించిన్ని వెంబడిగానే వ్రాసుకుంటున్నాను.

తమ యిష్టుడైన

మం. వెం. శా.[1]

వర్తమాన తరంగిణిలో మేనేజరు ప్రకటన యీ విధంగా వుంది:-

**ప్రకటన** : మా పత్రికను యీ వరకు ప్రతి బుధవారపు ఉదయాన ప్రచురము చేస్తూ వుంటిమి. అయితే అడుగడుగుకున్నూ మంగళవారపు గెజెట్టి మంగళవారం రాత్రి వస్తున్నది గనుక అది తర్జుమాచేసి అచ్చువెయ్యడానకు సావుకాశం చాలనందునున్ను అధవా కష్టపడి సిద్ధంచేసినాగాని బంట్రోతులు అప్పగించడంలో జరిగించే అజాగ్రత్తవల్లనున్నూ సావుకాశపడుతూ వచ్చినది

1. బ్రౌను జాబులు : 33 - 34 పుటలు, బంగోరే.

